శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపూర్ణగ్రంథావళి

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

**సంకలన కర్త :**

**శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి**

**ప్రచురణ**

**శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠం**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2013**

**Sri Venkateswara Laghukrutulu**

By Sri Veturi Prabhakara Sastry

T.T.D. Religious Publications Series No.



2013

Copies : 1000

Price.Rs...............

Published by

M.G. Gopal,I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati -517 501

D.T.P. SVPSVP., T.T.D. Tirupati.

Printed at
Tirumala Tirupati Devasthanams, Press.
Tirupati.

*ఓం నమో వేంకటేశాయ*

# ముందుమాట

**యం.జి.గోపాల్ ఐ.ఏ.ఎస్.**
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు,
తిరుపతి.

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రజల్లో ధార్మిక చింతనను కలిగించడంతో పాటు ధార్మిక సాహిత్యాన్ని ముద్రించి విశేషంగా ప్రచారం చేస్తున్నది. తిరుమలలో వెలసిన అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీ వేంకటేశ్వరస్వామిపై భక్తిభావనతో రచనలు చేసినవారెందరో ఉన్నారు. వారిలో అన్నమయ్య ప్రప్రథముడు. అన్నమయ్య రచించిన తాళపత్రగ్రంథాలనేగాక ప్రాచీనకవుల తాళపత్రగ్రంథాలను కూడా సేకరించి పరిశీలించి, పరిష్కరించి అచ్చువేసిన పరిశోధకులలో అగ్రగణ్యులు శ్రీమాన్ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

కీ.శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీ.శ. 1888 ఫిబ్రవరి 7వ తేదీన కృష్ణాజిల్లా పెదకళ్ళేపల్లిలో శేషమ్మ, సుందరశాస్త్రి అనే పుణ్యదంపతులకు జన్మించారు. సంస్కృతాంధ్రభాషలో విశేషపాండిత్యాన్ని సంపాదించిన శాస్త్రిగారు మద్రాసులో కొంతకాలం తెలుగుపండితునిగా పనిచేశారు. తర్వాత మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో పరిశోధక పండితునిగా పనిచేసి అనేక గ్రంథాలను వెలుగులోనికి తెచ్చారు. ఉత్తమ పరిశోధన గ్రంథాలను పరిష్కరించి ముద్రించారు. తిరుపతిలోని తి.తి.దే ఓరియంటల్ కళాశాలలో ఆచార్యులుగా పనిచేస్తూ తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనల రాగిరేకులను పరిష్కరించి వెలుగులోనికి తెచ్చారు. ఎంతోమంది శిష్యులను ఉద్దండపండితులుగా తీర్చిదిద్దారు.

యోగివర్యులు, ఉత్తమపరిశోధకులు, బహుముఖప్రజ్ఞాశాలి, కవి, ఆత్మదర్శనులైన శ్రీ శాస్త్రిగారి సాహిత్యసేవను గుర్తించి తి.తి.దేవస్థానంవారు 2007వ సం॥లో శ్వేతభవనంలో "శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠాన్ని" స్థాపించారు. ఈ పీఠం స్థాపించిన నాటినుండి వారు పరిష్కరించి రచించిన గ్రంథాలను ముద్రించి ఆంధ్రసాహితీ లోకాని కందించడానికి తిరుమల తిరుపతి దేవస్థానం., శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠం శ్రీకారం చుట్టింది. ఈ క్రమంలోనే ఇప్పటికి సుమారు పది గ్రంథాలకుపైగా ముద్రించింది. ఈ వరుస క్రమంలో వచ్చిందే **"శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు"** అనే గ్రంథం. ఈ గ్రంథాన్ని తెలుగు సాహిత్యాభిమానులందరు తప్పక ఆదరించి పఠించగలరని ఆశిస్తున్నాము.

**(యం.జి.గోపాల్ )**

# తొలిపలుకులు

(తృతీయ ముద్రణలోనిది)

విమర్శగ్రంథములే కాక శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామివారి మీఁద వెలసిన ప్రాచీనరచనములెల్లంగూడఁ బ్రకటించుటయే మా సంకల్పము.

స్వామివారి మీఁది రచనలనన్నింటిని వేర్వేర నీ క్రింది తీరున విభాగింపవచ్చును.

1. శ్రీ తాళ్లపాకవారి రచనలు
2. శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు
3. శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యకథాప్రబంధములు.
4. శ్రీ స్వామివారి కర్పితములైన, కాని, ప్రాచీనకృతులలోని స్వామివారి స్తుతి వర్ణనాత్మక రచనాభాగములు.

1. పై విభాగములలో తాళ్లపాకవారి రచనలు గొన్ని యిక్కడనే యిప్పటికే ముద్రితములయినవి. కడమవి కడముట్ట ముద్రితములు గానున్నవి.

2. శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు : ఇవే ఇప్పుడు ముద్రితము లైనవి.

3. శ్రీ వేంకటేశ్వరమాహాత్మ్యకథా ప్రబంధములలో నిప్పటికే యితరత్ర ముద్రితములయినవి తరిగొండ వేంకమాంబ వేంకటేశ్వర మాహాత్మ్యాదులు గాక శ్రీనివాసవిలాససేవధి మొదలగు ప్రాచీన రచనలు ప్రశస్తమయినవి మేమే యిఁక నిక్కడ ముద్రింపనుంటిమి.

4. ప్రాచీనగ్రంథములలోని శ్రీవేంకటేశ్వర వర్ణనాస్తుతులనెల్ల మేమే సేకరించుట జరుగుచున్నది. ప్రశస్తములయిన యీ ప్రాచీనకవుల రచనలనెల్ల నొక సంపుటముగా ముద్రింతుము.

## శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

పయిపేర నిప్పుడు ప్రకటితములయిన యీ సంపుటములోని రచనలెల్ల నింతదాఁక నెవ్వరును బ్రకటింపనివే. ఇందుఁగొన్ని ప్రశస్తమయిన రచనా పాటవము గలవి. స్తుతిమాత్రసుందరములు కొన్ని.

**వీని వివరణము :**

**వేంకటాచల విహార శతకము** : ఇది మంచి రచనా నైపుణి గలది. రచయిత పేరెఱుఁగరాదు[1]. 98 పద్యములే దొరకినవి.[2] లోపించిన రెండు పద్యములలో రచయిత పేరు తెలుపుకొనెనేమో. బ్రాహ్మణుడను నీ సొమ్ముదిన్న కవిని అని రెండుచోట్లఁగవి తన విషయము చెప్పుకొన్నాడు.

ఇది క్రీ.1700 శతాబ్ది యుత్తరార్థమున మహమ్మదీయుల మూలమునఁదిరుపతి ప్రాంతముల విప్లవము జరుగుచుండఁగా రచితమయినది. ఈ విప్లవరీతి నేఁడు తెలంగాణమున రజాకార్లు జరపిన విప్లవము తార్కాణించుచున్నది. 4,15, 17, 23, 24, 27, 30, 37, 38, 42, 43, 50, 53, 57, 76, 77 పద్యములఁ జదివిన నా సంక్షోభగాథ కనులకు గోచరించి పాఠకుల గుండెలకు జడుపును, జలదరింపును, గొలుపును. దిగువ తిరుపతిలోఁగూడ నాఁడలజడి చాల జరగినదట.

**వేంకటరమణ వేంకటేశ్వరశతకములును, వేంకటాచల ధామతారావళియు** : ఇవి స్తుతిసుందరములయిన తేటరచనలు. తొలి గ్రంథమునకుఁగర్త వెచ్చా ధర్మపురి. కడపటి రెండు గ్రంథములకుఁగర్త - ధర్మపురి వెంకటశాస్త్రి.

**పంకజాతభవాండేశ శతకము** : తారావళి యనఁదగినట్లు 28 పద్యములే యిందు దొరకినవి. ఇది శతకమే యని స్పష్టముగాఁ జెప్పఁ జాలము. రచనము చక్కఁగా స్తుతి సుందరముగా నున్నది. రచయిత పేరెఱుఁగరాదు.

**వేంకట శైలనాయక శతకము** : ఇదియు స్తుతిసుందరమైన రచనము. రచయిత పేరెఱుఁగరాదు.

**వేంకటేశ్వర పంచకము** : ఇదియుఁ బైదాని వంటిదే. రచయిత పేరెఱుఁగరాదు.

---

1. శ్రీవేంకటేశ్వరలఘుకృతులు ముద్రణసమయంలో విద్వాన్ కట్టానరసింహులుగారు వేంకటాచల విహారశతక కర్త "నల్లకాల్వ వరకవి సీతాపతి" అని తేల్చుటకు ఆధారమైన మెకంజీ కైఫీయత్తు పీఠానికి ఇచ్చారు. వారికి ధన్యవాదాలు.

2. గ్రంథముద్రణ సమయానికి మరోరెండు పద్యములు ఆచార్య కె.జె. కృష్ణమూర్తిగారు అందించారు. వారికి కృతజ్ఞతలు. ఆ రెండు చివర చేర్చబడినవి.



**వేంకటాచలేశ శతకము** : ఇది మంచి రచనా చమత్కృతి గలది. అసమగ్రముగా రచయిత పేరెఱుఁగ రానిదిగా దొరకుటయ్యెనే యని చింతిల్లవలసిన రచనము.

**వేంకటాచలపతి శతకము** : స్తుతి సుందరమయిన మంచి రచన. అసమగ్రమే. రచయిత పేరెఱుఁగరాదు.

**మేల్నాటి వేంకటేశ శతకము:** మంచి రచన గలది. స్తుతి సుందరమయినది. రచయిత పేరెఱుఁగరాదు.

**వేంకటనగాధ్యక్ష శతకము** : చాల విలువగల ప్రశస్త రచన. అసమగ్రముగా దొరకుట, రచయిత పేరెఱుఁగ రాకుండుట, వంత గొల్పుచున్నది. దొరకిన పద్యములు వరాలవంటివి.

**వేంకటశైలనాయక శతకము** : యమకాలంకారమును, దేశి తెలుఁగు తెఱఁగును గల శృంగార శతకము. అసమగ్రముగా రచయిత పేరు లేనిదిగా దొరకినను దీనికర్త ప్రబంధరాజవిజయ వేంకటేశ్వర విలాసకర్త గణపవరపు వేంకటేశ్వరకవి యగుట గుర్తింపనయ్యెను. ఆతఁడు దన ప్రబంధ రత్నాకరమున నిందలి పద్యమును కమ్మని తమ్మిదోదుమిని ఇత్యాదికమును తన యమకశతకములోని దానిఁగా నుదాహరించుకొన్నాఁడు. ఆ పద్యమునుబట్టి ఈ శతకము తత్కృతమగుట స్పష్టము.

**శ్రీ వేంకటేశ్వర కల్యాణము** : ఇది మంచి గేయరచన. కర్త పేరెఱుఁగరాదు. అసమగ్రముగానే దొరకినది. తుది గేయములు మూఁడు నేను కూర్చి ముగియఁజేసితిని.

**అలమేల్మంగా స్తవము** : ఇది మంచి కవితారీతి గల స్తుతిరచన. కర్త పేరెఱుఁగరాదు.

**ప్రసన్న వేంకటేశ్వర మంజరి** : ఇది మంచి రచనము. శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి మైసూరి చికదేవరాయని పరిపాలనా కాలమున తత్పాలిత దేశమున వామలూరను నూర వెలసి దివ్యవైభవము లందుట యిందు వర్ణితమయినది. రచయిత పేరెఱుఁగరాదు.

**శ్రీవేంకటేశ్వర పంచచామరములు** : అద్వైత వేదాంత ప్రతిపాదకమయిన శ్రీ వేంకటేశ్వర స్తుతి రచన. ధారాళమయిన కూర్పు గలది. కర్త పేరు నామయోగి, భవన్నామయోగి యని కూడ గలదు. గనుక వేంకటేశ్వర యోగి యని యేని పేరు కాఁదగును.

**వేంకటేశ్వర దండకములు** : తొలి దండక కర్త పే రెఱుఁగరాదు. రెండవ దండకము రచయిత పేరు ప్రే (హే?) మాద్రి రంగేంద్రుఁడు.

**శ్రీ రమాపరిణయము** : బహు గ్రంథకర్త్రి యగు తరిగొండ వేంకమాంబ రచనము, స్వామి కల్యాణపువేడుకలు. బువ్వము బంతి, విందు ముచ్చట్లు నిందు సుందరముగా వర్ణితములయినవి.

ఇట్లు వర్ణితములయిన యీ గ్రంథములు గొన్ని ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో వ్రాయించుకొన్నవి. వేంకటాచల విహారశతకపుఁ బ్రత్యంతరము ఆంధ్ర సాహిత్య పరిషత్తునుండి వేంకటేశ్వర పంచచామరములు వేంకటనగాధ్యక్ష శతకపద్యములు గొన్ని తంజావూరి 'సరస్వతీమహలు' లైబ్రరినుండి వ్రాయించి తెప్పించినవి.

ప్రత్యంతరములు లేక యందదుకులుగాఁ జాలఁ దప్పులతో గ్రంథ పాతములతో దొరకిన పై గ్రంథములను శక్యమయినంత వఱకు దోషములు తొలఁగించి లోపములు పూరించి సరిపఱచుటయ్యెను.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి ప్రస్తుతిని ప్రధానీకరించుకొని భక్తులు రచించిన యీ రచనలలో 'చెఱకునకు వంక గల్గినఁ జెడునె తీపు' అన్నట్లు భక్తి మాధుర్యమే యాస్వాద్యము కాని కావ్యగుణముల కొఱఁతలు నెఱసులు గణింపఁదగినవిగావు. స్వామివారి భక్తులకిది సరస రసాయన మట్లు స్వాద్యమై హృద్యమై వెలయఁగలదు.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయము — వే. ప్రభాకరశాస్త్రి
సర్వధారి, విజయదశమి
తిరుపతి.

# విషయసూచిక

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## వేంకటాచలవిహారశతకము

సీ॥ కంటిఁ దొల్దొల్త నుత్కటకూటచుంబిత
గోపురం బడిపడి గోపురంబు
వీక్షించితిఁజిరత్న వివిధరత్న వినూత్న
మహనీయ తపనీయ మండపములు
చూచితిఁ బిక పికీ శుక శుకీ కుహు కుహూ
కలనఘూర్ణితము మోఁకాళ్ల ముణుపు
కాంచితి నా స్వామి కమనీయ దివ్యమం
గళవిగ్రహానందకర విమాన

తే॥ మంతఁ గనుపట్టె శేషాచలాగ్రభాగ
చక చక ద్గారుడ స్తంభ శాతకుంభ
జృంభితారంభసౌధనికుంభితోరు
హట్టన సముత్కరంబు శేషాచలంబు ॥ 1

సీ॥ దర్శింపఁగంటి మందస్మితస్ఫుటదీప్తి
లలితభవన్ముఖోల్లాసగరిమ
సేవింపఁగంటి నీ శృంగార భరిత భా
విత దివ్యమంగళ విగ్రహంబుఁ
బొడఁగంటి నే నీదు భూరివిక్రమ లస
త్పంచాయుధసమేత బాహుసమితిఁ
గనుఁగొంటి భువనపావన దేవతార్చన
యుష్మత్పదాంభోజయుగ్మకంబు

తే॥ నిదియ మొదలుగఁ బుణ్యంబు లొదవె నాకు
దురితముక్తుఁడనైతి మీ కరుణచేతఁ
దావకపదాంబుజ ధ్యానధరునిఁజేసి
నన్ను రక్షణసేయు మాపన్నశరణ
వరకృపాసార !వేంకటగిరి విహార!! 2

సీ॥ రక్షింపు గురుకుమార ప్రాణదానాఢ్య
యాదరింపుము సురేంద్రాదివంద్య
యాపద వారింపు మంబరీషస్తుత
వాంఛితార్థములిమ్ము వరదహస్త
ప్రత్యక్షమై రమ్ము ప్రహ్లాదవందిత
మే లొనరింపు కుచేలమిత్ర
కావుము ద్రౌపదీఘనమాన రక్షక
మన్నింపు మహివధూసన్నుతాంగ

తే॥ రోగములు మాన్పుమో భవరోగవైద్య,
పాపమణఁచు మజామీళపాపహరణ,
పాదసేవ కటాక్షింపు పరమపురుష,
యభయ మొసఁగుము శ్రీ వేంకటాద్రినాథ ॥ 3

సీ॥ అవిగో నిరంతరోద్యద్దాన ధారాళ
ధారాళకోద్దంత దంతిఘటలు
అవిగో యసంఖ్యాత పవమాన జవమాన
ధాటికాఘోటకోద్ధత రజంబు
లవిగో నిరాఘాట హాటకధ్వజపట్ట
పటపటత్కార ఝంపామరుత్తు
లవిగో భటోద్భటాత్యంతభీకర కరా
ళికృపాణకర్షస్ఫులింగపంక్తు

తే॥ లనుచు సురతానియబ్దుల గననె మోడె
గుంట, కావలి, జలదంకి, కొడవలూరు,
గండవరములు మునుమున్నె కలవరించె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 4

సీ॥ వడిగుళ్లసొచ్చి దేవళ్ల బ్రద్దలు చేసి
ధట్టించి తేజీలఁగట్టునపుడు



జిగురుపాల కటంచుఁ జిగిరించు రావిమ్రాఁ
కులు నజ్జునజ్జుగాఁ గొట్టునపుడు
గురుసార్వభౌముల గోడుపోసుక పట్టె
నామముల్ మొదలంట నాకునపుడు
గద్దించి వెస వైదికపు బాపనయ్యల
పిల్లజుట్లూడంగఁ బెఱుకునపుడు

తే। శక్యమా నీకుఁదురకలఁజక్కు సేయ
విన్నవించితి నా వెఱ్ఱి విన్నపంబు
పరగ మీ చిత్తమిదె నాదు భాగ్యమౌర
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 5

సీ॥ తోమని పళ్లెములుసియఁ గొట్టినదాఁకఁ
దిరుకాపులన్నియు విఱుచుదాఁక
నంబుల గవిసి ధనంబులిమ్మనుదాఁక
వాహనంబులు పాఱవైచుదాఁక
గరుడగంబమ్ము బంగారు నొల్చినదాఁక
గోపురంబులు కుప్పఁగూల్చుదాఁక
గిలకొట్టుపణ్యారములు బావుకొనుదాఁక
తెగి జియ్యగార్ల బాధించుదాఁక

తే॥ తొడరి నీ మేని సొమ్ములు దోఁచుదాఁకఁ
బొంకుచున్నావొ తురకలఁ బొడుతుననుచు
బాకు మొలఁజెక్కి యిది మంచి బంటుతనమె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 6

సీ॥ వడిగ అతనము దేవరకు లేదో పిన్న
వయసువాఁడవు గావొ వైరిదండ
ధరుఁడ బిరుదు పేదరికము నీకేటికి
ననుఁబోటి బాపఁడైనను భవత్క

రాగ్రచక్రమువంటి యలుఁగుచే దొరకిన
గట్టైన బ్రద్దలుగాఁ దరుష్క
భటులగుఱ్ఱము తలపయి రౌతు మొండెము
రౌతుపై హయముగాత్రమును డుల్లఁ

తే॥ జిల్లు పొల్లుగ ఖండించి చించి యుఱికి
నఱికి డాకలు గోసి బెట్టుఱిమి తఱిమి
కొట్టి గోరింపనే గోలకొండదాఁక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 7

సీ॥ జవరాలి నిడువాలు జడవ్రేటు గాదుగా
జుఱుకుట్టుగుల్లాపుతఱటుపెట్టు
రాకేందుముఖిముద్దు రాకొట్టుగాదుగా
దాసికంపుతుటారి దగిడితిట్టు
కులుకుగుబ్బెతగుబ్బకొనపోటు గాదుగా
మొక్కలంపు గరీబు ముష్టిఘాత
యలివేణి రతికూజితార్భటిగాదుగా
భర్జించు చాకిరిగర్జితంబు

తే॥ వలదు మా యయ్య ప్రాణంబు గలిగెనేని
బలుసుటా కేఱి తినవచ్చుఁ బాఱిపొమ్ము
దొడ్డుకొంచెంబు లెఱుఁగరీ తురకలవని
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 8

సీ॥ ద్రావిడగ్రంథసంధానంబులా నీకుఁ
గఠిన ఖోదామంత్రపఠన కలన
వైఖానసోచితాహ్వానంబులా నీకు
బైసిమాలిన మాఱుబాసవినికి
విస్ఫుటాపూప నైవేద్యంబులా నీకు
దుర్గంధకలిత కందురచయంబు



కోమలాగరు ధూప ధూమంబులా నీకు
నూనులాహిరి ధూమపాన విధులు

తే॥ బళిర తురకవయ్యెదవు దోర్బలము దక్కి
యైనఁగొఱతేమి మాకు నీ యఱవచెవులఁ
బూడ్చరాదని యొక చింత పుట్టెఁగాక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 9

సీ॥ నడవనిచ్చెద రొకో నానావిధ బ్రహ్మ
తిరునాళ్ల వైభవస్ఫురణ నీకు
సాఁగనిచ్చెదరొకో సాంతత్యరామ రా
జన్యావసరమహోత్సవము నీకుఁ
దక్కనిచ్చెదరొకో ధళధళత్సమర భూ
పాలాదివాహసంపదలు నీకు
నుండనిచ్చెదరొకో యుద్యత్కిరీటాంగ
దాది భూషాసమూహములు నీకు

తే॥ దండధరభట భుజదండతాండవోగ్ర
గోలకొండవజీర రింఛోళిమూర్ధ
బృందములఁగొట్టి గుప్పలు పెట్టకున్న
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 10

సీ॥ తాళ్లపాకచినన్న దండెమీటులు గావు
గోమాంసభుగ్ధనుర్గుణ రవములు
బంటొసంగిన బంకమంటి పువ్వులు గావు
యవనాధముల చిలుకంపగములు
చల్లని పన్నీటి చల్లులాటలు గావు
పాశ్చాత్యభటుల తుపాకిగుండ్లు
సంపెంగమ్రాకులు జరిగింపుటలు గావు
రిపులపాళెములు దర్లించుపగలు

తే॥ బంటుపంతము దగదంచుఁ బంటకాఁపు
దనము గైకొంటి విది మంచిగుణమె దినము
జనము తెచ్చిన ధనములప్పనములిచ్చి
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 11

సీ॥ పాలువెన్న బకాళబాతు దధ్యోదనం
బు పుళియోరెము వెన్న బూరియలును
సరడాలపాసెముల్? చక్కెర పులగముల్
నువ్వుమండిగలు మనోహరములు
అప్పము లిడ్డెన లతిరసాల్ హోళిగల్
వడలు దోసెలు గల వంటకములు
శాకముల్ సూపముల్ చాఱులంబళ్ళు శు
ద్ధోదనములును సద్యోఘృతమ్ము

తే॥ పండ్లు తేనెలు హొబ్బట్లు పచ్చడులును
మెక్కి మముబోంట్లు గ్రుక్కిళ్ళు మ్రింగుచుండఁ
బర్వసేయవు నీవంటి బ్రదుకుగాదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 12

సీ॥ మొన్నఁ గన్నడవారి ముద్దులాఁడి మిటారి
కెమ్మోవిఁజూచి గ్రుక్కిళ్ళు మ్రింగి
నిన్న నంబిమిటారి నెఱనీటు ముక్కుముం
గఱఁజూచి మది జాలుగాఁగరంగి
నేఁడు కోమటివారి నెలఁత మేల్గబ్బిగు
బ్బలహొయల్చూచి పైఁబడఁదలచి
యిపుడు ద్రావిడభామ యెలమోము చక్కఁద
నముఁజూచి చాల దిగ్భ్రమముఁబొంది

తే॥ తత్తరించెద వితరసుందరుల కాంక్ష
మాను మా యమ్మ యలమేలుమంగకంటెఁ



జక్కనివధూటి గలదె ముజ్జగములందు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 13

సీ॥ చిన్నారిడాతెక్కచేత జేజేరాజు
పౌఁజు గారించిన బంటు లేఁడొ
గాఢ వాలాగ్ని లంకా పట్టనము ధూళి
పటలంబుఁ జేసిన బంటు లేఁడొ
పద్మగర్భాండంబు పైఁబడ్డచో నొక్క
పడిగ యెత్తుకయున్న బంటు లేఁడొ
మేర దప్పకయుండ మించి లోకము వేత్ర
పటిమ శిక్షయొనర్చు బంటు లేఁడొ

తే॥ పేదదొరవలె నీకేల భీతిలంగ
సెలవుపెట్టవుగాక విజృంభమాణ
గర్వితారాతి కంఖాణ గణముమీఁద
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 14

సీ॥ పొట్టేళ్లగతిఁ బట్టి బోడిసన్యాసుల
డే యని తాఁకులాడించు నొకఁడు
సోమయాజుల బ్రహ్మసూత్రముల్ ద్రెంచి సిం
గాణివిండ్లకు నల్లెకట్టు నొకఁడు
ఖూబుఘోడాయంచు గుడికీలుగుఱ్ఱము
నెక్కి ధే యని తఱటెత్తు నొకఁడు
పైకాలు గొమ్మని బల్మిఁ గోమటివారి
చెలువపైఁబడి బూతుసేయునొకడు

తే॥ యవనజీమూతదుర్దినంబైన దిగువ
తిరుపతిని జూడుమిటువంటి తఱిని నిదుర
పోవుచున్నాఁడు మీ యన్న లేవలేక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 15

సీ॥ మెఱుఁగు తోముడుగట్టి కఱకుత్రుప్పడు కంచు
రాగితేవండ్లు ఫిరంగులయ్యె
గండకీగర్భనిర్గళితంబులగు ప్రక్క
తూటుఱా ళ్లొడిసెండ్లవాటులయ్యె
గాసెవాఁడులిమొన జేసి వేసిన బండ
ప్రతిమలు ద్రొక్కుడుబండలయ్యె
జలపోసనపువెండి జర్తారు టెక్కెపు
గుడ్డలు బలు డాలుగుడ్డలయ్యెఁ

తే॥ జూచితివొ చూడలేదొ మెచ్చుల మిటారి
మరుకటారి తుటారి నిబ్బరపు టోర
మిండచూపుల తురకల దుండగములు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 16

సీ॥ మూన్నాళ్ళనుండి యేమోకాని రుక్మిణి
పెద్దబన్నసరంబు పెట్ట వెఱచెఁ
దన తండ్రి యిచ్చినవనుచు సాత్రాజితి
పచ్చలకడియముల్ బరిణ నిడియె
వెలలేని ముత్యమంచులుకుచు జాంబవ
త్తనయ ముక్కఱపోచ దాఁచుకొనియె
మిత్రవిందాదేవి మెడనూలు మెఱుఁగుఁగ
మ్మలె కాని రత్నభూషలు ధరింప

తే॥ దయ్యెఁదురకావళికిఁ గాదె యదియు నెఱుఁగ
వించుకేనియుఁ గనుమ దాఁటించుమిపుడు
పగ్గెలటు గట్టిపెట్టు నీ పల్లకీల
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 17

సీ॥ లంకానిశాతాటంకినీతాటంక
ముల కెగ్గు దలఁచు క్రొందళుకుచిలుకు



ఘనజనస్థాన నక్తంచరీ మకరికా
పాటచ్చరము నిరాఘాటశరము
దృశ్యజాల్మాసుర ప్రేయసీ కంఠసూ
త్ర ద్రోహియైన యుగ్రపులకోరి
దండకా రాక్షసీమండలీ కుచ హరి
ద్రల గీచివైచిన దండితూఁపు

తే॥ చికిలి మాసెనో క్రొవ్వాఁడి చెడెనొ లేక
విఱిగిపోయెనొ పింజకు గఱులు లేవొ
మించి తురకలపైఁ బ్రయోగించవేమి?
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 18

సీ॥ పరవంజుకొని యెన్నిపాటులు పడితివి
పగఱచే సీతఁగోల్పడిననాఁడు
చొరరాని చోటెట్లుఁ జొచ్చితి వతిబలో
ద్ధతి జరాసంధుఁడు తఱుమునాఁడు
ఎంత యేఁకారితి వింద్రజిత్తునిచేత
ఫణిపాశములఁ గట్టుపడిననాఁడు
ఎందుకు మిణికితి వెంతయు సౌమిత్రి
యాహవక్షితిఁబోరులాడునాఁడు

తే॥ బ్రజలకెల్లను నీవంటి బ్రదుకు గాదె
తురకయావడిఁ బడి నిన్ను దూఱితేనిఁ
గోపగింపకుమీ జగత్కుక్షివైతె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 19

సీ॥ పాటవమెచ్చెనో పాశ్చాత్యభాషా వి
శేషసంరంభ విజృంభణంబు
లభ్యాసమయ్యెనో యల్లాదిశబ్దోగ్ర
శాహుసేన్ బాహుసేన్ సంహితోక్తి

జితపడెనో సాముచేత దండపుఁద్రోపు
మోహరించు నమాజు మొక్కలములు
మజ్జాతి యయ్యెనో మహితశృంగధనుర్గు
ణార్త సవ్యాపసవ్యాస్త్రవిద్య

తే॥ తురకవైతివి యీ యంగు దొరకె నీకు
మంచిపని చేసితివి చెవుల్మాట కేమి
చేసితివి చూపు చూచి మెచ్చెదను నిన్ను
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 20

సీ॥ ముసలివాఁడు పురాణపురుషుండు చుట్టల్కు
పట్ట సత్తువు లేదు బాహువునకు
కూటిబీదఱికానఁ గుదువఁబెట్టెను శార్‌ఙ్గ
మంటనికతనఁ దుప్పంటెఁ గత్తి
తుమ్మెద ల్మూసిరాలఁ దొలఁచె కౌమోదకి
పాంచజన్యము గుల్లపడియె జీత
మీయని కొల్వు మాకేటి కంచును భటు
లిచ్ఛానువర్తులై రిట్టికోపు

తే॥ దప్పియున్నట్టివేళ, నుద్దండయవన
మండలాధీశ్వరులమీఁద దండయాత్ర
వెడల శక్తుఁడె తిల్లగోవిందరాజు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 21

సీ॥ గరిమ 'నరే గజాగాండూ' యనకపోరు
భువినెట్టి యాచార్యపురుషునైన
సొలసి 'యరే భేటిచోదా' యనకపోరు
వెఱపించి షట్ఛాస్త్రవేత్తనైన
దర్పితులై 'యరే ధగిడీ'యనకపోరు
కడు సోమయాజుల కొడుకునైన



మీఱి 'యరే హరాంకోరా యనపోరు'
బహువేదశాస్త్ర సంపన్నునైన

తే॥ ధూమపాన,సురాపాన, తోయపాన,
రక్తపానాదులందనురక్తులగుచు
దుర్వివేకితతో వచ్చు తురకదొరలు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 22

సీ॥ పలుగాణికంచుగుబ్బలు దాఁకఁ బొడిచిరి
గద మొఱో యని జియ్యఁగారుగూసె
వడి దూఱి యా తల్పు మెడఁ దగి లించుక
వకవకలై యాళువారలుఱికె
గొందికిఁ జనఁదేలుగుట్టిన నిగిలించి
మెదలక నంబివాఁడొదిగియుండె
నడఁగె నారీకవచాద్రుల లంజల
బారులో గుడిపారుపత్యదారు

తే॥ పట్టనమువెత్తుగాఁ గొల్లవెట్టునపుడు
లొట్టుముచ్చుల తల లూడఁగొట్టలేని
తిల్లగోవిందరాజులఁ దిట్టరాదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 23

సీ॥ అంబూకృతోచ్ఛిష్టమైన ఫాలముతోడఁ
దహతహచెందు సాతానివాఁడు
భుక్తశేషపు రొట్టి బొక్కిన సభవారి
వడుగు ప్రాయశ్చిత్తమడుగు గురుఁడు
తోలుతిత్తిని గల్లుఁగ్రోలినందుకు వ్రేలు
గొంతులోనిడి కక్కుకొను త్రిదండి
పాపాసుపెట్టును బడి పాంచరాత్రుండు
పాటనచేయు గోనేటిమృత్తి

తే॥ ........................ హాయిదేటి
......................మొనర్చి
బ్రతుకుటంచు భవత్పురాభ్యంతరమున
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 24

సీ॥ పతితపావనగుణాద్భుతమైన నీ కొండ
చండాలు రెక్కిన సైఁపవచ్చు
మలవిమోచనజలోజ్జ్వలమైన కోనేరు
మాలలు గలఁచినఁ దాళవచ్చు
జాతిదుర్వాసనాచర్వణోద్యానముల్
హీనులంటినను సహింపవచ్చు
సకలజాతులకు మోక్షమొసంగు గుడిఁ గడ
జాతి చొచ్చిన భరించంగవచ్చు

తే॥ గాని కటకట తురకలుత్కటవిలాస
దేదివత్తావకాంగభూషాదులెల్ల
నొలిచిరన్నట్టి దుర్వార్త కోర్వరాదు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 25

సీ॥ తిరుమంగయాళ్వారు తెరువాటు గొట్టెనో,
భక్తులకిచ్చితో పాతిపెట్టి
మఱచితివో, లేక మయిమర్దనము చేయు
జెట్టులకిచ్చితో, చేరికొలుచు
వారిలోఁజనవరుల్కేరడాలకుఁ దీసి
దాఁచిరో బిరుదుపద్యములు చదువు
కొలకు దయచేసితో, లంజవెచ్చాన
కమ్ముకొంటివొ,కలశాబ్ధికన్య

తే॥ కౌఁగిట బిగించినపు డొత్తగా యిసీ భ
రమ్ములనుచు సడల్చితో, సొమ్ము లెవ్వి



దొరకవు గదా, మదాంధులౌ తురకలకును
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 26

సీ॥ ఏ గులామొల్చెఁ గోనేరుమధ్య సువిస్ఫు
రణమంటపాగ్రభర్మచ్ఛదంబు
ఏ లండి గిలుబాడె నీ గోపురద్వార
ఖత్పంచలోహఘంటా వ్రజంబు
లే ముండది హరించె నీ యలంకారభా
జనరూప్యదీపికా స్తంభపంక్తి
యే పిశాచము దీసె నీ దివ్యగోధామ
భాసితకనక పిప్పలదళంబు

తే॥ అక్కటా యెట్టులోర్చితి వంతిపురము
చొచ్చి చూరాడి భటకోటి జులుముసేయ
రాచబిడ్డవు గావొ? విక్రమము లేదొ?
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 27

సీ॥ పణుకుల నిద్రించు పవడంపు లతికలఁ
బొట్టిప్రేవులగుంపు చుట్టుకొనఁగఁ
గటకోగ్రకురువిందకందళంబులఁ బడి
పాడికండ లొండొంటఁ బుటము లెగయ
సోపానపంక్తిని జొబ్బిల్లు మకరంద
ధారల మెదడు బాంధవమొనర్పఁ
దైర్ఘికులిచ్చిన తలనీలములమీఁదఁ
జింబోతుగడ్డంబు చేరువెట్ట

తే॥ అవ్వఘరినుండి యూష్మరక్తాంబుఝరము
ఘమఘమధ్వని దిగువకు దుమికి పాఱ
బారసీకులఁ జెండుట భరమె నీకు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 28

సీ॥ సీకాయపొదలు క్రొంజెమటమాగుడు బొంద
ళాలంటి వ్రాలిన వ్రాలుఁగాని
గందంపుదరులఁబుల్ గదురనెత్తురు పచ్చి
తోళ్లంటి తూలినఁ దూలుఁగాని
పావనతీర్థముల్పలలఖండపు జిడ్డు
చమురంటి దుమికిన దుముకుఁగాని
మణిశిలామార్గము ల్మస్తిష్కజంబాల
ఝరులంటి జాఱిన జాఱుఁగాని

తే॥ జీర్ణకర్ణాటలక్ష్మి రక్షింపలేవె
చెండి రౌతులఁ దిర్మలకొండనెత్త
మెంత గౌలైన మది నసహ్యించుకొనక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 29

సీ॥ చిల్లుపిల్లుగఁబోళ్ల చెండాడునట్లు దం
పుళ్ళు గావించు నంజుళ్లఁ బోలి
ఘల్లు ఘల్లున జిరాజోళ్ళు డుల్లగఁ బచ్చ
పొళ్లబొమిడికలు కాళ్లఁద్రుళ్ల
నోళ్ళు పచ్చళ్ళుగా భొళ్ళున రక్తము
ల్వెల్లువల్గట్ట మీఁగాళ్ళు గోళ్ళు
కీళ్ళు కీళ్ళును గిజగిజగాఁగఁ గ్రొవ్వునఁ
బెల్లుగాఁజొచ్చి జొబ్బిల్లుచుండఁ

తే॥ జెండఁగదరోరి పేరూరిచెఱువుదాఁక
బోడతలలు కురాసాని పుచ్చకాయ
లగుచు బోర్ల వజీర్లఁ జక్రాగ్రధార
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 30

సీ॥ ఏ దారి నోర్చెద వాదిగర్భేశ్వర
స్వామివి పట్టెమంచంబు లేక



యే జాడ భరియించె దా జన్మసిద్ధమౌ
భోగివి చలువగంబూర లేక
యే భంగినుండెద వింపునింపు నఖంప
చ హిమాంబుధార మజ్జనము లేక
యెట్టు తాళెదు పుట్టినింటి కిందిరనంపి
పైత్యదేహివి లంజపడుచు లేక

తే॥ ఆటపాటలు లేక వీడ్యములు లేక,
భోగములు లేక, సన్యాసిపోల్కి గోచి
కాఁడవై, బొక్కసము తురకలకు నిచ్చి
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 31

సీ॥ జయజయధ్వని పూలజడి మింట నుప్పొంగఁ
జాతురంగసమేతజాత యుద్ధ
సన్నద్ధ సౌన్నేహ సన్నాహ్యలీలక
డానిజెక్క జిరాగుఱాని నెక్కి
ధే యని తఱిమి గద్దించి పెద్దఫిరంగి
కేలఁ ద్రిప్పుచు లయకాలయవన
కాలాంతకుఁడ కాలకాలుఁడై పఱతెంచి
త్రెంచెఁ బ్రాణములంచు సంచలింపఁ

తే॥ గొండ దిగి పాఱఁ బాశ్చాత్యమండలముల
వెంటఁబడి కొట్టి గోరించి విజయలక్ష్మి
నేలుకొనరాదె పగఱు గగ్గోలు గాఁగ
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 32

సీ॥ అలమేలుమంగఁ బెండ్లాడిననాఁడు నీ
కనురక్తి మామ యిచ్చిన కటారొ
యనుజుండు దండకావనమందు దైత్యునిఁ
జెండు బెండాడి తెచ్చిన కటారొ

భద్రేభయాన లోపాముద్ర కనుసన్న
మునిశిఖామణి యొసంగిన కటారొ
అన్యవర్ణాశితంతన్యమానాఖ్యాతిఁ
దళుకొత్తు మొసలివాదపు కటారొ

తే॥ యే కటారి తురుష్కులకిచ్చితిపుడు
బాకు మొలఁజెక్కి యిది మంచి బంటు దనమె
యనిన మాటకు నిది మానుటౌఘళంబు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 33

సీ॥ నగరుద్దవడిఁజొచ్చి నడిరొమ్ము భృగుమౌని
ధట్టించి డాకాలఁ దన్నునపుడు
తన రథంబునఁ గట్టి మునికోలఁగొని కొట్టి
దుర్వాసుఁడుద్ధతిఁ దోలునపుడు
దండకాటవిఁ బదితలల దయ్యపుఱేఁడు
పల్లకీలెత్తుక వెళ్ళునపుడు
వారి తనూజుఁ డుద్వేల బాణాహతిఁ
జిగురు బొట్టనవ్రేలఁ జిమ్మునపుడు

తే॥ మిన్నకుండెద విటువంటి మేదకుఁడవు
ఖలులు సొమ్ములు దోఁచిన మొలకటారి
రెమ్ముకొని పోయినను నెదిరింపఁగలవె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 34

సీ॥ దంష్ట్రివై మొనపంట దంటరక్కసిగుండె
నజ్జుగాఁ గొఱికిననాటి దురుసు
నరసింహమూర్తివై కెరలి భోరున దైత్యు
నఖరాళిఁద్రుంచిననాఁటి చుఱుకు
గండగొడ్డంట నుద్దండభూభృత్కంఠ
నాళముల్చెండిననాఁటి చలము



దశకంఠముఖయాతుధానవంశము నామ
నష్టంబు చేసిననాఁటి కోప

తే॥ మెక్కడికిఁబోయె నేఁడు నీ, కేల యింత
శాంతివహియించినాఁడ వో స్వామి చటుల
ఖానుతతిమీఁదఁ జూపవుగాక ఢాక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 35

సీ॥ బోసేతుగాని లే భుగభుగాయిత సౌర
భోదార చారు దధ్యోదనములు
జుఱ్ఱుదుగాని లే సొబగు గంబుర తావు
లీను చక్కెర చల్వపానకములు
భక్షింతుగాని లే బహువిధాపూపోప
శోభితంబగు పాయసోత్తమములు
తిందువుగాని లే తేనియల్ జొబ్బిల్లు
సొగసు టుక్కెర వెన్న జున్నుగములు

తే॥ ఎటులు నీ తిండికిఁక సముద్భటవిహారు
లగుచు దయ్యాలవంటి వెయ్యాఱు రౌతు
లంటి నీ గుడిఁజొచ్చి చూఱాడునాఁడు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 36

సీ॥ ఘోరవీరక్షత్రకుల వినాశకుఁడగు
భార్గవుండతఁడేల బబ్బరించె
గబ్బికోఱకటారికాఁడగు నాదిమ
స్తబ్ధరోముండేల జల్లుగ్రుంకె
యమరజిత్తును గొట్టినట్టి నీ దళవాయి
పట్టభద్రునికేల భయము దోఁచె
వాకిట దయ్యాలవలెఁ గాచికొనియున్న
.జయవిజయులకేల జాడ్యమొదవె

తే॥ వక్రవృత్తిని గోపురద్వాఃకవాట
హాటకములొల్చు యవనసంఘాటకముల
బదులు చర్మములొల్చుక చదుపరాదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 37

సీ॥ గోరీలె కాని బృందారణ్యవీథుల
దేవపూజార్థితైర్థికులు లేరు
బాకిసారాకుండలే కాని మఠముల
సజలకమండలుచ్ఛటలు లేవు
నీచభాషలె కాని యాచార్యగృహముల
సమధికగ్రంథపాఠములు లేవు
వింతఘోడాసకిలింతలే కాని దే
వళముల నిత్యోత్సవములు లేవు

తే॥ గా సముత్కటగర్వాంధకారపటు ప
ఠాణిరౌతులు ఖండతుండములు సేయఁ
జాలవైతివి నీ కేల సాహసంబు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 38

సీ॥ మోఁకాళ్లమణుపు దుమ్ములు ధూళిగా శకా
రట్టఘోట్టాణము ల్మెట్టునపుడు
చందనద్రుమశిఖాంచలములో గోమాంస
ఖండచర్మము లెండఁగట్టునపుడు
సవన వరాహపుష్కరిణిలో గవులుకం
పడరంగ మిసిమిలాల్గడుగునపుడు
వైఖానసుల యిండ్లవాకిండ్లఁజక్కవ
చ్చి నమాజుపండువుల్ సేయునపుడు

తే॥ మలసి కలియుగలక్షుమమ్మల కుచాగ్ర
శాటికాగ్రహముకుఁ,జేయి సాచునపుడు



కాని కనిపించుకో నీతి గాదు నీకు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 39

సీ॥ మొనసి గుఱ్ఱము పల్లమును రౌతుతోఁగూడ
వ్రేటాఱు తునియగా వ్రేయరాదొ
కినిసి నేజా తుపాకీలకోరీకేడె
ములు చక్కుపడఁగాను మొత్తరాదొ
డాసి బొందళముఖండాఫిరంగీజోడు
దొనలు తుత్తుమురుగాఁ దునుమరాదొ
రేసి బాణావంకిణీ సిలెపాగ ము
స్తీదులు చక్కుగాఁ జెండరాదొ

తే॥ కొండచేసెద వేల యాకోఁచగుండె
తురక దగిడీలఁజంపుట యరుదె నీకు
రాక్షసాంతక బిరుద ధారాళధృతికి
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 40

సీ॥ ఆస్తిక్యబుద్ధి నధ్యాహరించితి ధేను
కౌద్ధత్యఖండనయోద్ధ వనుచు
విశ్వసించితి మహావీరధీరమ్మన్య
చైద్యభేదనకళాశాలి వనుచు
నెనరుంచితిని దశాననధురంధరపలాం
ధఃకంతలుంఠనోద్భటుఁడ వనుచు
మనసు నిల్పితి ఘోరమారీచమాయావి
మాయావిదారణోన్మాని వనుచు

తే॥ బిరుదులటు వెట్టి కోమటిపిఱికి వగుచు
మొలకటారిచ్చి తురకలఁ గవియవయితి
బంటు గావేని మును గత్తిఁబట్టనేల
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 41

సీ॥ గాముచందపు నజ్జు గడ్డమువానికా
చక్కని కర్ణాటచంద్రవదన
మకరికోఱలనోటి మార్జాలముఖునకా
రాచిల్కపల్కుల రాజకన్య
ఘోరదృష్టుల(బిడుగులు రాల్చువానికా
గబ్బికోమటిగబ్బిగుబ్బలాఁడి
ప్రళయాగ్నిరీతి మంటలు గ్రక్కువానికా
పచ్చిబంగరువంటి బలిజెకులజ

తే॥ చెండి చెఱవట్టినపుడేమి చెప్ప సతులు
పడినపాటులు గుక్కలుపడవు రోఁత
గాదె యీ వార్త మీ సముఖమునఁ బలుక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 42

సీ॥ సాధుబాధాకరుల్ చండాలబీజముల్
చండకోపనులు పిశాచముఖులు
బ్రాహ్మణద్రోహులు పతితులన్యధనాప
హారులు మద్యపానాభిరతులు
గార్దభసన్నిభోత్కంఠులు కర్ణక
ఠోరహుంకారభాషారభటులు
బూచిగడ్డంబులు బోడలు గంచుక
గ్రంథులు విడువని కష్టఫణులు

తే॥ తురకలటువంటి దుర్మదాంధులకు మెచ్చి
యిస్తివో వెఱచిస్తివో వస్తులెల్ల
దెలియ నానతియిమ్ము సందియము దీఱ
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 43

సీ॥ వద్దయ్య రత్నాలపెద్దకిరీటంబు
ముదుకుగుళ్లాయి వెట్టుదువుగాని



యేలయ్య మొసలివాజాళువాపోగులు
నొకపాటి తమ్మటలుంతుఁగాని
మానుమయ్య యనర్ఘమౌక్తికహారముల్
వనమాలపేరులు వైతుఁగాని
తగదయ్య చికిలినిద్దాకుందనపు దట్టి
గోఁచిగోనము చేసికొందుఁగాని

తే॥ చేటెఱుంగని కూనవై నీటుపెట్టె
దేమిటికి సొమ్ము గల్గిన నెమ్మెసేయ
రాదె మీఁదటఁ దురకలు గ్రమ్ముకొనఁగ
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 44

సీ॥ డాలైన మణికిరీటము పెట్టుకొంటివి
బిరుదుగల్గిన దొరబిడ్డవలెనె
మేలైన సింగాణిఁ గేలఁ బూనితివి లో
కములోన దొడ్డ విల్కానివలెనె
తళుచైన వజ్రాంగి ధరియించుకొంటివి
ధీరత గల దునేదారివలెనె
మురువుగా నొక బాకు మొలఁజెక్కుకొంటివి
ఘనతకెక్కిన పోటుకానివలెనె

తే॥ యింపు మీఱంగ సొగసు వహించినాఁడ
గిల్లుకొన్నను లేదు నీవల్ల యింత
శూరధర్మంబు నీ పసఁజూచినాను
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 45

సీ॥ మలలపై పెద్దహోబలము సింగారెడ్డి
మంగళగిరికోట మలయరెడ్డి
పొలుపొందు మారకాపురము చెన్నారెడ్డి
రంజిల్లు నుదయాద్రి రామిరెడ్డి

వెలయు తిర్వాళూరు వీరరాఘవరెడ్డి
వన్నెవాసుల కంచి వరదరెడ్డి
నీటు కెక్కిన గండికోట మాధవరెడ్డి
తగు తాడిపర్తి చింతాలరెడ్డి

తే॥ సేయు కాఁపుదనంబు చూచినను నీకుఁ
గోర్కి పుట్టెనె దిరుమలకొండరెడ్డి
మగతనము మాని కాఁపైన నగవు గాదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 46

సీ॥ పలుపును, మోఁకును, బగ్గంబు, మునికోల,
కాఁడియు, మోఁడియుఁ, గఱ్ఱుఁగలప
యేమియు లేక, యేరెద్దు గల్గిన కాళ
హస్తీశునకు నెక్కుడైన యట్టి
పసిగాఁపు నంచు 'నబాబు'చే రెడ్డిత
నానకు విడెమందినావు నీవు
బలభద్రమూర్తివై హలము పూనినమాత్ర
పైరెట్లు పండును పన్ను వెట్ట

తే॥ కున్నఁబోనీరు తురకలు నిన్నుఁబట్టి
కట్టివేసేరు చాలించు కాఁపుదనము
కటికి బంట్రౌతుకిది యపఖ్యాతి గాదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 47

సీ॥ ఏకామ్రనాథుండు లోకభీకరమైన
హాలహలము గ్రోలి సోలినాఁడు
కాళహస్తీశుండు కప్పెరఁగొని బిచ్చ
మెత్తుకో నింటింటి కేఁగినాఁడు
అల చిదంబరుఁడు దిగంబరవేషము
పూని యదృశమై పోయినాఁడు



భ్రమరాంబికాభర్త భస్మాసురున కుల్కి
పంచబంగాళమై పాఱినాఁడు

తే॥ వీరు నీ కూర్మిభటులైన వీరవరులు
కోపుదప్పిరి నీవును నోపలేవు
చివ్వ కెవ్వారలిఁక మొనసేయువారు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 48

సీ॥ మామిడిక్రింది సోమరిపోతు శ్రీభాష్య
కారులకేల ముష్కరుల గొడవ
అలమేలుమంగసొమ్ముల పెట్టియలు కాచు
కొనియుండుటే చాలు హనుమనికిని
తీవిని బంకమంటిని విరుల్పవరించి
తిరుగాటికరిగెను గురువనంబి
చెంచుమిటారితోఁబంచబాణక్రీడ
జెలఁగుచున్నాఁడు నృసింహమూర్తి

తే॥ నీకు నిట కోపమింతయు లేకపోయె
బోయెఁగాకేమి తొండమాన్భూమిపాలుఁ
డున్న నంతకుఁదురకల మన్నిగొనఁడె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 49

సీ॥ ఆలవట్టంబు లాందోళికల్ డోలిక
ల్గొడుగులు పడగలెక్కడికిఁబోయె
బంగారుభేరి యే పాపాత్ముఁడు హరించె
నచ్యుతకృష్ణరాయండొసంగు
రత్నహారమ్ము పోరాదింక మావుల
మలకుఁదోలించుము మట్టుపెట్టి
పిండిగొట్టెడురొదలుండిగ ల్పదిలము
కొప్పెర శోధింపఁగూడదిపుడు

తే॥ జాళ్లకాలువ దాఁటి పొంగళ్లబైట
నిలిచి తురకలదండు నిర్భీద్రమగుచుఁ
గొండగుహలు ప్రతిధ్వని గ్రుమ్మరింప
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 50

సీ॥ కలఁగి మున్నీటిలోపల సుడివడితివో
నజ్జు నజ్జైతివో నగముక్రింద
నిలుకుపట్టెనొ మహీతలభారమున మెడ
పుల్లసిల్లితో దైత్యు గోళ్లఁజించి
కాలిచేరులు గొంటివో లోకముల్గొచ్చి
మరులు పుట్టించెనో మాతృహత్య
యాలికై వగచి పైత్యము తలకెక్కెనో
మద్యపానమున మైమఱచినావొ

తే॥ మానువలెఁ బల్కవేమయ్య మావునెక్కి
దాడిచని మొత్తరాదె ప్రోద్దామభీమ
యవనభటకోటి చక్కుఁజాటైన దనుక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 51

సీ॥ కటకేంద్రుకూఁతురి కౌఁగిటిలోఁ జిక్కెఁ
జెళ్లపిళ్లస్వామిచేతఁగాదు
కృష్ణమాచార్య సంకీర్తనంబులఁజొక్కె
సింహాద్రి యప్పయ చేతఁగాదు
కవ్వంపుఁగొండసంఘర్షణోద్ధతి దక్కె
శ్రీకూర్మనాథుని చేతఁగాదు
సాంఖ్యతొండని జాలజడికెంతయును స్రుక్కెఁ
జెన్నమల్లేశునిచేతఁగాదు

తే॥ పవనజవన నిరాఘాటయవనఘోట
హరణజయధాటి మీచేత నౌనె మేటి



వొదు వొక సన్నజూడు మేలా పరాకు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 52

సీ॥ పాపవినాశంబు పంకసంకరమయ్యె
నాకాశగంగ మిన్నంటికొనియె
బొక్కఁజొచ్చె భుజంగపుంగవుతీర్థంబు
తుంబురుకోన తీర్థంబు గలఁగె
గాలవతీర్థంబు కీలాలములు గ్రక్కెఁ
జక్రతీర్థము కొండచఱిని దుమికె
బాండవతీర్థంబు భంగసంగతమయ్యెఁ
గోగర్భ తీర్థంబు కుంటువడియె

తే॥ గడమ తీర్థంబులెల్లను గలఁగె నిపుడు
తురకనరకలు స్వామిపుష్కరిణిఁద్రచ్చి
జలగడుగువేళ నీకు రోషంబు లేదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 53

సీ॥ ఎలమి 'నల్లా'శబ్దములు పఠింపఁగ లేరు
చెవిపట్టుగ 'సలాము' సేయలేరు
కంఖాణకోటికిఁ గవణమెత్తఁగలేరు
మొనసి జీరామూట మోవలేరు
కమ్ముబిరంగికాగంధ మానగలేరు
పరవధూటుల బాధపఱుపలేరు
కడు నసహ్యంబైన గంజాయి దినలేరు
హాలారసంబు బిట్టానలేరు

తే॥ ఎట్లు తురకలఁగొల్చి సహింప నేర్తు
రాంధ్రదేశాధిపతులు నీయంత రసిక
శేఖరునిఁగొల్చువారి రక్షింప వలదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 54

సీ॥ నేలటూరిగ్రావనిర్ఘాతపాతంబు
తాళ్లపాకాబ్ధిమంధానధరము
మన్నూరిపవనభుక్పన్నగాంతకతుండ
మూటుకూరి హలాహలోగ్రమూర్తి
ఓరముపాటి కంఠీరవశరభంబు
పెనుబాలపేఁట కృపీటజాత
కందంబు కోడూరి కందళకోలంబు
మన్నేటిగంధసామజమృగేంద్ర

తే॥ మగుచుఁగురువయు మాముడూ రాక్రమించి
..........................................
.....................................
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 55

సీ॥ సైంహికేయుని క్రొవ్వు చవులానినందునఁ
గడు నజీర్ణము చెంది కదలలేదొ
బాపనిఁ దఱిమి పాపము గట్టుకొంటిఁగా
మొక్కలంబని వెన్కముందు దెలదొ
బాణాసురసహస్రబాహుదండ శ్రేణిఁ
జెంది మొక్కలువోయి సిగ్గుపడెనొ
గజరాజు ప్రాణరక్షణము చేసినయట్టి
యాత్రపాటునఁగంప మలమికొనెనొ

తే॥ కాక రాకాసి మిత్తిచక్రము తురుష్క
చక్రము హరించుటే హెచ్చు స్వామికేల
పూనినప్పుడె కరకరి పూనవలదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 56

సీ॥ చెనసి పౌరుష మేమిసేతురో యని దిస్స
మొలవేల్పు సాధ్వసమ్మున మునింగెఁ



దనుఁ బెకలింతురో యని మడికాసు గు
బ్బలిగాన దక్షిణాచలము జడిసెఁ
జెఱవట్టుకొనఁ దలంతురొ యంచుఁ గనకాద్రి
దుర్గామహాదేవి తొట్రుపడియెఁ
గంఖాణములగత్తుకం పొర్వరాదంచు
ఘూర్ణిల్లుచుండెను గుజ్జువేల్పు

తే॥ గోలకొండతురుష్కులు కాళహస్తి
నాక్రమించినతఱి నుగ్రునంతవాఁడు
వాకిటను గోడపెట్టుక వణఁకెనేమొ
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 57

సీ॥ లొట్టిముచ్చులకుఁగేల్మొగిచిరి బ్రాహ్మణు
లర్చావతారంబులడవిఁగలసెఁ
దగు వషట్,స్వాహా,స్వధా,శబ్దములు డుల్లె
మంత్రతంత్రముల సామర్థ్యముడిగె
సకలవర్ణాశ్రమాచారముల్చెడిపోయె
మగనాండ్రఁ దురకల దిగుళులడఁచె
గుఱ్ఱంపుగత్తున ఘూర్ణిల్లెఁ జెఱువులు
గుగ్గిళ్లకంపున గుళ్లు పగిలె

తే॥ గాఢ రూఢసంరంభణోత్కంఠ దళిత
పశ్చిమద్వారులై గంటె భాగవతులు
పగిలి పాఱఁగఁజొచ్చిరి పలుదెసలకు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 58

సీ॥ అలమేలుమంగతో జలకేళి సవరింప
క్షీరాంబునిధికి వేంచేసినావొ
సొలవక వడ్డికాసుల దండుకొను తలం
పున గోలకొండకుఁబోయినావొ

పద్మసంజాతహృత్పద్మగంధముల మ
త్తిలి తేఁటిచందాన సొలసినావొ
మొనఁజొమ్ము గాఁడి వీపున వెళ్లఁ బుడమి పె
న్మక్కువపాలిండ్లఁ జిక్కినావొ

తే॥ కాక, భువనైకవీరపుంగవుఁడవయ్యు
నిట్లుపేక్షింతురే జగదేకభయద
ముష్కరతురుష్కదుష్టసమూహములను
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 59

సీ॥ కుంభకర్ణాది రక్షోభటావళులఁ జెం
డాడిన బలిమి యెందణఁగిపోయె
మాల్యవన్మాలిసుమాల్యాదిదైత్యులఁ
దూలించు బలిమి యే మూలకరిగె
శకటతృణావర్త బకధేనుకాదులఁ
జీరినశౌర్య మే యూరికుఱికె
మధుకైటభాది దుర్మార్గవర్తులతల
ల్గొట్టిన ఢాక యే గొందిడాఁగె

తే॥ నేఁడుగా కిఁక నెన్నఁడు నీ ప్రచండ
భండనోద్దండదోర్దండపాటవంబు
చెండవద్దా తురుష్కుల కండలురల
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 60

సీ॥ అంబుధిదరి సైకతంబున గ్రుంకిపో
యెను సేతుబంధరామేశ్వరుండు
కడు ఫలహారియై జడలల్లుకొని తపో
వృత్తిఁగైకొనె జంబుకేశ్వరుండు
భస్మాసురోద్దండపటుబాహుశక్తి క
దృశ్యుఁడయ్యెఁజిదంబరేశ్వరుండు



భీకరాటవులలో నేకాంతవృత్తితో
నడఁగియుండెను మల్లికార్జునుండు

తే॥ మధురచొక్కయ్య భోగము ల్మరగినాఁడు
రంగనాథుండు నిద్రించె రాత్రిపవలు
కొండ దిగిరావు తురకలఁజెండలేవె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 61

సీ॥ బలువిడి బిడ్డలఁబాఱవైచినవారు
మగలను నెడబాసి పొగులువారు
పొదలు కొప్పులు వీడి పొదలు దూఱెడివారు
తొడవులు వడిపోయి యడలువారు
త్రొక్కు త్రొక్కుళ్ళ దుందుడుకు చెందినవారు
దిక్కుమొగంబయి తెరలువారు
చుట్టాలఁగానక కొట్టుమిట్టాడువా
రద్రిగహ్వరముల కరుగువారు

తే॥ నగుచుఁదౌరుష్కధాటి ఘోట్టారభటికి
వలసవెళ్లిరి యభిమానవతులు మొదల
వినఁగదే యాఁడుమొఱ విన్న ఘనుఁడ వీవు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 62

సీ॥ గగనాంబుజంబయ్యె నగరనియెడు పేరు
'బాద'నునామంబు వార్తకెక్కె
గొడ్రాలు చూలయ్యెఁ గోవెలపేరు 'మ
సీద'ను పల్కు ప్రసిద్ధమయ్యె
లంజెమందయ్యెఁ గేళాకూళిపేరు 'తు
ఖ్ఖా' ననుమాట విఖ్యాతమయ్యెఁ
గుందేటికొమ్మయ్యెఁ గుఱ్ఱముపేరు 'ఘో
డా' యను సంజ్ఞ వాలాయమయ్యె

తే॥ ఆంధ్రభూమి తుర్కలమయమయిన యట్టి
కారణంబున దేవరవారలిపుడు
వింటిరో లేదొ వీనులవిందు గాఁగ
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 63

సీ॥ అజగరాసురజఠరాభీలఖురళికా
మసృణ రక్తపుటెఱ్ఱమంటఁబొరలి
భీకరకువలయాపీడోగ్ర భద్రదం
తావళంబనెడు గోతాము ద్రొబ్బి
చాణూరముష్టికాశ్చర్య కృద్దీర్ఘ ని
ర్ఘాతమస్తకపు సంగడములెత్తి
రాణించు పెక్కువిన్నాణము ల్మెఱయు జాం
బవ దుత్కటంపు గంబానఁబెనఁగి

తే॥ కలహమెచ్చోటఁ గలదంచు గాసె వేసి
కొని సమాయించు జగజెట్టి వనఁగఁబరగు
నీవు ప్రతిమల్లుర హరించు టేమి దొడ్డు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 64

సీ॥ పల్లికొండస్వామి పద్మనాభుండు య
థోక్తకారియుఁదిర్వళూరి వీర
రాఘవదేవుఁడు రంగనాథుఁడు వట
పత్త్రశాయియు శార్ఙ్గపాణి మొదలు
గాఁగల దేవళ్లు కనుగూర్క మీ యన్న
తిల్లగోవిందుని తెఱఁగుఁజూచి
తామును బవళించి రేమని తెల్పుదు
భండనమ్మున కుల్కి పండఁబడిన

తే॥ కపటనిద్రానుభవులచేఁ గార్యమగునె
వారి కొండాట చాలించి వచ్చినాఁడ



దాడివెట్టు తురుష్కుల దండుమీఁద
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 65

సీ॥ కర్తారుమంత్రసంగతి నెట్లు పఠియింతు
గాయత్రి గగ్గులకాఁడు చేసి
మకిలికజ్జాలనేమకము నెట్లు భరింతు
బాజునోటికి వక్కబ్రద్ద లేక
యకట లలాటశూన్యము పాపమెట్లు మా
నగ నేర్తు నుదుటను నామమిడక
నిను జగజ్జనకుని వినుతిసేయుట మాని
పెనుగొండబాబు నేమని భజింతు

తే॥ నేమిరా నా మొఱాలింప వించుకైన
రాతికైనను దయ రాదె రామరామ
యెంత దయ లేని తండ్రివి కృష్ణకృష్ణ
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 66

సీ॥ ఓర్తువా ధేనుల కుఱికి గొంతులుగోయ
నావులఁగాచిన యయ్య వీవు
తాళుదువా వధూత్కరములఁజెఱవట్ట
ద్రౌపదిఁగాచిన తండ్రి వీవు
సైతువా బ్రాహ్మణజనుల నిర్భంధింప
విప్రులఁగాచిన విభుఁడ వీవు
ధరియింతువా గ్రామదైవాల ఖండింప
సురలఁగాచిన దయాపరుఁడ వీవు

తే॥ అకట ప్రత్యక్షసిద్ధాంతులై యశాస్త్ర
కలన వర్తించు తురకల గెలువరాదె
నీవు శాస్త్రపరిజ్ఞాననిపుణమతివి
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 67

సీ॥ అబ్ధిలో మిట్టిమీనై పుటం బెగసిన
గట్టుక్రిందటఁజలపట్టియున్న
ఘుర్ఘురించుచు వాఁడికోఱలు నూఱిన
నిప్పులు గ్రక్కుచు నుప్పతిలిన
నిష్ఠతో మింటికి నేలకుఁబెరిగినఁ
జలమూని ప్రజ్ఞలు పలుకుకొనిన
గొప్పవిల్లెక్కుడుగొని విజృంభించినఁ
జిచ్చైనఁగొని ఢాకఁబుచ్చుకొనినఁ

తే॥ జికిలివాలమ్ముగతి నెదల్చింతు ననినఁ
గలుగుదురె నీకు గుజ్జుపుఁగలికిరౌతు
లైన వెఱతురుగాని పఠానిభటులు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 68

సీ॥ కామాక్షిముక్కు చెక్కలువోయె నని సిద్ధ
లింగఁడు విడిచెఁ గళేబరంబు
కావేటిరంగఁడు కడప వెళ్లఁడనంత
పద్మనాభుఁడు పరిభ్రమణ మందె
అష్టమహాసిద్ధులడవులపాలైరి
చెన్నకేశవస్వామి పెన్నఁగ్రుంకెఁ
గుక్కతేజిదువాళిఁగొని భైరవుడు పాఱె
గొండగోపాలుఁడు గుహలఁదూఱె

తే॥ సిద్ధవటము తురుష్కులు చెండునప్పు
డొంటిమిట్టరఘూద్వహుఁడొకఁడు నిలిచె
రాచపొల్లేల గల్గు ధరాతలమున
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 69

సీ॥ యవనాధమునకు మున్నాజిలో పెన్నిచ్చి
పరువెత్తె రాజగోపాలమూర్తి



బొడ్డుమాణిక్యంబు పోవునో యని కంచి
వరదప్ప భయమున వణఁకసాఁగెఁ
జిఱుతకూఁకటివాఁడు చెంగల్వరాయఁడు
ఘటికాచలస్వామి గట్టు దిగఁడు
భూమిక్రిందట నీగె శ్రీముష్ణదేవుఁడు
తిరుకోవళూరయ్య విఱిగిపోయెఁ

తే॥ జండవిజయాపురీమహోద్దండమనుజ
రాక్షసబలంబు దాక్షిణాత్యక్షితీంద్ర
భూము లుక్కలంబుగ మ్రింగఁ బూనినపుడు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 70

సీ॥ కపిలేశ్వరుండేల కరకరి చూపఁడో
మసకలు గొనఁబోలు నొసలికన్ను
గోపాలుఁడేల పైకొని విజృంభింపఁడో
సుడిపడెఁగాఁబోలుఁ జుట్టుఁగత్తి
రఘువీరుఁడేల విక్రమశక్తిఁ బూనఁడో
పిడితప్పెఁగాఁబోలుఁ బెద్దవిల్లు
సంజీవపతి యేల శౌర్యంబు నెఱపఁడో
ముదిసిపోవఁగఁబోలు ముసలితోఁక

తే॥ నిర్నిరోధ,నిరాఘాట, నిరుపమాన
నిస్సహాయ, భవద్భుజోన్నిద్రధాటి
పాటి లేదయ్యెనె తురుష్కకోటి గవయ
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 71

సీ॥ వృషభాచలఖ్యాతి విలసిల్లు నీ కొండ
పరిపంథితృణములఁబాపుకొనదె
గరుడాచలస్ఫూర్తి గనుపట్టు నీ కొండ
యరిభుజంగముల బిట్టడఁచుకొనదె

శేషశైలనిరూఢిఁ జెలువొందు నీ కొండ
విజయనిక్షేపము ల్వేజరుటరుదె
యంజనగిరిలీల హవణించు నీ కొండ
విమతులప్రాణముల్ గమిచికొనదె

తే॥ యిట్టు బలుకొండ దుర్గమై యెసఁగుచుండ
చండతౌరుష్కమండలిఁజెండరాదె
యెంతమాత్రము నీ ధాటి కెదురుగలదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 72

సీ॥ మంథానశైలనిర్మథ్యమానాబ్ధి ని
ర్ఘోషసంరంభంబుఁ గుంటుపఱిచి
ప్రళయవేలావినిర్భరధరాచకిత ది
గ్గజబృంహితములఁ జీకాకుపఱిచి
యమృతాపహరణసంభ్రమగరుత్మద్గరు
జ్ఝంక్రియాహంకృతుల్ చౌకపఱిచి
జాలంధరేశభంజనకంఠ బిలగిల
ద్ఘీంకారకలనంబు గ్రిందుపఱిచి

తే॥ వఱలు భవదీయముఖగంధవాహపూర్య
మాణదరగర్భదళన భంభంనినాద
గరిమ తురకల గుండెలు గలఁచుటరుదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 73

సీ॥ పానకం బానసేపట్టె మా మంగళ
గిరిసామి కూఱటతెఱపి లేదు
లచ్చితోఁ దచ్చన ముచ్చటాడనెపట్టెఁ
దఱిగా దహోబలాధ్యక్షహరికి
మీఱి ప్రసాదంబు లారగింపనెపట్టె
నూహ చాలదు పురుషోత్తమునకు



నాత్మయోగానందుఁడగుచునుండనెపట్టె
ధర్మపురీగుహాస్థానపతికి

తే॥ వారు మజ్జాతిఁ జేసికొన్నారు మున్నె
తురకదేశాన దాక్షిణాత్యుఁడవు గాన
నొంటిగాఁడవు నీ వెట్టు లోర్వఁగలవు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 74

సీ॥ శ్రాంతిఁజెందితివేమొ చక్రతీర్థాది క
ల్లోలినీ జలకేళిఁ దేలియాడి
యలసితివేమొ యనంతయాళ్వార్ల స
మ్యక్తటాకమునకు మట్టిమోసి
యొపలేవైతివేమో మహాబ్రహ్మోత్స
వారామసీమావిహారవృత్తి
శ్రమముఁజెందితివేమొ జనుల కశ్రాంతంబు
గరుడగంబముచెంత వరములిచ్చి

తే॥ కాక లేకున్నఁ దిరుపతిదాఁక ఢాక
చూపి దాడిడు మ్లేచ్ఛులఁజూచి యేచి
యెదురు నడవకయుందువె యింత తడవు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 75

సీ॥ కావలిగ్రామ నిర్ఘాతపాతమ్ము గం
డవరావనీరుట్కుతారధార
కోవూరితృణకణదావపావక కేళి
దువ్వూరిమశకోగ్రధూమరేఖ
నెల్లూరిమదవదనేకపోద్భటసింహి
పాలూరిపట్టనప్రళయవార్త
పెళ్లకూరీలతాభీలధాత్రీకోటి
రావూరిహరిణాంకరాహుదంష్ట్రి

తే॥ యై ప్రతిగ్రామున కభివ్యాప్తిఁజెంది
ఘూతసంక్షయయావనోద్భూతధాటి
ఘోటికోద్ధూతధూళి దిక్కోటిఁబొదివె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 76

సీ॥ 'అబిసిహుమాశాల' లయ్యెఁగా వివిధ పు
ణ్యాగణ్యదివ్యదేవాలయములు
'లష్కరీ'కరిఘటాలానంబులయ్యెఁగా
మానితకేళికోద్యానతరులు
'సరదారు'విశ్రమస్థానంబులయ్యెఁగా
సద్ద్విజశ్రేణిపూజాగృహములు
కాసరీమూత్రసంకలితంబులయ్యెఁగా
యతిపవిత్రాంబుపద్మాకరములు

తే॥ కటకటా యెట్టులోర్చు నుత్కటకఠోర
వీరసురధాణయబ్దులోగ్రారభట్య
పాకధాటికి నెల్లూరిపట్టనంబు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 77

సీ॥ తరలాక్షిబిరుదందె తాటింపు గాదుగా
పడదీసికొను జేరుబందువాటు
సకియసిబ్బెపుగుబ్బచనుపోటు గాదుగా
గొప్ప నేజాగుబ్బకుప్పెపోటు
వలకారిగుమ్మచెక్కిలినొక్కు గాదుగా
జిఱుకొట్టుగుల్లాపుతఱటువ్రేటు
మొలకముద్దియపంటి మొనగంటి గాదుగా
మాఱుబాసగరీబు నోరుకాటు

తే॥ కటకటా యెట్టు ధరియింపఁగాఁ దరంబు
మెఱయు కర్ణాటరసికశేఖరులకింత



నేగివచ్చిన నీవు రక్షింపకున్న
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 78

సీ॥ కోలాహలంబుగాఁ గొండఁజుట్టుక నిన్ను
దుడ్డితే నీ మొనలడ్డుపడునె
హురుముత్తుగా వచ్చి కెరలి నీ చేకత్తి
తీసికొన్నను నీకు దిక్కుగలదె
నెగడి యుద్ఘాటించి నీ సొమ్ము దోఁచుకోఁ
జేరితే నినుఁగాచువారు గలరె
ఢాకతో గుడిఁజొచ్చి డాసి నీ బిలమెల్ల
జెక్కితే నీ మొఱ యెక్కఁగలదె

తే॥ యయ్యయో స్వామి దాక్షిణాత్యార్తజనము
నీ కటాక్షంబు లేకున్న నిర్వహింప
గలదె నానాటి మ్లేచ్ఛబాధలకు నొచ్చి
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 79

సీ॥ రేపల్లెలోఁజాల రేవగల్ వెన్నలు
దొంగిలి మ్రింగిన దుండగంబు
మగనాండ్రనక గొల్లమగువల సిగ్గులు
కొల్లలాడినయట్టి కోడిగంబు
జనయిత్రిచందానఁజన్నీయ వచ్చిన
పూతనఁజంపిన పాతకంబు
నన్నచే ముసలిగా యనక నాఁగటికొయ్య
మోవఁజేసిన కండకావరంబు

తే॥ మఱచినాఁడనే నీ తొంటిమర్మమెల్ల
నేకి కాకుల కిచ్చెదఁగాక యేల
మోవనిత్తును తురకల మొత్తకున్న
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 80

సీ॥ దశమి యేకాదశి ద్వాదసుల్ పడిపోయెఁ
గడు 'రజా'పండువుల్ ఘనతకెక్కె
విష్ణుశివస్థాన విభవముల్ చెడిపోయె
'బాబయ్య' కానుకల్ ప్రబల మాయె
కమనీయగురుపీఠకంబు లుత్సారించె
నిలఁ'బకీర్ల'కుఁబ్రజ్ఞ లినుమడించె
వేదశాస్త్రాదిసద్విద్యలు కఱవయ్యె
మహి మల్లశాస్త్రముల్మహిమ హెచ్చె

తే॥ నకట కలికాలకల్మషహరవిశేష
శేషశయనేంద్ర పండిత శేషభాష
తురకలకు నిచ్చితివొ నీదు దోర్బలంబు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 81

సీ॥ త్రుప్పువట్టెనొ మహాద్భుతభీకరగ్రాహ
కంఠలుంఠనచక్రకఠినధార
చికిలిపోయెనొ పూర్వదేవ జీవవినాశి
భండనోద్ధత గదాదండపటిమ
దారిదప్పెనొ మహోదారకైటభమూర్ధ
దళననిర్ఘాంతనందకకృపాణి
పేఁటెత్తెనో నిరాఘాటదుర్మార్గ, ఖే
లన, శార్ఙ్గపటుధనుర్లస్తకంబు

తే॥ కొట్టి గోరించరాదె రక్షోభటాళి
కరణి దండెత్తు రణదళ 'ఖాను'దళము
చక్కుచక్కులు గాఁగఁ దత్సాధనములు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 82

సీ॥ అంబుచర, క్రోడ, హరి, కుబ్జ, రామత్ర
యాంగజ, జిత్తురంగాధిరోహ



కాకృతుల్గల నీవు తోఁకచే, వీఁపుచేఁ,
బంటిచే, గోటిచేఁ, బదముచేఁ, గు
ఠారంబుచేఁ, బ్రకాండంబుచే, హలముచేఁ,
బరిరంభణముచేఁ, గృపాణిచేత,
చిమ్మి యెత్తి,దళించి, చించి, త్రుంగఁగఁద్రొక్కి,
చెక్కి, తూఁటిడి, దున్ని, నొక్కి వ్రేసి,

తే॥ కోవు రని యార్చుకున్న, గగ్గోలుగాఁగ
కొండ పెకలింపక, పురంబు కొల్లగొనక
నిన్ను గెలువకపోదురే నెఱ 'వజీర్లు'
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 83

సీ॥ చెండసాఁగిరిగదా శ్రీవైష్ణవులఁబట్టి
పిల్లవట్రువజుట్లు ముళ్లువేసి
మొత్తసాఁగిరిగదా ములికినాటయ్యల
పిఱ్ఱలమీఁదనే కఱ్ఱలెత్తి
కొట్టసాఁగిరిగదా గొడ్లవేటిమహాగ్ర
హారభూసురకోటి నంటఁగట్టి
తిట్టసాఁగిరిగదా తెరిమాకిచోదంబు
పాటించి ద్రావిడప్రజలనెల్ల

తే॥ యెంత పాపంబు జనుల నింతింతలైన
వెతలఁబెట్టంగ నొక్కింత వెఱపు లేక
యడఁగియున్నావు బిలమందె వెడలిరాక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 84

సీ॥ శ్రీహరి ననుకోను చెంగేరు దక్కిణుల్
అదరక మృత్యుజాహల్లి నను ము
పెరుమాళ్ల ననుకోకు తురకలు మొత్తేరు
పేర్మి 'ఖౌదా' పేరు పెట్టుకొనుము

విష్ణుండ ననుకోకు  వేసేరు పారసీల్
　　　‘కర్తారు’పేరు వేగమ వహించు
కృష్ణుండ ననుకోకు గెంటేరు దానకీల్
　　　పూను ‘బాబయ్య’ పేరైనఁగాని

తే॥ దేవ నీ సొమ్ము గట్టిగాఁదిన్న కవిని
గానఁజెప్పితి నిఁక నాకుఁగడమ లేదు
బెదర కటుచూచి మున్నె తప్పించుకొనుము
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 85

సీ॥ వహిఁజేపవై యున్న వడి మ్రింగఁజూచేరు
　　　తాబేఁటివై యున్నఁదప్పదటులు
తగ మృగేంద్రుఁడవైన దెగఁబడవేసేరు
　　　బాపడవై యున్న బ్రదుకనీరు
మడకమోపరివైన విడువక దున్నేరు
　　　రాజవైనను నీకుఁదేజునీరు
వగ దిగంబరివైన నగడుసేయకపోరు,
　　　గుఱ్ఱమవైన నెక్కకపోరు

తే॥ ఇన్ని చాలించి పందివై యున్న నిన్నుఁ
జేతముట్టరు దగ్గఱఁజేరవెఱతు
రెండు కిఁకఁబంద వగుదువో పంది వగుదొ
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 86

సీ॥ కరికొల్ల మొసలికర్కర కుల్కి చేయెత్తి
　　　మొఱ్ఱోమొఱో యాదిమూల మెవఁడు
వాఁడు నన్నేలెడివాఁడు వానికి జోహా
　　　రంచుఁబల్కెడి మొఱ యాలకించి
తాఁగాను నేఁగాను దన పట్టితోడు పాఁ
　　　పనియాన చెడ్డవట్టనుచు బ్రహ్మ
రుద్రాదులుండ నార్తులపాలితంత్రివి
　　　పరతంత్రుఁడవు పరాత్పరుఁడ వీవు



తే॥ కాన విడరాని రమనట్టె కౌఁగిలింత
యును విడిచి గున్కుపర్వెత్తు కొనుచు వచ్చి
కాచితివి యంచు మది నిన్ను గణుతిసేతు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 87

సీ॥ మొండిగంజాతిండి లండిపోతులమీఁదఁ
　　　గవితఁజెప్పఁడు ‘గజాగాడి’గాని
పచ్చినెత్తురు ద్రావు పాశ్చాత్యులను నమ్మి
　　　కొలువఁడు జోగుల కొడుకుగాని
తఱచుగా గోవుల తలఁగ్రోయు ద్రోహుల
　　　యొద్దఁబాడండెద్దు మొద్దుగాని
పరమసాధ్వులఁజెఱల్వట్టు‘గులాము’ల
　　　కిడఁడు నేస్తము తొత్తుకొడుకుగాని

తే॥ రసికులై మించినట్టి కర్ణాటకంబు
మనుజులెట్లు చరింతు రీ ‘మాఱుబాస
ముండకొడుకుల’ నమ్మి యేమో గదయ్య
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 88

సీ॥ చక్రహస్తుఁడనను విక్రమంబే కాని
　　　పట్టి తురుష్కులఁ గొట్టలేవు
లచ్చి యిల్లాలను లావణ్యమే కాని
　　　వడ్డికాసొక్కటి వదలలేవు
మేటిదేవుండనుమాట మాత్రమె కాని
　　　వేయాఱులర్థుల కీయలేవు
కనకాంబరుండనే ఘనతమాత్రమె కాని
　　　‘సాపాటు’ చేరుళ్ళసాదమయ్యె

తే॥ తోమనీయవు పళ్లెము ల్దొడ్డదొరవు
ఇట్లు గడియించి తురకల కీయఁదలఁచి
యున్న నిను నమ్ముదురె భక్తులుర్విలోన
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 89

సీ॥ కోటవెట్టించుకో కొండచుట్టును నీవు
కానికపైకంబు కర్చుచేసి
కొత్తళంబులు గట్టి కొన్నిరూకలు పెట్టి
హెచ్చుఫిరంగీల నెత్తికట్టు
పైదండుగా నంపు పదివేలక్రోఁతుల
నెలుఁగుగొడ్లను బంపు మెక్కకుండ
కొంతగుజ్జుముగూర్చి కోనేరిదఱి నుంచు
రాణువ నుంచుకో నాణెమెఱిఁగి

తే॥ లోభివై కూర్చుకొన్నట్టి రొక్క మెల్ల
హీనమతులకుఁగానుక లీయవలదు
అప్పుఁడగు నాదు మనవిదే యాలకింపు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 90

సీ॥ సురనదికంటె మీసరమైన యోగ్యత
హురుముంజిమణికంటె మెఱయు ప్రియము
గంబూరకంటె వెగ్గలమౌ గుబాళింపు
పన్నీరుకంటె నుప్పతిలు చలువ
తఱివెన్నకంటె చిత్తిరమైన మార్దవ
మపరంజికంటె హెచ్చైన తళుకు
చీనిచక్కెరకంటెఁజెలఁగు మాధుర్యంబు
పద్మినికంటెఁజొప్పడిన యొప్పు

తే॥ గల భవన్నామ నిగమాంతగంధలహరిఁ
జికిలి చేసిన మజ్జిహ్వచేత నరుల
నెంచకుంటి నిందాఁక నింకేమిసేతు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 91

సీ॥ ఘనుఁడు కావేటిరంగని యారగింపును
గంచిలో వరదప్ప గరుడసేవ



పెనుగొండ రామభద్రుని వైభవస్ఫూర్తి
తగు గండికోట మాధవుని ఠీవి
యుదయాద్రి రఘువీరుడుండెడి చందంబు
కడప వేంకటరాయఘనుని మహిమ
కాళహస్తీశ్వరు కలిత ప్రసిద్ధులు
మల్లికార్జునుటెక్కులెల్ల నుడిగె

తే॥ జుట్టి యేఁకరుపాళ్యాల నట్టనడుమ
నీకుఁజెల్లెర విభవము ల్నేఁటిదాఁక
సీమదేవళ్ళవలె నీవు చేరుకోక
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 92

సీ॥ ఏ కొండ నుండేవు నీ కొండరాళ్ళెల్లఁ
బెకలించి 'గోరీలు' వెట్టునపుడు
ఏ పూలు ముడిచేవు నీ పూలతోఁటెల్ల
విదళించి 'గంజాయి' విత్తునపుడు
ఏ మారగించేవు నీ మహానైవేద్య
మెంచి 'పకీర్ల'కుఁ బంచునపుడు
ఏ సొమ్ము పెట్టేవు నీ సొమ్ము లెల్లను
రౌతు 'గాసాల'కు రాసునపుడు

తే॥ బీదరౌతుల నొక కొంత పెద్దచేసి
యిటుల నేమఱియుందురే యేపు దఱిఁగి
శీఘ్రముగఁబారసీకులఁజెండరాదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 93

సీ॥ సంజీవరాయని సరిగఁజూడఁగరాదు
ఉదరి సన్నిధివీధి నుమియరాదు
తరి, మట్లెవారి గోపురము దాఁటఁగరాదు
బుగ్గలోపలఁగాళ్లు పులుమరాదు

నెఱి జియ్యరుమఠాలు నిక్కి చూడఁగరాదు
కలియుగలక్ష్మిని గలియరాదు
కానుకరొక్కంబు గణుతీకపోరాదు
సాలవాకిట రంతు సలుపరాదు

తే॥ ఇప్పుడిటువంటి మర్యాదలెల్లఁ దప్పె
గండు మీఱియుఁదురకలు గట్టుచుట్టు
కొనిరి గదవయ్య తిరుపతి కొల్లగొనుచు
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 94

సీ॥ తళిగెలు దోఁచుక తప్పెట్లుగాఁజేసి
తాళముల్ చెమటపాఁతలుగఁజేసి
వెయిగాళ్లమంటపివీథి లాయముచేసి
కోవెల 'బాబయ్య గోరి' చేసి
గర్భగృహంబులు గలయంపిగాఁజేసి
విగ్రహంబులఁబట్టి విఱచివైచి
తిరువాభరణపిండ్లు తీసి సోదా చేసి
మఠపడియును దారుమారుఁజేసి

తే॥ నంబులను గొట్టి జియగార్ల నఱకివైచి
చుట్టు తిరుమాళిఘలు చాలఁజూఱపుచ్చి
కొల్లలాడెడి తురకలఁ గొట్టవలదె
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 95

సీ॥ విమల గోవింద గోవిందశబ్దము కాదు
'శాహుసేన్ బాహుసేన్' సంకులంబు
కోణంగిదాసల్ల కుప్పిగంతులు గావు
మధుసీధుపానదోర్మదపునటన
ఘనవాద్య మేళముల్ గావు గుండియలట్లె
పగిలించు పెద్దబూరగలనాదు
దీప్తవజ్రాఖండ దీపకళికగాదు
జళిపించు పెద్దకత్తులమెఱుంగు



తే॥ ఇట్టి భయములు గల్పించునట్టి మ్లేచ్ఛ
భటులఁదునుమక యాలస్యపడుచు నీవు
సైఁచుకొన్నావు నీ కిది సమ్మతంబె?
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 96

సీ॥ మేలైన యుత్తమాశ్వాలకు నెల్లను
శూల కుట్టానంగఁ జూపితేని
బోరుకొండలనంగ భువిని భద్రగజంబు
లన్నియుఁబడ మాయ వన్నితేని
యార్చి రౌతుల మదంబంతయు నణఁగించి
తొట్టిన, గోరీలు, వెట్టితేని
పచ్చబద్దలతోడ బల్లిదంపు, వజీర్ల,
వీఁపులు పెట్లంగ వ్రేసితేని

తే॥ కోపు చెడి పాఱరే గోలకొండ ఢిల్లి
యాగర విజాపురీ మొదలైన తురక
గుంపు, సాహేబు, సల్లాము, ఖూబనుచును
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 97

సీ॥ పిఱికివాఁడనుచు దబ్బఱమాటలాడితిఁ
గా మహావీరపుంగవుని నిన్ను
అతినిర్దయస్వాంతుఁడంటిఁగా భక్త ర
క్షణవిచక్షణ సులక్షణుని నిన్ను
బలహీనుఁడంటిఁగా బహుముఖబ్రహ్మాండ
పరమాణురోమకూపకుని నిన్ను
తామసుండంటిఁగా ధగధగద్దగిత వి
జ్యోతిర్లతా స్వయంజ్యోతి నిన్ను

తే॥ ఏను లోకోపకారార్థ మేపుమీఱి
తురకల హరించుమని నిన్ను దూఱుకొంటి
నా సహస్రాపరాధముల్ సైచు తండ్రి
శత్రుసంహార! వేంకటాచలవిహార!! 98

[1]సీ॥ అవరంగపాచ్చావు హాజీలుగా వచ్చి
ధాటి ఘాటీకృష్ణ దాటినపుడె
ధర విజాపురమెల్ల తల్లడింపుచుపోయె,
గోలకొండావెన్క కోలుపోయె
కం(ద)నూల్ తరువాత ఘట్టి (గొట్టి?)(తా)ణ్యంబెట్టి,
ఆదవేనికి ముట్టడంపె గనక
సీమసీమలవారు చెలరేగి చెలరేగి,
ప్రజల కాపదలాయె గజిబిజాయె

తే॥ కొల్లకొండ(3)ను రవుసాయె కొంతతడవు
ఇండ్లపట్లను నుండుట కిరవు లేదు
ఎట్లు రక్షించెదవొగాక యెఱుగమకట!
శత్రుసంహార! వేంకటాచలవిహార! 99

-డి.నం.1710 తిరుపతి., ఓ.ఆర్.ఐ.తాళపత్రప్రతి. 27 ప.

సీ॥ కత్తులపచ్చళ్లుగా గోశినట్లు బెం
టల నజ్జులయ్యె ఘోడాలగములు
బాడిశఁజెక్కిన పచ్చి చందనపు రా
టల భంగులయ్యె భటాంగకములు
పులియశాహతులు బద్దులు(?) బారు పాషాణ
పంక్తులై వెనగూలె భద్రకరులు
గొడ్డంండ్ర నరకిన గ్రుంగెడు గుమి వెదు
ళ్లై తేరుపౌజు లిట్టట్టుపడియె

తే॥ పెద్దపాళెముకడ రణాభీలయవన
కోటిఁజెండాడ నెత్తురుల్గోలకొండ
పౌరబిబ్బీల కన్నీటి పయికిఁబార
శత్రుసంహార! వేంకటాచలవిహార! 100

-డి.నం. 830 తాళపత్రప్రతి, 24ప. (తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ)

---

1. ఆచార్య.కె.జె.కృష్ణమూర్తిగారి వ్యాసం చూ. ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్ ప్రత్యేక సంచిక. 1984. పుట 23 నుండి 29 వరకు.

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## వేంకటరమణశతకము

క॥ శ్రీకమలా హృత్పద్మది
వాకర! యదువృష్ణివంశవార్నిధివిలస
ద్రాకానిశాకర కుజన
భీకర! వారిరుహచరణ! వేంకటరమణా! 1

క॥ కందములఁబద్యశతకము
నందముగాఁగూర్చి నీదు నామంబున కే
విందొసగఁగోరితిని యర
విందేక్షణ గైకొను ఘృణ వేంకటరమణా! 2

క॥ గోరాడ్గోగోపాలక
గోరాజసుగోధరేంద్ర గోపతివినుతా!
గోరాజీవద్విడ్గో
పీరాగోర్జితమనోజ! వేంకటరమణా! 3

కం॥ అనురక్తా సద్భక్తా
వనపటుసక్తా యతులితపావనయుక్తా
ఘనవేదాంతోక్తా నా
వినుతుల్ గైకొనుము సఘృణవేంకటరమణా! 4

క॥ తరుణారుణమృదుపల్లవ
చరణా యంబుద ఘృణితను చారు స్ఫురణా
వరమునిజన సంస్మరణా
విరళాంతఃకరణభరణ వేంకటరమణా! 5

క॥ కరుణారస వరుణాలయ
కిరణామరమణికిరీట కీలిత పరనూ
పురమృదుచరణా కాంచన
విరచితపరిధానచరణ వేంకటరమణా! 6

క॥ రంగా! గతిదృగ్జిత సా
రంగా, సుందర విలాసరసితానంగా,
రంగదలక భంగసమద
భృంగా, సురథాంగధర, వేంకటరమణా! 7

క॥ ఈశా! మా హృత్పద్మది
నేశా! ఘనతర కరోద్యదిభసంకాశా!
ఆశాపాశవినాశ ని
వేశా! లోకేశభరణ వేంకటరమణా! 8

క॥ భద్రా! స్వస్త్రీకృత వర
భద్రా! కరుణాసముద్ర పరిహృతభువనో
పద్రవకరణక్షుద్రా!
విద్రవదానందకరణ! వేంకటరమణా! 9

క॥ సారా పారావార గ
భీరా! హైయంగవీన మృదుచోరా! సు
స్మేరాననవరజారా!
వీరా! వారిరుహచరణ వేంకటరమణా! 10

క॥ ధీరా! గోలోకాంత వి
హారా! సత్సారహీరహారా ఘనస
త్కారా! మునిమందారా!
వీరా! యతిమృదులచరణ వేంకటరమణా! 11



క॥ ఇష్టాఖండిత లోకా
రిష్టా యనుపమ కృపాగరిష్ఠా దైవో
త్కృష్టా భక్తజన మనో
భీష్టా స్రష్టృనుతచరణ వేంకటరమణా! 12

క॥ రామా! రావణదనుజవి
రామా! లక్ష్మీకుచయుగరాజిత వక్ష
స్సీమా! ముఖజిత సోమా
భీమా! శరవర్గహరణ వేంకటరమణా! 13

క॥ శ్యామా! తుళసీనళిన సు
దామా! ఘనసజ్జన సముదయకామా స
ద్ధామా సంగరపటురిపు
భీమా! నుత భూరికరుణ వేంకటరమణా! 14

క॥ ఇంద్రా! యశోజిత శర
చ్చంద్రా నయవితరణాది సద్గుణసాంద్రా
యింద్రియ నిస్తంద్రా కల
భేంద్రారిష్టదృతహరణ! వేంకటరమణా! 15

క॥ జలజేక్షణ! యదుభూషణ!
బలిశోషణ! పాపహరణ! పాండవకరుణా!
తులసీదామాభరణా!
వెలయుము నా పాల సుగుణ! వేంకటరమణా! 16

క॥ మృదృక్షణ నారాయణ
సద్భక్తాంతర్విహరణ సారసచరణా
సద్భువనవాస మధుముర
భిద్భానుజకులధురీణ! వేంకటరమణా! 17

క॥ ఉద్యత్ఖర కరకోటిసు
ఖద్యోతన నిభకిరీట ఖండితశకటా
ప్రద్యుమ్న జనక సంయమి
వేద్యా మృదుకమలచరణ! వేంకటరమణా! 18

క॥ అద్భుత యభ్యుదయాకర
సద్భుజబలశౌర్య ధుర్యసత్యౌదార్యా
మద్భావస్థిర వరబల
భిద్భామణి తనుసుకిరణ! వేంకటరమణా! 19

క॥ దుష్కరదుర్భర దుర్గమ
పుష్కల దుష్కర్మవహ్నిపుంజముచేతన్
శుష్కీభూతమదీక్షా
విష్కిరమున్ బ్రోవు కరుణ వేంకటరమణా! 20

క॥ భండనఖండితహర కో
దండా సురనాథవినుత ధార్మిక కరుణో
ద్దండ బలానుజ దండిగ
వెండియు నినుఁగొల్తు సుగుణ!వేంకటరమణా! 21

క॥ బృందారకరాజా భవ
సందేహ సమస్తభువన సన్నుతచరణా!
సుందరపోషిత నర గో
విందా మద్భాగ్యసుగుణ! వేంకటరమణా! 22

క॥ ఆద్యంతరహిత పూరుష
విద్యాధర సిద్ధసాధ్య వినుతచరిత్రా!
సద్యఃఫలదాయక ఘన
విద్యాపారీణసుగుణ! వేంకటరమణా! 23



క॥ శుభ్రేతరాభ్ర ఘృణిగణ
విభ్రాజిత విమలదేహ విపులకటాక్షా!
విభ్రమిత సకలదిక్తట
బిభ్రద్భూభృత్ప్రపూర్ణ! వేంకటరమణా! 24

క॥ మధుర మధుసన్నిభాధర
విధువదన మదేభయాన వివిధసురూపా
కుధరధర ధీర మాధవ
విధిజనక సదాభిభరణ! వేంకటరమణా! 25

క॥ సాధుజనబాధనిధనా
గోధన యధినాథ ధనద గోధరశయనా
బాధిత వైరివితానా
వేధఃపిత పాపహరణ! వేంకటరమణా! 26

క॥ అక్షీణ బలపరాక్రమ
వక్షోభృతకౌస్తుభాంక వనజాక్ష భవ
త్పక్షచర రక్షణాంశము
వీక్షించవదేమి సఘృణ! వేంకటరమణా 27

క॥ రక్షాదక్ష విచక్షత
పక్షీంద్రారూఢ నీకు పక్షంబైనన్
కుక్షివెత నోపలేక య
పేక్షించితి నీదు కరుణ వేంకటరమణా! 28

క॥ కుక్షిస్థాఖిలలోకా
పక్షీంద్రపతాక దాసపక్ష విచక్షా
భిక్షాచర బలిశిక్షా
విక్షేపములుడుపు సఘృణ! వేంకటరమణా! 29

క॥ రక్షక శిక్షక దక్షక
విక్షేపములుడిపి ప్రోవు వేడుకతోడన్
దాక్షిణ్యంబేర్పడఁగా
వీక్షింపుము కమలచరణ! వేంకటరమణా! 30

క॥ సాక్షివి సకల సులక్షణ
కుక్షివి కరుణాకటాక్షగుణచయపక్షా
రక్షింపు మనఁగ నెందుకు
వీక్షింపుము నన్నుఁగరుణ వేంకటరమణా! 31

క॥ శుంభత్పరమద ఖండన
జంభారితనూజమిత్ర జలజసునేత్రా!
కుంభజవైరినుతావన
బింబాధర భూరికరుణ ! వేంకటరమణా! 32

క॥ శుంభదవష్టంభ భుజా
జృంభణభిత్కంస కుంభిభేదితయవనా!
రంభోరు సదంభోరుహ
బింబాధరవదన మదన వేంకటరమణా! 33

క॥ కుంభీంద్రవరద కుంభజ
సంభావిత సకలభువన సంభవగర్భా
కుంభిని కుంభాసురహర
బింబోష్ఠ మదిష్టభరణ వేంకటరమణా! 34

క॥ మిత్రకుల రాజపుత్ర సు
మిత్రసుతాగ్రజసుమిత్ర మృషవాక్ఛిత్రా
మిత్ర సమాజలతాసు ల
విత్రా మద్భరణ సుగుణ వేంకటరమణా! 35



క॥ సద్యుతి మృగమదతిలకా
విద్యుద్ద్యుతి రుక్మచేల విమలవినీలా
సద్యుక్తిముగ్ధచరితా
విద్యాధరవినుతచరణ! వేంకటరమణా! 36

క॥ ఘోరతరకలుష సాయక
పూరితదేహుఁడగు నన్నుపూర్వకృపన్ మే
లారసి చూడు మహా యా
భీరపదపవిత్రచరణ! వేంకటరమణా! 37

క॥ అతి ఖరనక్రగ్రహ కర
గత కరిరాజవరుఁడొండుగతి మఱిలేకన్
ధృతిచెడి నిన్వేడఁడె వడి
వెతలుడిపినదొరవు సుగుణ! వేంకటరమణా! 38

క॥ లసదసమానగుణాఢ్యా!
బిసరుహదళనయన వైరిభీకర సుకరా!
ప్రసరింపఁజేయు నాపై
విశదంబుగ నీదు కరుణ వేంకటరమణా! 39

క॥ ద్విజరాజవాహనధ్వజ
ద్విజరాజోపరిశయాన ద్విజరాడ్వదనా!
ద్విజవైరిదళన సద్భుజ
విజిత సమస్తభువనగణ వేంకటరమణా! 40

క॥ దుర్జనులను నిర్జింపుచు
నూర్జింపుచు విబుధకోటి కొనరు యశంబే
యార్జించి నించి మించిన
విర్జానద్యుపరిభవన! వేంకటరమణా! 41

కII ఖరపుచ్ఛక్షేపహత
స్ఫురదాగమనిగమపుంజ సోమకపాట
చ్చర తళ్కుబెళ్కు తొల్కెడి
విరళపురుష వేషభరణ! వేంకటరమణా! 42

కII నిష్ఠుర విపులకఠోర సు
పృష్ఠోపరిభాగనిభృత భూభృచ్ఛ్రేష్ఠా
కష్టమ నన్ బ్రోవఁగ మద
భీష్టప్రద కమఠ నిపుణ వేంకటరమణా! 43

కII హాటకనేత్రాసురగిరి
పాటన పటుపవిసమాన పాండురదంష్ట్రో
చ్చాటిత భూమికిటీ నా
పేటునఁగాచికొనుము ఘృణ! వేంకటరమణా! 44

కII దుడదుడ డింభకుఁబ్రోవను
బెడిదపుఁగంభముఁ బగిల్చి భీకరగతిచే
కడు వెడలిన నరసింహుఁడ
విడువక నన్ బ్రోవు సుగుణ! వేంకటరమణా! 45

కII బలి బలసంపన్నత కవి
చెలిమిని బొలియింప నిచ్ఛఁజెంది సునిష్ఠన్
ఇలఁజిట్టెడు బాపఁడవై
వెలసిన భిక్షానుచరణ వేంకటరమణా! 46

కII ఆదరమున జమదగ్నికి
మోదమెసగఁబుట్టి బహుళభుజదండముపై
నూదిన చటులకుఠార వి
భేదిత భూభారభరణ వేంకటరమణా! 47



కII రాముఁడవై త్రిజగద్రిపు
భీముఁడవై రఘుకులాబ్ధి విమల సువిలస
త్సోముఁడవై వెలసినదొర
వేమరు నన్ జూడు కరుణ వేంకటరమణా! 48

కII హలివై, యరివిదళన పటు
బలివై, ఘననీలచేలివై, నిర్మలివై,
యిలభారహరణ, ఫలివై,
వెలసిన రామాఖ్యభరణ! వేంకటరమణా! 49

కII అపరిమితబలపరాక్రమ
త్రిపురాసురవరుల మదము త్రిప్పటకొఱకై
కపటపుబుషివై వెలసిన
విపుల విబుద్ధప్రతరణ! వేంకటరమణా! 50

కII ధాటి గల చాటు నటనల
ఘోటకగమనుండవగుచు ఘోరాటవులన్
మేటి కృపాణకరుఁడవై
వేఁటాడిన కలికినిపుణ! వేంకటరమణా! 51

కII స్ఫురదరవిందసులోచన
మరకతమాణిక్యహార మణిమయమకుటా!
వరలక్ష్మీకుచకుంకుమ
విరచిత వక్షోంకభరణ! వేంకటరమణా! 52

కII ఖర కర వరకుల తిలకుఁడు
సురవరుల కసులభుఁడగుచు సురమునికోట్లన్
జెఱిచిన ఖరదనుజు శిరము
బెరికిన ఘనవితరణగుణ! వేంకటరమణా! 53

క॥ పసచెడి వడి మొఱలిడఁగను
కసరక సురవరుల కరుణఁగాచిన సుగుణా!
యసమాన దోషకారుఁడ
విసువక నన్నేలు కరుణ వేంకటరమణా! 54

క॥ పాదముల నూపురంబులు
మోదముగా నందగింప మురిపము మీఱన్
ఖేదములుడుపను వడిగను
వేదజనక రమ్ము కరుణ! వేంకటరమణా! 55

క॥ మకుటతటఖచితపటుమణి
నికరోదీర్ణాచ్ఛకాంతి నిండుగ నిగుడన్
నొకసారైనను నెదుటను
వికసింపుము కమలచరణ! వేంకటరమణా! 56

క॥ యదుకుల దుగ్ధపయోనిధి
మృదుచంద్ర వినీలదేహ మృదృక్షసదా
సదమల నీ పదవనజమె
వెదకన్ మదిగొల్పు సుగుణ! వేంకటరమణా! 57

క॥ మధురతర వాక్ప్రచారా
విధిసురనుత సరసచతుర వేదవిచర నీ
కథలెప్పుడు కర్ణములన్
విధిగా వినఁజేయు సుగుణ! వేంకటరమణా! 58

క॥ అనుదినము మునివరేణ్యులు
ననురాగము గదుర మదిని నతులితభక్తిన్
గన వేఁడెడు నీ రూపము
విన మతిఁగనఁజేయు నిపుణ వేంకటరమణా! 59



క॥ పరమై కౌస్తుభమణి కా
కరమై సిరికిరవగుచును గనుపట్టెడు నీ
యురము తులసీదళవాసన
విరివిగఁగొనఁ జేయు కరుణ వేంకటరమణా! 60

క॥ వరమై సూరిజన మనో
హరమై నెవ్వరికి నతిదురాపంబౌ నీ
చరణార్చన మొనరింపన్
విరళముగా గఱపు సుగుణ వేంకటరమణా! 61

క॥ వరణీయార్చారూపము
కరమరుదుగఁబూని సకలకలుషఘ్నుఁడవై
ధర నెలకొన్న స్థలమునకు
బిరబిర నన్నునుపు కరుణ వేంకటరమణా! 62

క॥ వాదా? దయ లేదా? రా
రాదా? నన్ బ్రోవ నిపుడు రాద్ధాంతముగా
మాదార బుధాధార సు
వేదారి ప్రాణహరణ వేంకటరమణా! 63

క॥ దాతవు, నిర్ణేతవు, విధి
తాతవు, సంత్రాత వెపుడుఁదలఁపవహో నా
వ్రాఁతా నన్ దలఁచిన మది
భీతా దుర్దనుజహరణ వేంకటరమణా! 64

క॥ ఉదరమున సకలజగములు
కుదురుగ నుంచుకొని యేలు గుణశీలుఁడ నీ
పదములు నమ్మిన నీచుని
బెదరుడుపన్ భరమ సుగుణ వేంకటరమణా! 65

క॥ గిరి యెత్తుటొ కరిఁగాచుటొ
ధరాభరాహరణుఁడౌటొ ధారుణికోఱన్
ధరియించుటొ నను నేలుట
వెరపేటికి బ్రోవు కరుణ వేంకటరమణా! 66

క॥ మఱి మఱి నే మొఱలిడఁగను
సరి సరి వెఱవకుమటంచు సర్వమంతేఁ
గరుణ గల పలుకు బలుకవు
బిరుదా నీకిట్టి యఘృణ వేంకటరమణా! 67

క॥ నీ పదములు మదిఁ దలఁచిన
యాపదలటు దొలఁగఁద్రోచి యతులితమతియై
నీ పదమునందు నందురు
వేపక ననుఁజూడు కరుణ వేంకటరమణా! 68

క॥ జలజాక్ష నీదు పదములఁ
బలుమఱు మదిఁదలఁచి మెలఁగఁ బటుభవజాలం
బులద్రోవ నంటి వేగమె
వెలిగా కిటులుండవశమె వేంకటరమణా! 69

క॥ పతితులఁబావనులనుగా
వితతంబుగ జేతు నను వేసిన బిరుదే
గతిఁజొచ్చె ననుచు మొఱలిడ
వెతకుచు రావేమి కరుణ వేంకటరమణా! 70

క॥ ఘనఘనసారస్మేరా
నన ఘనతనుకాంతిసార కనికరపు మనం
బునఁ గనరాదా నా మొఱ
వినరాదా దనుజహరణ వేంకటరమణా! 71



క॥ ఘననిభమౌ నీ మేనను
కనకమయాంబరపుఁగాంతి గడలుకొనంగా
వనదోపరి చపలల సర
విని దోచన్ జూపు కరుణ వేంకటరమణా! 72

క॥ అరిపాటనపటువిక్రమి
యరి కరకమలంబునందు నమరఁగ లక్ష్మీ
వర విచ్చేయుము వడిగను
వెరపుడుపను లోకభరణ! వేంకటరమణా! 73

క॥ కృష్ణా కృష్ణా యనుచును
కృష్ణ యనఁగఁ దృష్ణదీరఁ గీర్తిపరుఁడవై
వృష్ణివరు వేగ నేలిన
విష్ణుండవు నీవ సుగుణ వేంకటరమణా! 74

క॥ వడివడిగఁ బ్రోవు మన్నను
జడ నేమిటి కయ్య పూర్వజడగతి యిపుడే
కడుఁదోచిన దైనన్ నిను
విడుచుటలేదమిత కరుణ వేంకటరమణా! 75

క॥ సుడిఁబడి కడువడి మొరలిడ
నొడఁబడి యడుగిడవు కడకు నుడువవు దయచేన్
జెడునడవడి గల కొడుకును
విడుతురె తలిదండ్రు లఘృణ వేంకటరమణా! 76

క॥ తడవేల నన్నుఁ బ్రోవను
బడిబడి పదములకు మ్రొక్కి పటుదైన్యముచే
పడితినని విన్నవించఁగ
వెడలవ యడలుడుపఁ గరుణ వేంకటరమణా! 77

క॥ ఇడుమలు నాపై నడరఁగఁ
జెడితిని కడతేర్పుమనుచుఁ జేతులనిండన్
కడు మ్రొక్కి వేఁడుకొంటిని
విడనాడకు మఖిలశరణ వేంకటరమణా! 78

క॥ మెండుగ దండములిడి నీ
యండె మదిని గోరి కోరి యండజశయనా
యుండియు నీ దాసుఁడు కడు
బెండుపడెన్ బ్రోవు కరుణ వేంకటరమణా! 79

క॥ కందువలా గాకుంటే
పందెములా నా యెడలను పటుభవజాలం
బెందుకు విడఁజూడవు గో
విందా దీనార్తిహరణ వేంకటరమణా! 80

క॥ భారమ నను దయఁజూడను
వేరొల్లక నిన్నె మదిని వేఁడినకతమా
మారాడక యిటులుండుట
వీరాగ్రణి శస్తసుగుణ వేంకటరమణా! 81

క॥ దురవస్థలచేఁ గుందుచు
హరి హరి యని మొఱలిడంగ నరయని విధ మీ
వఱకున్ గనుపించెను మది
వెరవెవ్వరు నాకు సుగుణ వేంకటరమణా! 82

క॥ గట్టిగ నాతలతోడే
వట్టిది గాదింక నమ్ము వసుధేశ హరీ
పట్టితి నీ పదవనజమె
బిట్టాడకఁబ్రోవు కరుణ వేంకటరమణా! 83



క॥ తిట్టిన మఱి దీవించిన
పెట్టిన లేదన్న విసికి పేరెము లిడినన్
ఒట్టె సుమీ నిను విడిచిన
బెట్టుగ నన్ జూడు కరుణ వేంకటరమణా! 84

క॥ తెట్టెలు గట్టుక యున్నవి
యెట్టివొ మత్పాపచయము లిసుమంతైనన్
పట్టాడక వెతలిడ నీ
విట్టట్టుగఁ జూడకు ఘృణ వేంకటరమణా! 85

క॥ జాలెందుకు లే దయయో
బాలేందుసమానఫాల పావనలీలా!
మేలొందుదునని నమ్మితి
వేలడుగను జూడు కరుణ వేంకటరమణా! 86

క॥ జపతపములు నే నెఱుఁగను
యపరాధౌఘములెకాని యరయను సుకృతం
బెపుడో నను దయఁజూచుట
విపులముగాఁ దెలుపు కరుణ వేంకటరమణా! 87

క॥ వేదండతుండనిభకర
కోదండవిఖండితారి కుండలిశయనా!
నీ దండ నమ్మినాఁడను
భేదంబిఁక వదలు సుగుణ వేంకటరమణా! 88

క॥ దూరితి నని మది నుంచకు
ఘోరంబగు దురితచయము గురుగతినడరెన్
వారింప నోప నన్నిఁకఁ
బేరక్కునఁ జేర్చు కరుణ వేంకటరమణా! 89

క॥ సారెకు సారెకు వినుమని
ఘోరముగా మొఱలిడంగఁ గోపముసేయన్
వారిజలోచన తగునా
వీరాగ్రణిమోదకరణ వేంకటరమణా! 90

క॥ దూరమ, భారమ, క్రూరమ,
దారెఱుఁగువ, యేల రావు దరిగానక నే
నారూఢిగ నిను వేఁడితి
వేఱుగఁ జూడకుము సుగుణ వేంకటరమణా! 91

క॥ పతితాగ్రేసరుఁడను నే
నతులితసుగుణాఢ్యుఁడందు రందఱు నిన్నున్
జతకూడె నుభయులకు నిఁక
వెతలిడకిటు కరుణఁజూడు వేంకటరమణా! 92

క॥ సరసుఁడవు, శాంతశమదమ
పరిపూర్ణగుణాకరుఁడవు, పరుఁడైన నినున్
శరణంబు గోర నేలెడి
బిరుదు సుమీ మరువకు ఘృణ వేంకటరమణా! 93

క॥ ప్రోచెదవని మదిఁ దలఁచిన
నీచపు మత్పాపచయము నీ చెవిదండన్
గాచికొని సాడిచెప్పునొ
వేచుట కతమేమి సుగుణ వేంకటరమణా! 94

క॥ కోపమ మత్పాపమ దయ
లోపమ సంతాపపడఁగ లోకాధ్యక్షా!
తోపక నా ముందర నను
వేపుట కే మఖిలశరణ వేంకటరమణా! 95



క॥ పలుకవు, దయఁజిలుకవు, మదిఁ
దలఁకవు, చలమేల నీలతమదేహా, లో
నలుకలను మాని సన్నిధి
వెలయుము భూభారభరణ వేంకటరమణా! 96

క॥ వాచితి, నీ సద్దయ కే
గాచితి, నీ ద్వారమందు కరుణాకర నన్
రాచిన గీచిన నూచిన
వేచిన నిన్విడువ సుగుణ వేంకటరమణా! 97

క॥ అతులదయామతివంచును
వితరణగుణశాలివంచు వీనుల నిండన్
సతతంబు విందు నిను నా
వెతలుడిపిటు చూపు కరుణ వేంకటరమణా! 98

క॥ కనరా, మనవిని వినరా,
కనరావే, వేఁడుకొన్నఁ గడు మొఱలిడఁగా
కనికరమిడి వినరావే,
వినయవిశాలార్ద్ర కరుణ వేంకటరమణా! 99

క॥ జనిదాతవు, జీవనభా
వననేతవు, ఘోరపతితపావనగుణధా
మ నయత్రాతవు, నీవే
వినుటకు నేలుటకు కరుణ వేంకటరమణా! 100

క॥ నిలుపవు, దయఁ గొలుపవు, మదిఁ
దలఁపవు, దరి దెలుపవేమి దలఁతువహో బల్
జులుమా, కలుముల కిలు మా,
విలసితబ్రహ్మాండభరణ వేంకటరమణా! 101

కII నీచుని దరిఁజేరుటకు న
రోచకమా, యాచకుఁడిటు రోఁజన్ గనఁబ
ర్యాచకమా యచలకృపా
వీచికలను దోచు సుగుణ వేంకటరమణా! 102

కII చూచీ చూడని యట్లుగ
నీచుని నన్విడచితేని నెటుబోదు నిఁకన్
గాచినఁబ్రోచిన మఱి దయ
వీచిన నీవేను సుగుణ వేంకటరమణా! 103

కII కరమాగ్రహమా, యిఁకఁ గని
కరమా, లోపంబదేమి కారణ మోహో
మొఱ విన గమకించవు నన్
విరివిగ నేలుమిఁకఁ గరుణ వేంకటరమణా! 104

కII చలమేమీ చంచలయగు
చెలిచెలిమిని గన్నఫలమొ చీమంతన్నా
దలఁపవు పలుకవు కలుగవు
వెలిఁజేయక జూడు కరుణ వేంకటరమణా! 105

కII పాపజ్వాలల దేహము
తాపింపుచునున్నదయ్య దాసశరణ్యా!
కోపించక వడి వెడలుము
వేపక నన్ బ్రోవు కరుణ వేంకటరమణా! 106

కII కంటికి నిదురంటక మది
నంటిన బాధలకుఁబార మందంగా లే
కుంటిన్ గుంటింబలె మొఱ
వింటివొ మఱి లేదొ కరుణ వేంకటరమణా! 107



కII సరసములా నన్నేచుట
మఱి నీకున్ సరసములవి మత్ప్రాణాప
త్కరమై యున్నవి మానుమ
విరతముగా నేలు కరుణ వేంకటరమణా! 108

## తారావళి

కII అక్కడ యిక్కడ నెక్కడ
నొక్కఁడనే యెక్కుడగుచు నూదిన నీ రూ
పక్కజముఁజూపిన సద్దయ
పిక్కటిలన్ బ్రోవు సుగుణ వేంకటరమణా! 109

కII భవబంధనమోచన మతి
జవగతి నొనరించి నాకు జముబాధలెడన్
దవులనిరీతిని జూడుమి
వివరముగా నార్తిహరణ వేంకటరమణా! 110

కII కృతకృత్యునిఁ జేయుమి మ
త్కృత దోషములెల్లఁబాపి కేవలదయచే
సతతంబు నేలుమతులిత
వితరణగుణ యఖిలశరణ వేంకటరమణా! 111

కII రోగమహాద్భుత పటుతర
సాగర మగ్నుండ నగుచు సారె మొఱలిడన్
బాగుగ నను దరిఁజేర్పను
వేగిరపడి రావు సుగుణ వేంకటరమణా! 112

కII మృగమదతిలక సుఫాలా!
మృగరాజ సుమధ్యచిత్ర మృదుతరగాత్రా!
పగతునిక్రియ నన్ జూడక
పెగలింపుము బాధ సుగుణ వేంకటరమణా! 113

క॥ ఆనందకందసుందర
మానందనవైరివినుత మధుకరనేత్రా
నే నొందు బాధ నీ కెటు
వీనందునఁ జొరదు సుగుణ వేంకటరమణా! 114

క॥ పురుషోత్తమ వరదేవా
కరుణాకర కార్యకరణ కామితఫలదా
స్ఫురదరిదరకర భవహర
విరివిగ నన్నేలు కరుణ వేంకటరమణా! 115

క॥ పురుహూతనందనార్చిత
వరచరణాశ్రితనిధాన వారిజనయనా!
కఱవా నీ మది దయ యిదె
వెరవా నన్గావ సుగుణ వేంకటరమణా! 116

క॥ ఆదిమదైవము నీవని
మోదముతో మ్రొక్కినాఁడ మోక్షాధిప నా
ఖేదములుడుపను వడిగను
వేదోద్ధర గదలు కరుణ వేంకటరమణా! 117

క॥ మందరధర సుందరతర
యిందుముఖానందకంద యెందుకు మది న
న్నందుకొని కరుణఁ జూడవు
బృందారకవైరిహరణ వేంకటరమణా! 118

క॥ పుణ్యకృతంబుల నెఱుఁగను
గణ్యత ననుఁజూడ రెవరు కమలాక్ష సుకా
రణ్యము మదిఁ గీల్కొనఁగా
వేణ్యము విడి యేలు కరుణ వేంకటరమణా! 119



క॥ ఉత్తరగర్భగు బాలకు
నుత్తమగతిఁ బ్రోచినట్టి యుత్తమగుణ నీ
చిత్తము నాపై రాదా
విత్తవ్యథహరణ భరణ వేంకటరమణా! 120

క॥ హరహరి సురవరవినుతా
కరివరద కటాక్షవీక్ష కారుణ్యపరా
మురహర మ్రొక్కితి నాదెస
విరవిరఁజూపు మిఁకఁ గరుణ వేంకటరమణా! 121

క॥ చిత్తజజనక! జనార్దన!
యుత్తమజనచిత్తసదన యూర్జితకరుణా!
కొత్తా పతితుల నేలుట
వృత్తే గద నీకు సుగుణ వేంకటరమణా! 122

క॥ స్వాతిన్ వర్షకణావి
ర్భూతిన్నతి గోరు శుక్తిపుంజముక్రియ నీ
భూతదయాళుత్వము మదిఁ
బ్రీతిగఁ గోరితిని సుగుణ వేంకటరమణా! 123

క॥ వికచప్రభచామీకర
వికచాంబుజ హీరమహిత విజయాంకము
మకుటము రంజిల నెదుటను
వికసింపుము భవవితరణ వేంకటరమణా! 124

క॥ అనురాగము మదిఁ గదురన్
వినతుఁడనై మ్రొక్కులిడుచు వేఁడఁగ భువనా
వన యేల కరుణతోడను
విని రావదె యేల సుగుణ వేంకటరమణా! 125

క॥ జ్యేష్ఠుఁడవు! దైవసమితికి
శ్రేష్ఠుండవు!! సకలమందు సేవకుని వడిన్
భ్రేష్ఠముగ నేల నిటు పరి
వేష్టింపుము కష్టహరణ వేంకటరమణా! 126

క॥ మూలము బాధలకున్ ధన
జాలంబని యెఱిఁగినాఁడ చటులత నది ని
ర్మూలంబు చేసి యేలుమి
వీలిఁక లేదమితకరుణ వేంకటరమణా! 127

క॥ పూర్వకృత మే మనందును
నోర్విచ్చును జోటు లేదు నోడితి శ్రమకుం
సర్వభర మూర్విపాలక
వేర్వేడను దీర్పు కరుణ వేంకటరమణా! 128

క॥ ఉత్తర మేమని చెప్పుదు
నుత్తమకృతు లెపుడుఁ జేయ వుత్తారకతా
వృత్తికెటు వత్తువనుచో
బిత్తరమడఁగించు కరుణ వేంకటరమణా! 129

క॥ శ్రవణములు నీ కథల్ విన
నవనీధర చేయుమెపుడు నార్తివిహరణా!
భవమోచన మొనరింపను
వివిధాయుధ రమ్ము సుగుణ వేంకటరమణా! 130

క॥ ధననిష్ఠాపరతన్ నిను
వినమఱచితి నీదు మూర్తి వివశుఁడ నగుచుం
గన మఱచితి క్షమియింపుము
వినతావన దైన్యహరణ వేంకటరమణా! 131



క॥ శతమఘనుత నతహరముఖ
నతజన హృత్పద్మదివసనాథోత్తమ నీ
మతి కరుగదేమి పాపమొ
వితతాద్భుత రూపభరణ వేంకటరమణా! 132

క॥ పూర్వాభద్రకృతంబుల
నిర్వాహము నెత్తిమీఁద నెలకొనియుండెన్
దుర్వారఘోరజాడ్యపు
వేర్విత్తును జిదుము కరుణ వేంకటరమణా! 133

క॥ ఉత్తరభద్రముకొఱకై
చిత్తము నీపైని జేర్చి చింతనసేయన్
దత్తరపడుచును సద్గుణ
వేత్తా రావేమి కరుణ వేంకటరమణా! 134

క॥ వ్రేపల్లెనుండు గొల్లల
వాపిరితనమెల్లఁ దీర వడినేలిన నీ
రూపము చూపింపు మిఁకన్
వేపకు ననుఁబ్రోవు సుగుణ వేంకటరమణా! 135

క॥ శ్రీమద్వత్సాన్వయభవ
భామయ్యకుమార ధర్మపరపురి పదుఁడన్
ధీమణి శోభనగిరి గురు
ప్రేమ పదాశ్రితుఁడ సుగుణ వేంకటరమణా! 136

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## వేంకటేశ్వరశతకము

కII శ్రీమానినీమనోహర
చామీకరదివ్యవసన సనకాదిముని
స్తోమనుతనామ సద్గుణ
ధామా శ్రీవేంకటేశ! దైత్యవినాశా !! 1

కII తామరసాయతలోచన
సామజవరదాననిపుణ సకలధర ఘన
శ్యామలకోమలవిగ్రహ
ధామా శ్రీవేంకటేశ! దైత్యవినాశా !! 2

కII స్వామి హరీ వినతాసుత
గామీ సత్యావధూటికా వదనకళా
ధామ చకోరాయిత హృ
త్సీమా శ్రీవేంకటేశ! శేషగిరీశా!! 3

కII భీమానుజాత పరమ
ప్రేమాస్పదమిత్ర మిత్రవిధునేత్ర పరం
ధామా ధృతతులసీదళ
ధామా శ్రీవేంకటేశ! దైత్యవినాశా !! 4

కII హేమాక్షదానవాంతక
కామాదివికారరహిత కామితఫలదా
కామజనుఃకారణరిపు
భీమా శ్రీవేంకటేశ! భీతివినాశా!! 5



కII భూమి న్భవదీయంబగు
నామముఁ బఠియించునట్టి నరుఁడు చిరాయు
శ్శ్రీమహితుఁడు పావనుఁడగు
వేమరు శ్రీవేంకటేశ! వృజినవినాశా!! 6

కII దేవా తావకమంత్రము
సేవకకలుషవనదాహశిఖికీల విభూ
త్యావహము మోక్షలక్ష్మీ
సేవధియౌ వేంకటేశ! శేషగిరీశా!! 7

కII దేవాదిదేవ నిర్మల
భావులు నిన్మానసమున భక్తిమెయిన్ సం
భావించి ముక్తిఁగాంచిరి
కేవలముగ వేంకటేశ! కిల్బిషనాశా!! 8

కII కందర్పజనక బలభి
ద్వందితపాదారవింద వరద ముకుందా
మందరభూధరధర గో
విందా శ్రీవేంకటేశ! వృజినవినాశా!! 9

కII వేదాదివేద్య యాదిని
యాదోనిధిలోన నుండు నగణితశౌర్యున్
వేదహరణు సోమకునిన్
ఛేదింపవె వేంకటేశ! శేషగిరీశా!! 10

కII శరనిధిఁగూర్మాకృతివై
తరిగట్టును వీపునందుఁదాలిచి దయతో
సురలకు నమృత మొసంగవె
విరివిగ శ్రీవేంకటేశ! వృజినవినాశా!! 11

క॥ కిరివై దంష్ట్రాగ్రంబున
శరనిధిమగ్నమగు భూమిచక్రము పునరు
ద్ధరణమొనరించితీవే
పరమపురుష వేంకటేశ! భవభయనాశా!! 12

క॥ కంబమునఁబుట్టి దైత్యుని
శంబనఖాగ్రములఁజీరి జమునిపురికి వే
గంబె యనిచి జగములకభ
యంబొసఁగవె వేంకటేశ! యఘచయనాశా!! 13

క॥ అల వామనరూపంబున
బలసాహసవిక్రమాదివరగుణశాలిన్
బలి నడుగంటన్ ద్రొక్కవె
జలజాక్షా వేంకటేశ! శత్రువినాశా!! 14

క॥ ముయ్యేడుమార్లు రాజులఁ
గయ్యమునఁ బరశుధార ఖండించి భువిన్
నెయ్యమున భూసురావళి
కియ్యవె శ్రీవేంకటేశ! యింద్రాధీశా!! 15

క॥ భూమిన్ బంక్తిస్యందన
భూమీపతి చేయు చెడుగు పొడవడఁగింపన్
రామావతార మొందిన
సామీ శ్రీవేంకటేశ! శత్రువినాశా!! 16

క॥ తాటక నొక్క శిలీముఖ
పాటవమున ధరణిమీదఁబడనేయవె నీ
ధాటిన్ శ్రేష్ఠులు బొగడ ని
శాటఘ్నా వేంకటేశ! శత్రువినాశా!! 17



క॥ బాహాబలయుతుఁడైన సు
బాహుం బరిమార్చలేదె పటుశౌర్యమహా
సాహసబుద్ధులు నీవి ని
రీహా శ్రీవేంకటేశ! యింద్రాధీశా!! 18

క॥ సీతాపరిణయమునకై
యా తపసినిఁ గూడి మిథిల కరిగెడువేళన్
రాతిని నాతినిఁ జేయవె
ఖ్యాతిగ శ్రీవేంకటేశ! కలుషవినాశా!! 19

క॥ మారహరునిబాణాసన
మారూఢిగ విఱిచి మామ కనుమోదము సే
కూరన్ జానకిఁగైకొను
ధీరుఁడవౌ వేంకటేశ! దితిజవినాశా!! 20

క॥ అలనాఁడగస్త్యముఖముని
కులచంద్రులచే సపర్య గొని వనభూముల్
గలయఁగనుంగొని పావన
ములఁజేయవె వేంకటేశ! భువనాధీశా!! 21

క॥ ఖరసోదరినాసిక ము
ద్ధురవృత్తిన్ గోసివేసి తునిమితి వాజిన్
ఖరదూషణులన్ ద్రిశిరునిఁ
బరశౌర్యా వేంకటేశ! భవభయనాశా!! 22

క॥ శ్రీధర కరుణాసాగర
మాధవ మురవైరి వరద మధుసూదన పృ
థ్వీధరభరణసమర్థ వి
రాధదమన వేంకటేశ! రక్షోనాశా!! 23

కII వాలికి సుగ్రీవునకు
ద్వేలపుఁబగ సాగఁ దమ్ముదెసదయ వాలిన్
దూలించితి సుగ్రీవునె
యేలించితి వేంకటేశ! యింద్రాధీశా! 24

కII చింతాభారాలస యగు
నింతికి నిజకుశలవార్త నెఱుఁగింప హనూ
మంతున్పంపవె సద్గుణ
వంతున్ శ్రీవేంకటేశ! వైరివినాశా!! 25

కII బలనీలప్రముఖులు బహు
బలులగు వానరులు గూడి పర్వతవితతిన్
జలనిధి బంధించిరి నీ
బలముననే వేంకటేశ! పాపవినాశా!! 26

కII శంక యొకింతయు లేక ని
రంకుశబలవిక్రమముల నలరారిన యా
లంకాధీశునిఁ ద్రుంపవె
శంకరసఖ వేంకటేశ! శత్రువినాశా!! 27

కII శరదభ్రశుభ్రదేహ
స్ఫురణ దిశల నిండ సమరభూమిఁబ్రలంబా
సురునిం దెగటార్చిన హల
ధరమూర్తీ వేంకటేశ! దైత్యవినాశా!! 28

కII పరవాసుదేవలీలన్
ధరణీభర మణఁచుటకును దాల్చితి విలపై
శరణాగతరక్షణ త
త్పరమతివై వేంకటేశ! దైత్యవినాశా!! 29



కII రోఁత యొకించుక లేక వి
భీతమతిన్ జన్నుఁబాలు పీల్చి నిశాటిన్
బూతనను జంపవే శిశు
ఘాతిని, శ్రీవేంకటేశ! కలుషవినాశా!! 30

కII ముద్దులబాలుఁడవగు నీ
గద్దరితనమరసి రోటఁగట్టినతఱి నా
మద్దులఁగూల్పవె సర్వవి
పద్దళనా వేంకటేశ! భవభయనాశా!! 31

కII హింసావిహారనిరతరి
రంసాపరతంత్రహృదయ రణకర్కశునిన్
గంసుని జంపితి వౌర నృ
శంసుని శ్రీవేంకటేశ! శత్రువినాశా!! 32

కII గోవిభుఁడు శిలావృష్టి
న్వావిరిఁగురియఁగ మహాద్రి వడిఁదాల్చి కడున్
గోవులఁగావవె శ్రీవసు
దేవాత్మజ వేంకటేశ! దితిజవినాశా!! 33

కII గోపవధూజనములతో
నేప్రొద్దును గలసిమెలసి యిచ్ఛారతులన్
రేపల్లెవాడ నుండు ద
యాపర శ్రీవేంకటేశ! యఘచయనాశా!! 34

కII కాళీయభుజగరాజఫ
ణాళిన్ గౌతుకముతోడ నమరులు వొగడన్
లీలానటనమొనర్చిన
బాలుఁడవౌ శ్రీవేంకటేశ! భవభయనాశా!! 35

క॥ నారీమణి రుక్మిణికై
ఘోరరణమొనర్చి రాజకోటులతోడన్
శూరత మెఱయఁగ శ్యాలకు
బీరమణఁచు వేంకటేశ! భీతివినాశా!! 36

క॥ దారయు బిడ్డలు మిక్కిలి
దారిద్ర్యముచేఁగృశించుతఱి విప్రుఁడు నిం
జేరఁగ సిరుల నొసంగితి
వౌరా శ్రీవేంకటేశ! యఘచయనాశా!! 37

క॥ సురసిద్ధసాధ్య కిన్నర
గరుడాదులు విక్రమంబు గణుతింప మురా
సురయుతముగ నరకనిశా
చరుఁజంపవె వేంకటేశ! శత్రువినాశా!! 38

క॥ పాండుసుతుఁ గ్రతువున భూ
మండలపతులెల్లఁజూడ మదగర్వితునిన్
దండార్హుని శిశుపాలుని
ఖండింపవె వేంకటేశ! కలుషవినాశా!! 39

క॥ సంప్రథనకర్మశూరతఁ
దెంపరియౌ భీముచేత ధృష్టు నహంతా
సంపన్నుఁ జరాసంధునిఁ
జంపింపవె వేంకటేశ! శత్రువినాశా!! 40

క॥ దండితరిపుసైన్యుండగు
బాండవమధ్యమున కెలమిఁబ్రాణసఖుఁడవై
ఖాండవము దహింపవె మును
జండప్రభ  వేంకటేశ! శత్రువినాశా!! 41



క॥ గురుభీష్మాదులచెంగటఁ
బరిషన్మధ్యంబునందుఁ బాంచాలికి వ
స్త్రరహితకును నంబరములు
గరుణింపవె వేంకటేశ! కలుషవినాశా!! 42

క॥ బంధురనిజవిశ్వాకృతి
గాంధారీవల్లభునకుఁ గాన్పింపఁగ గ
ర్వాంధులు భయపడ దృష్టులు
సంధింపవె వేంకటేశ! శత్రువినాశా!! 43

క॥ కౌరవసేనాసముదయ
పారావారంబుఁజొచ్చి బడబాగ్నిక్రియం
గారించు పృథాసుతునకు
సారథివౌ వేంకటేశ! శత్రువినాశా!! 44

క॥ దురమున గురులం బెద్దలఁ
బరికింపుచు శోకమోహభరితాత్మకుఁడౌ
నరునకుఁ దత్వముఁదెలిపిన
పరమపురుష వేంకటేశ! భవభయనాశా!! 45

క॥ ఇద్ధప్రకాశమగు నీ
బుద్ధాకృతి జనములకునుఁ బూజ్యముఁగాదే
శ్రద్ధాభక్తియుతంబుగ
నిద్ధరణి న్వేంకటేశ! యింద్రాధీశా!! 46

క॥ తురగారూఢుఁడ వగుచును
గరవాలము చేతఁబూని గల్క్యవతార
స్ఫురణన్ దురుష్కసేనన్
బరిమార్చవె వేంకటేశ! భవభయనాశా!! 47

క॥ దురితభవబంధచయ సం
హరణంబులు తరుణకిసలయాత్యరుణంబుల్
నిరతము భజియించెద మీ
చరణంబులు వేంకటేశ! శత్రువినాశా!! 48

క॥ నీతో సమానదైవము
భూతలమునఁగాదు సకలభువనములందున్
ద్యోతింపరనుట వేద
ఖ్యాతముగా వేంకటేశ! కలుషవినాశా!! 49

క॥ గురుఁడవు తల్లివి దండ్రివి
పరదైవంబీవె గాక పరులెవ్వరు నా
మొఱ విని కావఁగ సర్వే
శ్వర రావా వేంకటేశ! శత్రువినాశా!! 50

క॥ జగములను సృష్టిసేయఁగఁ
దగు రీతిని బ్రోవ నడఁప దక్షుఁడవీవే
నిగమాంతవేద్యరూపా
జగదీశా వేంకటేశ! శత్రువినాశా!! 51

క॥ నిగమములయందు గుప్తము
సుగమమె నీ యొఱుక కడువిశుద్ధులు విబుధుల్
స్వగతముగ నెఱిఁగి తెలిపిరి
ఖగవాహన వేంకటేశ! కలుషవినాశా!! 52

క॥ దురితంబులు నీదగు సం
స్మరణంబునఁదూలు నగ్నిసంస్పర్శముచేఁ
జొరుగాకులవలె వేఁడెద
శరణమగుము వేంకటేశ! శత్రువినాశా!! 53



క॥ కరిరాజవరద నీదగు
చరితామృత మెలమిఁగ్రోలి శాశ్వతపదవుల్
పురుహూతాదులు పడసిరి
కరుణింపుము వేంకటేశ! కలుషవినాశా!! 54

క॥ అణిమాద్యైశ్వర్యంబుల
ననువుపఱిచి భక్తవితతి కతిముదమొప్పం
గను వైకుంఠ మొసంగవె
వనజాక్షా వేంకటేశ! భవభయనాశా!! 55

క॥ జనహితకృతి నార్తావన
ఘనమతి నతిధర్మరతి నకలుషాకృతి నిన్
వినుతించు వ్రతిని విబుధులు
వినుతింతురు వేంకటేశ! విశ్వాధీశా!! 56

క॥ తరులందును గిరులందును
ఝరులందును ధరణి నాకసమునందుఁ జరా
చరములయందును నుందువు
నిరంతరము వేంకటేశ! నిఖిలాధీశా!! 57

క॥ నీకు న్వెలియగు వస్తువు
లోకాలోకమ్ము దాటి లో వెలి నెందున్
లేకుండుట సర్వాత్ముఁడ
వై కలవో వేంకటేశ! యఖిలాండేశా!! 58

క॥ ఈశానబ్రహ్మాదులు
నీ శాసనముననుగాదె నిఖిలైశ్వర్య
శ్రీశాలులగుచు వెలయుదు
రీశా శ్రీవేంకటేశ! యింద్రాధీశా!! 59

క॥ క్రూరుఁడ నవిచారుఁడ దు
ర్వారభవాంబునిధిఁబడి దొరలుచున్నాఁడన్
దేరిచి దరిఁజేరిచి నను
దారి నడపు వేంకటేశ! దైత్యవినాశా!! 60

క॥ దీనుండను ముజ్జగముల
దీనదయాపరుఁడ వీవు దిక్కని మదిఁబెం
పూనిన వేడుక నమ్మితి
శ్రీనిలయా వేంకటేశ! శేషగిరీశా!! 61

క॥ వారణరక్షణ ప్రియ భయ
హారణభరితాంతరంగ యనవరతము నేఁ
గోరిన కోరికలొసఁగ వ
దేరా శ్రీవేంకటేశ! యింద్రాధీశా!! 62

క॥ ధనసంపద యట్టే యౌ
వనసంపద మీసతేనెవంటివి వేఁడన్
వెనుకాడెద వీనిన్ బర
మును వేఁడెద వేంకటేశ! భువనాధీశా!! 63

క॥ ధనికులనెంతయు వేఁడినఁ
దృణమౌన లభించ దడవి దొరకొనకున్నే
ఘనముగ ఫలమూలాదులు
నిను వేఁడఁగ వేంకటేశ! నిఖిలాధీశా!! 64

క॥ మునుపటి జన్మమ్ములలో
ననువుగఁ దాఁజేసినట్టి యతిపుణ్యవశం
బునను భవద్భక్తుండగు
మనుజుఁడు శ్రీవేంకటేశ! మా ప్రాణేశా!! 65



క॥ ఘనదారేషణ పుత్రే
షణ విత్తేషణ విమోహసంపాదితమౌ
వనటన్ గుందెడి పురుషుఁడు
నినుఁగనునే వేంకటేశ! నిఖిలాధీశా!! 66

క॥ హరి వీవె హరుఁడ వీవె
సరసీజోద్భవుఁడ వీవె శక్రుఁడ వీవే
ఖరకరుఁడవు శశి వీవే
పురుషోత్తమ వేంకటేశ! భువనాధీశా!! 67

క॥ ధరవీవె, సలిలమీవే,
శరయోనివి నీవె, యనలసఖుఁడవు నీవే,
సురవర్త్మ వీవె, మురళీ
ధర మాధవ వేంకటేశ! దైత్యవినాశా!! 68

క॥ నిత్యానిత్యము లీవే
సత్యాసత్యములు నీవె సర్వంసహపైఁ
బ్రత్యక్షదైవమీవే
నిత్య శ్రీవేంకటేశ! నిఖిలాధీశా!! 69

క॥ సాక్షాత్కరించి కరుణా
వీక్షణములఁజూడ వేర విధినుత లోకా
ధ్యక్షా యుపేక్షసేయకు
మీ క్షణమున వేంకటేశ! యింద్రాదీశా!! 70

క॥ రక్షింపు మిందిరావా
మాక్షీహృదయాబ్జమిత్ర యక్షీణదయా
రక్షితమునిజన దానవ
శిక్షక శ్రీవేంకటేశ! శేషగిరీశా!! 71

క॥ అలమేల్మంగాగురుకుచ
కలశద్వయకుంకుమాంకకలితోరస్కా
విలసన్మకుటశిరస్కా
జలజాక్షా వేంకటేశ! శత్రువినాశా!! 72

క॥ కడుభక్తితోడ వేఁడిన
విడనాడుట మేర గాదు విశ్వేశ్వర నిన్
విడువ సుమీ నీవేగతి
జడధిశయన వేంకటేశ! శత్రువినాశా!! 73

క॥ సిరిగలవాఁడ నటంచును
విరివిగ నీ వెపుడు విఱ్ఱవీఁగెద వరయన్
దరిలేనివాని కొసగని
సిరి యేటికి వేంకటేశ! శేషగిరీశా!! 74

క॥ సిరి గల్గువారిచిత్తం
బరుణోత్పలభాతినుండుటర్థ్వంబగు నీ
యురమున సిరి యుండిన మది
గరఁగదు శ్రీవేంకటేశ! కలుషవినాశా!! 75

క॥ శ్రుతిదూరమైన భోగవి
తతిచే గర్వితుఁడ నగుచు ధరణీస్థలి వి
చ్యుతిఁగాంచితి నే నరయఁగ
నతినింద్యుఁడ వేంకటేశ! యఘచయనాశా!! 76

క॥ నీ దారయు నీ కొమరుఁడు
నీదగు వాహనము లోకనింద్యగుణమునన్
వా దార్జించినవారలు
గాదా శ్రీవేంకటేశ! కలుషవినాశా!! 77



క॥ నీ యాలు తటిచ్చంచల
మాయయుఁదా నిలిచియున్న మనుజుని ఘనునిన్
జేయును, బోయిన నీచుని
జేయును, శ్రీవేంకటేశ! శేషగిరీశా!! 78

క॥ నీ తనయుండగు మదనుం
డా తరుణశశాంకమౌళి కపకారుకుఁడై
భూతిగఁ జేయంబడె విప
రీతముగా వేంకటేశ! రిపుచయనాశా!! 79

క॥ నీ వాహనమగు ఖగపతి
దేవావళికన్నమైన దివ్యామృతమున్
వావిరి దొంగిలఁడే మును
కేవలముగ వేంకటేశ! కిల్బిషనాశా!! 80

క॥ నీ నాభీకమలోద్భవుఁ
డైన విధాతృఁడు గుణాఢ్యు నధికుని నాయు
ర్హీనునిఁగఁ జేయఁడే మఱి
దీనునిగను వేంకటేశ! దితిజవినాశా!! 81

క॥ నీవంటి మాయవానిన్
భూవలయమునందు నెందుఁ బొడగన మా గౌ
రీవల్లభు మోహితునిం
గావింపవె వేంకటేశ! కలుషవినాశా!! 82

క॥ సురలును దైత్యులు గూడుక
శరనిధి మథియించువేళ జనియించిన యా
పరమామృత మమరులకును
గరుణింపవె వేంకటేశ! కలుషవినాశా!! 83

క॥ మోహినివై పూర్వము దు
ర్మోహాంధులఁ జేయలేదె మునులను హరునిన్
సాహసమదేమి నీకు ని
రీహా శ్రీవేంకటేశ! యింద్రాధీశా!! 84

క॥ దాసుని నను విడనాడిన
దాసావనబిరుదు నీకు దబ్బఱ గాదే
శ్రీసఖ నీ సన్నిధి సం
వాస మొసఁగు వేంకటేశ! వనజాధీశా!! 85

క॥ దానగుణమించుకేనియు
గానక ధనవంతుఁడైన కడులోభిని స
మ్మానించు జడుఁడు నిన్నున్
ధ్యానింపఁడు శ్రీవేంకటేశ! దైత్యవినాశా!! 86

క॥ వడ్డీజీవన మిలపైఁ
జెడ్డతనమటంచు మునులు చెప్పఁగ వినమే
వడ్డీకాసులు గొనుటది
దొడ్డతనమ వేంకటేశ! దురితవినాశా!! 87

క॥ ధనవంతుఁడయ్యుఁ బండిత
జనములఁబోషింపలేని జనుఁడు జఘన్యం
డను నపదూఱుంజెందక
ఘనుఁడగునే వేంకటేశ! కలుషవినాశా!! 88

క॥ ధనమార్జించిన తఱి స
జ్జనులను బుధజనుల సాధుజనులను రక్షిం
చినవాఁడె ధన్యుఁడగు కవి
జననుత శ్రీవేంకటేశ! శత్రువినాశా!! 89



క॥ పరులకు నుపకృతిసేయని
నరుజన్మము తల్లికడుపునకుఁ జేటు సుమీ
పరధర్మము పరహితమే
పురుషోత్తమ వేంకటేశ! భువనాధీశా!! 90

క॥ పరసతుల దోషమెన్నక
పరభామను జూచి తనదు భగినికి సుతకున్
సరి యనుకొను నరుఁడుత్తమ
పురుషుఁడు శ్రీవేంకటేశ! భువనాధీశా!! 91

క॥ అరయఁగఁ బరోపకారము
పరధర్మము దానియట్లె పరపీడనమున్
బరమాధర్మము ధర్మో
త్తరత నొసగు వేంకటేశ! దైత్యవినాశా!! 92

క॥ ఎఱిఁగెఱిఁగి చెడుగుచేసెడు
కొఱగాని దురాత్మునెట్లొకో సరిదిద్దన్
జిఱుకత్తిచేతఁ గఱకఱ
నఱుకవలెనొ వేంకటేశ! నాకాధీశా!! 93

క॥ నీ పాదకమలసేవా
వ్యాపారతఁజెలఁగుచున్నవాని కసాధ్యం
బేపట్లను గలుగదు భువి
లోపల శ్రీవేంకటేశ! లోకాధీశా!! 94

క॥ సురుచిరలీలన్ జగముల
కిరవగు గర్భంబుగలుగు నీశ్వర నీకుం
ధరణీస్థలి నను(బ్రోచుట
భరమా శ్రీవేంకటేశ! భవభయనాశా!! 95

కII అరమరసేయక నన్నున్
బరిచరుఁగాఁ జేసికొనుట బహుభంగుల నీ
పరిపూర్ణత్వమునకుఁ దగు
సరణియె శ్రీవేంకటేశ! శత్రువినాశా!! 96

కII జడమతిని దోషినని నా
యెడ నేరములెన్నదేమి యిల జనకుఁడొగిన్
గొడుకున్ మూర్ఖుని విడుచుట
నడవడియే వేంకటేశ! నాగగిరీశా!! 97

కII పరసద్గుణముల మెచ్చుచుఁ
బరసంపద కిష్టపడుచుఁ బరనిందాదుల్
తొఱఁగినవాఁడిమ్మహి స
త్పురుషుఁడనంబరగు గాదె భువనాధీశా!! 98

కII నీ నామశతము పేర్కొనఁ
గా నీపైఁబద్యశతము గల్పింపంగా
మానసముప్పొంగెను నీ
ధ్యానార్థిని వేంకటేశ! ధర్మోద్దేశా!! 99

కII కింకరకల్పకమా భవ
సంకటహరనామ శేషశైలస్థేమా
అంకితమిది గొను మోంకా
రాంకూరా వేంకటేశ! యఖిలాండేశా!! 100

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## వేంకటాచలధామ తారావళి

కII శ్రీమహిళామహిమహిళల
తో మముఁబోషింపవచ్చితో నేఁడైనన్
బ్రేమమున సజలజలద
శ్యామలతనుధామ వేంకటాచలధామా! 1

కII రావయ్య యేడుగొండల
దేవుఁడవా శరణు శరణుదిత మమతా హం
భావనమనపావనజన
తావనఘనవామ వేంకటాచలధామా! 2

కII నే నెక్కడ మీ విభవము
దా నెక్కడ నేర్చి పొగడఁదరమా నాకున్
దానవకులతానవకల
నానవబలధామ వేంకటాచలధామా! 3

కII అవధారు దేవ! భవదభి
నవకవనమొనర్ప నేర్పు నా కొసగుము! దా
నవవనదావీభవదా
హవబాహాస్థేమ వేంకటాచలధామా! 4

కII కోరినవరాలరాయఁడ
వౌరా! దుర్నిగ్రహాగ్రహగ్రహిళధరా
ధారమహోదార మహో
దారమహోద్దామ వేంకటాచలధామా! 5

కll అమ్మమ్మ రాజసంబిటు
రమ్మని మముఁ జేరదీయరాదా యసురీ
ధమ్మిల్లామోదభిదా
హమ్మహనిస్సీమ వేంకటాచలధామా! 6

కll భవదంఘ్రిద్వయసేవా
ప్రవణులఁగావింపవా దురాత్ములమగు మ
మ్మవిరళభవానుభవజగ
దవనమహోద్దామ వేంకటాచలధామా! 7

కll తొలుపలుకు గిలుకుపావలు
గులుకు భవత్పదయుగంబకుంతితభక్తిన్
గొలుతున్ ద్రిభువనహేలా
హలదసురవిరామ వేంకటాచలధామా! 8

కll శరణాగతానుధావన
బిరుదాంకుఁడ విపుడదేల పిలిచిన దయతో
నరుదే వరిరంహస్సం
హరణరణస్థేమ వేంకటాచలధామా! 9

కll ఎపుడును శరణాగత వ
జ్రపంజరపు బిరుదు దాల్చు రాజవుగా మ
మ్మిపుడేల తేలఁజూచెద
వపరిమితస్థేమ వేంకటాచలధామా! 10

కll నీ బంటనె ముమ్మాటికి
నీ బంటనె వేఱొకండనే జగదవన
శ్రీబంధ బంధురాంఘ్రి మ
హాబిరుదోద్దామ వేంకటాచలధామా! 11



కll దాసుని యిల్లాలలసిన
యో సామీ కొంచెమనక యుప్పరతట్టల్
మోసితివట భక్తార్తిని
రాసరసోద్దామ వేంకటాచలధామా! 12

కll మెచ్చెదవుగాక భక్తుల
కిచ్చెద వీరాని పదవులిందును నందున్
గచ్చుగఁ దిరిగెద వఖిల వి
యచ్చరనిస్సీమ వేంకటాచలధామా! 13

కll ఒకటానోచని గొల్లా
లికి బిడ్డలనిత్తువట భళీ జగముల నీ
వొకఁడవె దైవశిఖామణి
వకలుష గుణధామ వేంకటాచలధామా! 14

కll ముజ్జగముల నేలెడు నీ
బొజ్జకుఁజేరుళ్ల బియ్యపుందళిగ లయో
సజ్జాయె బ్రతుకు సమిదుద
యజ్జయగోస్థేమ వేంకటాచలధామా! 15

కll ఎల్లప్పుడు నీతోమని
పళ్లెరముల నారగించు బల్ జాణవు చే
సల్లవట పోయి వేఁడెద
మల్లదె నీ లేమ వేంకటాచలధామా! 16

కll ఇల్లిల్లు దిరిగి నీవొక
చెల్లని కాసునకు నైనఁజేసాచెదు హ
ల్లల్ల సిరులెల్ల నొసఁగెడు
నల్లదె నీ లేమ వేంకటాచలధామా! 17

క॥ వేసరక వడ్డికాసుల
కాసులచే నింత లిబ్బి గట్టెద విఁక నీ
యాసవలెఁగాదె యడియని
యాసయు నో రామ వేంకటాచలధామా! 18

క॥ అడియాల మెఱుఁగ నీ వడు
గడుగుందండాలసామివా దండము నీ
యడియఁడను నీవె మా కొడ
యఁడ వసురవిరామ! వేంకటాచలధామా! 19

క॥ కలకాలము నాపదమ్రొ
క్కులు సంపద మఱపు లేలొకో యని కొదవల్
దలఁచకు మాశ్రితరక్షా
హలహలికోద్దామ వేంకటాచలధామా! 20

క॥ నిగ్రాహ్యుఁడ నేనైన న
నుగ్రహవదపాంగములఁగనుంగొను మతి దు
ర్నిగ్రహమహాగ్రహగ్రస
నాగ్రహహృన్నామ వేంకటాచలధామా! 21

క॥ భూతప్రేతపిశాచ
వ్రాతంబులు దొలఁగవా భవత్పదరేణు
వ్రాతంబు సోకినను జగ
దాతంకవిరామ వేంకటాచలధామా! 22

క॥ వేంకటపతి వేంకటపతి
వేంకటపతి యనినఁదొలఁగవే గ్రహశంకా
తంకంబు లఖిలజగదభ
యంకరశుభనామ వేంకటాచలధామా! 23



క॥ పలుమఱునుఁ బెక్కువేషం
బులు పన్నుక నీదు సముఖమున నాడెడు న
న్నలసితివి చాలు నిఁక నను
మలఘుదయారామ వేంకటాచలధామా! 24

క॥ వెనువెంట వచ్చువారల
ననుపుటకై తడసెదేని యమభటజనభం
జనపాంచజన్యమపు డొ
య్యన నొత్తుము ప్రేమ వేంకటాచలధామా! 25

క॥ మంగళమలమేల్మంగకు
మంగళ మలమేలుమంగమగనికి నని మీ
మంగళ మేమఱ మెద సమ
రాంగణనిస్సీమ వేంకటాచలధామా! 26

క॥ శ్రీమదఖిలాండకోటి
స్వామివిగా మాకుఁ గులముసామివిగా యీ
మామీఁది మమత మఱవకు
మామయహృన్నామ వేంకటాచలధామా! 27

క॥ ఘటియించె హురుముశావేం
కటపతి నీ పేరనొక చొకాటపుఁగృతి త
ద్ఘటకాగ్రేసరుఁడవు నీ
వట కపటవిరామ వేంకటాచలధామా! 28

******

ధర్మపురి వేంకటశాస్త్రిగళు హేళిద (సంస్కృతోదాహరణ) తెలుగు పద్యగళు

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## పంకజాతభవాండేశ శతకము

సీ॥ శ్రీమత్త్వదంఘ్రిరాజీవసేవాసక్తి
నిరతంబు నామది నిలుపవయ్య
శ్రవణేంద్రియముల మీ సచ్చరితామృత
మధుధార లానఁగా మఱుపవయ్య
నేత్రద్వయంబు మీ నిరుపమసౌందర్య
విభవ మీక్షింపఁ గావింపవయ్య
సతతంబు జిహ్వ మీ పతితపావననామ
కీర్తన సలుప శిక్షింపవయ్య

తే॥ యేను నీ కన్న నితర మే మెఱుఁగ నెందు
దాసునిఁగ నన్ను నాత్మలోఁదలఁపవయ్య
శేషశైలాగ్రవాస లక్ష్మినివాస
పంకజాతభవాండేశ వేంకటేశ! 1

సీ॥ పదపద్మరజముచేఁ బాషాణమైన తా
పసకాంత కలుషంబుఁ బాపినావు
శరణు సొచ్చిన విభీషణు విపక్షానుజుం
డనక కృపాదృష్టి మనిచినావు
ఆర్తయై వేఁడినయంతనే పాంచాల
కన్యకమానంబు గాచినావు
మకరిపాల్పడిన సామజము కుయ్యిడిన నా
లించివే దాని రక్షించినావు

తే॥ నన్ను నా రీతిఁబ్రోవు మనాథనాథ
నీకు నే నన్యుఁడనుగాను నిజముగాను
శేషశైలాగ్రవాస లక్ష్మినివాస
పంకజాతభవాండేశ వేంకటేశ! 2



సీ॥ కల్పాంతమున బ్రహ్మ కనుమూసి నిదురింప
సోమకుండను రాక్షసుండు కడఁగి
నిగమము ల్మ్రుచ్చిలి నీటిలోఁ జొచ్చిన
జలచరరూపమై సరభసమున
దైత్యునిఁబోనీక తరిమి గర్భము చించి
విపులవేదమ్ముల వెలికిఁదెచ్చి
సత్యలోకంబునఁజతురాననునకిచ్చి
చెలఁగి లోకములు రక్షించినట్టి

తే॥ లోకరక్షకుఁడవు భువనైకవంద్య
నన్ను రక్షించు టొక ప్రయత్నంబె నీకు
శేషశైలాగ్రవాస లక్ష్మినివాస
పంకజాతభవాండేశ వేంకటేశ!! 3

సీ॥ అమరులు దైత్యులు నమృతంబుఁగొనుటకై
మందరనగమును మంథదండ
కమ్ముగాఁజేసి కొంకక సుధాంబుధి వైచి
తవిలి వాసుకిఁదరిత్రాడు సేసి
యిరుగడ గైకొని గరిమతోఁదరువంగ
బ్రుంగనశైలంబు గ్రుంగఁజూచి
కమఠరూపంబునఁ గరమొప్పి శైలంబు
ధరియించినట్టి శ్రీధరుఁడ వీవు

తే॥ నీకు సంరక్షకులు లేరు లోకమునను
నన్నుఁగృపతోఁడఁబ్రోవుము నలిననేత్ర
శేషశైలాగ్రవాస లక్ష్మినివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 4

సీ॥ కశ్యపాత్మజుఁడైన ఖలుఁడు హిరణ్యాక్షుఁ
డాదికాలంబున నతులశక్తి
ధరణి గైకొని రసాతలమునకును బాఱి
మాఱెందు లేకుండ మలయుచుండ
యజ్ఞవరాహమై యవతరించి నిశాటు
ఘనగదాహతి మస్తకంబు దునిమి
కొనగొమ్మున ధరిత్రి గొనివచ్చి నీటిపై
నిలువంగఁ దన బలమ్మలవఱించి

తే॥ విశ్వమొగి నుద్ధరించిన విభుఁడవీవు
నీకు ననిశంబు మ్రొక్కెద నిగమవేద్య
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 5

సీ॥ భ్రాత వధించిన పగఁదలంచి హిరణ్య
కశిపుఁడు ఘోరదుర్గముల కేఁగి
తపమాచరించి విధాతచే వరములు
కొని మహాదుష్టుఁడై కనులు దిరిగి
తనయునిఁ బ్రహ్లాదు ననుపమచారిత్రు
భాగవతశ్రేష్ఠు బహువిధముల
హింసింప మనుజమృగేంద్రరూపము దాల్చి
కదిసి విపక్షువక్షము పగుల్చి

తే॥ తునిమి భక్తునిఁ గాచిన ఘనుఁడ వీవు
నిన్ను బ్రహ్మకునైన వర్ణింపఁదరమె
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 6



సీ॥ బలి యను దైత్యుండు బలసూదనునిఁదోలి
నాకంబు గైకొని ప్రాకటముగ
మూఁడులోకంబుల ముదముతో వెలుఁగంగ
నదితితపంబున కాత్మమెచ్చి
వామనరూపమై ప్రేమతో నుదయించి
బలిని దానము మూఁడుపదములడిగి
ముల్లోకములు నిండి మొనసి వైరోచను
బంధించి వజ్రికిఁబదవి యొసగి

తే॥ నట్టి భక్తశరణ్యుఁడ వనఘచరిత
నిన్ను నుతియింప శక్యంబె నీరజాక్ష
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 7

సీ॥ భార్గవకులమునఁబావనుండైనట్టి
జమదగ్నిసుతుఁడవై జననమంది
తండ్రినిఁ జంపిన దారుణకర్మునిఁ
గార్తవీర్యార్జునుఁ గదిసి వేయు
చేతులు పరశువుచేఁ ద్రుంచి పొలియించి
రాజవంశములు నిర్వంశములుగఁ
జేసి ధారుణి యెల్ల భూసురులకు దాన
మిచ్చిన రాముఁడ వీవ కావె

తే॥ నిను నుతింపంగ వశమె శేషునకునైన
విమలచారిత్ర సంపుల్లకమలనేత్ర
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 8

సీ॥ పౌలస్త్యుడైన రావణుఁడు బ్రహ్మను గూర్చి
తపము గావించి విధాతవలన
వరములు గైకొని సురల బాధింపంగ
నమరులు మునులు మిమ్మాశ్రయించి
తమపడ్డ బన్నముల్ తగ విన్నవించిన
భువనముల్ రక్షించ బుద్ధిఁదలఁచి
దశరథాత్మజుఁడవై ధారణి జన్మించి
దశకంఠు బలసహితంబుగాగ

తే॥ వసుధఁ గూల్చిన యా రఘువరుఁడ వీవ
యేను నీ మహిమంబెన్న నెంతవాఁడ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 9

సీ॥ ధారుణి దుష్టవర్తనుల మోవఁగలేక
బ్రహ్మపాలికి నేఁగి బాధపడిన
దృహిణుండు వసుమతీసహితంబుగా మిమ్ముఁ
జేరి ప్రణామముల్ చేసి వసుధ
రక్షింపుమని వేఁడ రాజవంశంబున
వసుదేవసుతుఁడవై వెస జనించి
ఖలులైన ధారుణీశులనెల్లఁబరిమార్చి
భూభారముడిపిన పుణ్యమతివి

తే॥ రాముఁడవు నీవె కావె పురాణపురుష
నిన్ను వర్ణింప శక్యమే నిర్మలాత్మ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 10



సీ॥ త్రిపురదైత్యులు భారతీనాథువరముచే
సురలకసాధ్యులై యురుబలమున
మూఁడులోకములకుఁగీడాచరింపుచు
జరియింప నీక్షించి హరుని రథికు
గావించి సారథిగాఁ బద్మజు నమర్చి
నీవు బాణంబవై నేర్పు మెరసి
రాక్షసస్త్రీ పతివ్రతము భంగము సేయు
తలఁపున బౌద్ధావతారమెత్తి

తే॥ పౌరకాంతల నియమముల్ పాపి పురము
లొకటిగాఁ గూర్చి కాల్చిన యోధవీవు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 11

సీ॥ కలియుగాంతంబున ఖలులు రాజ్యముసేయ
సకలధర్మములు నష్టంబులగుచు
పాపభూయిష్ఠమై బ్రాహ్మణుల్ వ్రాత్యులు
రాజులు తస్కరప్రాయులగుచు
వర్తింప శ్రుతులను వరనదీజలము లు
త్పన్నంబులై మహాక్షామడాంబ
రంబుల ధరణితలంబు తల్లడమందఁ
గల్కిరూపము దాల్చి ఖడ్గధారఁ

తే॥ బాపకర్ములనెల్లను రూపుమాపి
ధర్మమవనిఁబ్రతిష్ఠించి తనరెదీవు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 12

సీ॥ జగతి పాదము, లాకసము నాభి, నిశ్వాస
మనిలుండు, రవిచంద్రుల క్షియుగము,
దిశలు కర్ణంబులు, దివి శరం,బనలుండు
వదనంబు, జలములు పాణియుగము,
జంగమస్థావరసహితమైయున్న యీ
విశ్వంబు నీ కుక్షి, విమలచరిత !
ఆద్యంతరహితుఁడ వసదృశుండ వనంతుఁ
డవు నచ్యుతుండవు, భవవిదూర

తే॥ విశ్వమంతయు నీ మూర్తి వేఱ లేదు
నిన్ను శరణంబు వేఁడెద నిష్కళంక
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 13

సీ॥ నీ పదాంబుజములు నిత్యంబు పూజ గా
వింపనికరముల పెంపదేల?
ప్రేమతో నీ చరితామృత మనుదినం
బానంగలేని యవ్వీను లేల?
నీ దివ్యనామంబు నిరతంబు పఠనంబు
సేయంగలేని యీ జిహ్వ యేల?
నీ యుత్సవములకుఁ బాయని భక్తితో
నడవకయున్న యియ్యడుగు లేల?

తే॥ నిన్నుఁ గడువేడ్కఁ జూడని కన్ను లేల
యిన్నియును జిత్రరూపంబు లెన్నిచూడ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 14



సీ॥ నీ పదాంభోజముల్ నిశ్చలహృదయుఁడై
యతిభక్తిఁబూజ సేయంగవలయు
పావనంబైన మీ పాదపద్మములకు
ముదమొప్ప నిలఁజాగి మ్రొక్కవలయు
పాపహరంబు మీ పాదాబ్జతీర్థంబు
లేపార జిహ్వయందిడగవలయు
నీ పదాబ్జార్చితనిర్మలతర తుల
సీదళంబెలమి భక్షింపవలయు

తే॥ వినతుఁడై మిమ్ము శరణంబు వేఁడవలయు
కలుషములఁబాసి మిముఁజేరి వెలయవలయు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 15

సీ॥ నీ చరితంబులు నిరతంబు వినువాఁడు
వసుధాధిపత్యంబు వాంఛపడఁడు
నీ పాదకమలసేవాపరుండగువాఁడు
స్వర్గభోగంబులసరణిఁ జనఁడు
నీ దివ్యమంత్రమే నిష్ఠగాఁ గలవాఁడు
చక్రవర్తిత్వంబు సరకుగొనఁడు
నీ మూర్తి నాత్మలో నేర్పునఁ గనువాఁడు
బ్రహ్మలోకసుఖంబు భ్రాంతిపడఁడు

తే॥ కల్పవృక్షంబు ముంగిట గలుగువాఁడు
అడవినున్నట్టి ఫలముల కాసపడునె
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 16

సీ॥ కరుణారసాపాంగ ఘననిభశ్యామాంగ
పతగరాజతురంగ ధృతరథాంగ
పావనచారిత్ర పద్మజస్తుతిపాత్ర
శంకరసన్మిత్ర జలజనేత్ర
పతితపావననామ జితదానవస్తోమ
పాలితసుత్రామ భవవిరామ
జలనిధిగంభీర సద్భక్తమందార
నిరుపమాకార వర్ణితవిహార

తే॥ సంతతోల్లాస సజ్జనస్వాంతవాస
సర్వలోకేశ మునిజనసన్నివేశ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 17

సీ॥ అన్యమెఱుంగక యహరహంబును భవ
త్కైంకర్యమునఁబ్రొద్దు గడపవలయు
నితరవాంఛలు మాని సతతంబు నీ కథా
సుధ కర్ణపుటముల జుఱ్ఱవలయు
నీవె దైవంబని నెఱ నమ్మి సకలార్థ
సంపత్తి నీకు నర్పింపవలయు
ధర్మార్థకామము ల్దలఁపక నీ దివ్య
పదమున కనయంబు వెదకవలయు

తే॥ నీ కృపకుఁబాత్రభూతుఁడై నెగడవలయు
నిన్నుఁ జేరంగగోరు ప్రసన్నుఁ డెపుడు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 18



సీ॥ పరమేష్ఠినుతిపాత్ర! నిరుపమచారిత్ర!
శశిదివాకరనేత్ర! శ్యామగాత్ర!
సురమునీశ్వరగేయ! వరనూపురామ్నాయ!
దళితదైతేయ! పద్మాసహాయ!
కాకుత్థ్సకులదీప! ఖండితహరచాప!
విశ్వస్వరూప!రవిప్రతాప!
సర్వలోకాధార! సద్గుణాలంకార!
శ్రుతిగుహాసంచార! నుతివిహార!

తే॥ సంతతోత్సాహ! విజితదుర్జనసమూహ!
సమరముఖదేవతాభీమ! సార్వభౌమ!!
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస!
పంకజాతభవాండేశ వేంకటేశ !! 19

సీ॥ క్షీరాబ్ధిమధ్యవీచీడోలికాలోల
పన్నగాధీశతల్పంబునందు
పద్మావసుంధరాభామామణుల్పాద
పంకేరుహంబులు పరిచరింప
భానుకోటి ప్రభాభాసమానానూన
కోటీరకాంతులు కొమరు మిగుల
శ్రుతిచతుష్టయము సంస్తుతులోలిఁ జేయింప
యోగనిద్రారతి నొప్పు మిగులఁ

తే॥ బవ్వళించిన నీ మూర్తిఁ బ్రతిదినంబు
భావమునఁ జేర్చి మ్రొక్కెద దేవదేవ!
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస!
పంకజాతభవాండేశ వేంకటేశ !! 20

సీ॥ మహితజాంబూనదమణికిరీటద్యుతుల్
రవికిరణంబులఁగ్రమ్మరింప
నవరత్నమయదివ్యనక్రకుండలకాంతి
గండభాగంబుల మెండుకొనఁగ
కంఠభాగవిలగ్న కౌస్తుభమాణిక్య
దీధితుల్ దిక్కులఁదేజరిల్ల
రమణీయమౌక్తిక రత్నహారవినూత్న
తరళద్యుతు ల్నభస్థలము నిండ

తే॥ యురమునం దలమేల్మంగ మురుపుసూప
నిలిచియున్నట్టి నీ మూర్తిఁ గొలుతునెపుడు
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 21

సీ॥ పన్నగాధిపతల్ప పావనసంకల్ప
భవతూలకృతశిల్ప బహుపరాకు
శాతకుంభదుకూల సదమలగుణజాల
పద్మాలయాలోల బహుపరాకు
నిగమాగమస్తోత్ర నిరుపమచారిత్ర
పద్మజస్తుతిపాత్ర బహుపరాకు
ధారాధరశ్యామ దళితాసురస్తోమ
పార్వతీనుతనామ బహుపరాకు

తే॥ దేవదేవ పరాకు మీ సేవకుఁడను
నీవె దిక్కని యున్నాఁడ నిష్కళంక
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 22



సీ॥ నవమోహనాకార నతజనమందార
సర్వలోకాధార శరణు శరణు
కాంచనాచలధీర కందర్పసుకుమార
జలనిధిగంభీర శరణు శరణు
భవలతైకలవిత్ర పరహితచారిత్ర
సురగణాహితజైత్ర శరణు శరణు
కరుణారసాపాంగ ఖగనాయకతురంగ
కరధృతోగ్రరథాంగ శరణు శరణు

తే॥ నీకు శరణని వేఁడెద లోకనాథ
కరుణఁజూడము నన్ను నో సురశరణ్య!
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 23

సీ॥ శరణాగతత్రాణబిరుదు నీదై యుండ
నన్యుల శరణని యనఁగ నేల
భక్తులపాలి కల్పద్రుమంబీవయై
- విహరింప నన్యుల వేఁడనేల
పాపఘ్ని గంగ మీ పాదపద్మంబున
విలసిల్ల తీర్థముల్ వెదకనేల
పరగ లోకములకుఁ బ్రభువ వీవై యుండ
నిలమానవులఁ జేరి కొలువనేల

తే॥ నిన్నె నెఱనమ్మియున్నట్టి నేర్పరులకు
కొదవ లేమైనఁ గలవె సంపదలెకాక
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 24

సీ॥ బ్రహ్మకల్పంబున బ్రహ్మాండమంతయుఁ
బొలుపేది నీయందుఁగలయుటయును
జలనిధులన్నియు గలసి యేకార్ణవం
బై కడలెత్తి మిన్నంది మ్రోయ
బాలుండవై వటపత్రపుటంబునఁ
బవళించి యుండగ బ్రకృతి మిమ్ముఁ
బ్రార్థింప మీ నాభిపంకజంబునఁ జతు
రాననుఁ బుట్టించి యతనివలన

తే॥ విశ్వమెల్ల సృజించిన విభుఁడ వీవు
నీకు సరివేల్పులెవ్వరు లోకములను
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 25

సీ॥ కంజాక్ష! నీ పాదకమలతీర్థమునకు
సకలతీర్థంబులు సాటిగావు
కమలేశ! మీ నిత్యకైంకర్యమహిమకు
సకలయజ్ఞమ్ములు సాటిగావు
సదయాత్మ !మీ మూర్తి హృదయమందిడుటకు
సకలతపంబులు సాటిగావు
కేశవ! మీ నామకీర్తనంబునకిల
సకలధర్మంబులు సాటిగావు

తే॥ నిన్ను సేవించు మానవులెన్నటికిని
భవము నొందరు నీ దివ్యపదము చేరి
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 26



సీ॥ నీ నాభికమలంబులో నుద్భవించి లో
కంబులు సృజియించెఁ గమలభవుఁడు
గంగ నీ పాదపంకజమున జనియించి
వసుమతి యెల్లఁ బావనముఁజేసె
నామ్నాయములు నీ ముఖాంభోజమున సంభ
వించి విశ్వంబున వినుతికెక్కె
భవుఁడు నీ నామజపప్రభావంబున
గళమునందు వహించెఁ గాలకూట

తే॥ మనఘ! నీ పాదపంకేరుహాశ్రితులకు
సకలలోకంబులందు నసాధ్య మెద్ది!
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 27

సీ॥ నీ యాజ్ఞ తలఁదాల్చి నిరతమాదిత్యుండు
మేరుప్రదక్షిణంబారఁజేయు
నీ యాజ్ఞ యెద నిల్పి నీరధుల్ చెలియలి
కట్టదాఁట వశంబు గాకయుండు
నీ యాజ్ఞ ననిశంబు వాయుదేవుండొక్క
చోట నిల్వక యెల్లచోఁజరించు
నీ యాజ్ఞ నాత్మలోఁబాయక మృత్యువు
పాఱివచ్చుచునుండు భయముతోడ

తే॥ విశ్వమెల్లను నీ యాజ్ఞ వెలయు నెపుడు
విశ్వమయుఁడవు నీవు యోగీశ్వరేశ
శేషశైలాగ్రవాస లక్ష్మీనివాస
పంకజాతభవాండేశ వేంకటేశ ॥ 28

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## వేంకటశైలనాయకశతకము

చ॥ దురితములన్ విదల్ప భవదుఃఖములన్ హరియింప నీ వసుం
ధరకును నీ విలాసము నిధానముగాఁగనుపింపఁజేయ సుం
దరమగు నీ స్వరూపము ముదంబునఁజూపిన స్వామి శౌరి సత్
కరుణను నన్నుఁగావుమిఁక గట్టిగ వేంకటశైలనాయకా ॥ 1

చ॥ అతులితఘోరదుష్కృతములన్నిఁటికిం గలి పట్టుఁగొమ్మ స
ద్గతిఁగనలేని యీ నరులఁగావఁగ దిక్కెవరింకనంచు లోఁ
గుతుకము మీఱ దర్శనము కుంభినికెల్ల ననుగ్రహించితౌ
సతతము నన్నుఁగావుమిఁక సద్గుణ వేంకటశైలనాయకా ॥ 2

ఉ॥ పావనమైన మీ చరణపద్మయుగంబు నిరంతరంబు గన్
భావమునందు నిల్పుకొని ప్రస్తుతిసేయుచునున్న నాయెడన్
దేవర యింతదాఁకఁ గరుణింపమికిం గతమేమి తెల్పు రా
జీవభవామరాశ్రిత వశీకర వేంకటశైలనాయకా ॥ 3

చ॥ శరణని నీకు మ్రొక్కితిని జాలముసేయక నీవు నా యెడన్
పరమకృపన్ వహించి ననుఁబాయక నా కలుషంబులన్నియున్
దురుముగఁజేసి నీ చరణతోయజయుగ్మముఁ జూపినంతటన్
వెరవుగ నిన్నె కొల్తునిఁక వేడుక వేంకటశైలనాయకా ॥ 4

చ॥ కురుపతి యా సభాస్థలిని గోకలు దోచిన భీతిచేత శ్రీ
హరి ననుఁగావుమంచు మదినార్తిని వేఁడిన యంతలోన మీ
కరుణనె యక్షయంబయిన కాంచనచేలము లద్భుతంబుగా
విరివిగ రావె ద్రౌపదికి వింతగ వేంకటశైలనాయకా ॥ 5



ఉ॥ తోయజనేత్ర భక్తజనతోయజమిత్ర రమాకళత్ర ది
వ్యాయుధనీలగాత్ర మునివర్గపవిత్ర పురారిమిత్ర కౌం
తేయసహాయమాత్ర నగధీరవిరించిసుపుత్ర భవ్యనా
రాయణహేమసూత్ర సువిరాజిత వేంకటశైలనాయకా ॥ 6

చ॥ కలియుగరాజవై ఖలులగర్వమడంచి యశంబు మీఱఁబూ
జలు గొని వడ్డిరూకలను సన్నిధిలోపల నివ్వఁజేసి భూ
వలయము నేలి భక్తపరివారములందఱిఁ బ్రోచుచుంటివౌ
భళిభళి! నన్ను నీవు పెడఁబాయకు వేంకటశైలనాయకా ॥ 7

ఉ॥ దండము పద్మనాభ మురదానవమర్దన మోహనాంగ కో
దండశరవ్రజాంగద సుదర్శననందకధారి దేవ మా
ర్తాండశతప్రతాప వినతాసుతవాహన మందహాస వే
దండనగారిపాల దురితాంతక వేంకటశైలనాయకా ॥ 8

ఉ॥ సారెకు బొడ్డుమల్లె విరజాజులు మల్లెలు పారిజాత ప
న్నీరుసుగంధపుష్పములు నీటుగలంగరు నిల్వుటంగి క
స్తూరిసువాసనాత్తరు కచూరసుమిశ్రితచందనంబు శృం
గారపు నీ శరీరపునిగారము దోఁప ధరించి యుండఁ బ
ల్మారును నీకు మ్రొక్కెదను మాధవ వేంకటశైలనాయకా ॥ 9

చ॥ ఖరకరకోటితేజ ఘనకాయ శశాంకముఖప్రభాంక భా
సుర దివిజార్చితాంఘ్రియుగశోభిత రత్నకిరీటకుండలా
భరణ విశాలవక్ష భవబంధ విమోచన మోక్షదాయకా
స్మరశతకోటిరూప మునిసన్నుత వేంకటశైలనాయకా ॥ 10

చ॥ వసుమతి నింతదాఁకఁబలువర్ణములన్ జననంబులందితిన్
విసువు జనించె సంసరణనీరధి నింకెటు దాఁటనేర్తు మా
నసమున నీవె తోచితివి నమ్మితి నిన్ గడతేర్చుమయ్య నన్
బిసరుహనేత్ర భక్తులకుఁ బెన్నిధి వేంకటశైలనాయకా ॥ 11

ఉ॥ ఆసకు మేర లేదు, కలుషాత్ములనెల్లను వేఁడ నేను, మీ
దాసుఁడ నన్నుఁబ్రోవుమని దైన్యముఁబొందితిఁజూడ నెవ్వరిం,
గాసిలి త్రోవలేక నినుఁ గావుమటంటిని, నీవె దిక్కయా,
వాసవమానసాంబుధి దివాకర వేంకటశైలనాయకా ॥ 12

ఉ॥ పన్నగశాయి నిన్ను మఱి బ్రస్తుతిసేయక కాని దోషముల్
సన్నముగావు గానకయె జాలముచేసి యనేక భంగుల
భ్యున్నతయోగమార్గములనూనిన మోక్షము మాటటుండఁగాఁ
బన్నిన వారి కర్మములుఁబాయవు వేంకటశైలనాయకా ॥ 13

చ॥ తనువులనెత్తి యెత్తి బహుదారుణకర్మములెన్నొ చేసియున్
మనసిజమోహపాశముల మగ్నతనొందితి నీషణంబులం
బనుపడియున్న దోషములు పాయకయుండునె మిమ్ము వేఁడఁగా
ననలమునంటునే చెదలు నచ్యుత వేంకటశైలనాయకా ॥ 14

చ॥ జగములనున్న చేతనులు జాలముచేతను జేయు తప్పులం
దగునటు చిత్రగుప్తుఁడు ఋతంబుగ లెక్కలు వ్రాసి చూపఁగా
దిగఁబడనీక కింకరులు తీవ్రపుఁగోపముసేయ నిన్నుఁబ
న్నగశయ వేఁడఁగానగునె నాఁటికి వేంకటశైలనాయకా ॥ 15

చ॥ నరహరి రామకృష్ణ భువనత్రయపాలక తోయజాక్ష శ్రీ
ధర యని చిత్తమందున సదా నుతియించిన వారిపాదముల్
కరములనొత్తి యారజముగ్రక్కున నా శిరమందుఁదాల్తు మీ
రెఱుఁకగవారిచెంతలకు నెన్నటికిం జనవద్దటంచుఁగిం
కరులకుఁ దెల్పదండధరు కట్టడి వేంకటశైలనాయకా ॥ 16

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## వేంకటేశ్వర పంచకము

సీ॥ అజ్ఞాన మెడలించి సుజ్ఞానమున నుంచి
సద్భక్తి యొనరించు సామి నీదు
పదములు గుఱినుంచి భావంబు గదియించి
సేవించి మిమ్ముఁ బూజింతు సుమ్ము
అతిశాంత మమరించి వ్రతనిష్ఠ బోధించి
ధన్యునిఁగావించి దయదలంచి
నీ దాసునిఁగ నెంచి నేర్పుతో మన్నించి
అతిమోదమొసగించి యాదరించి

తే॥ సంతతోత్సవనిర్మల సదయహృదయ
సేమములొసంగి మమ్ము రక్షింపుమయ్య
నీరజాతాయతసునేత్ర నీలగాత్ర
విమల సంకాశ జగదీశ వేంకటేశ ॥ 1

సీ॥ మణిమయభూషణ మంజుల భాషణ
సజ్జనపోషణ సార్వభౌమ
దుర్జనభీషణ నిర్జరతోషణ
సద్గుణ మునిగణ స్వాంతశరణ
మందరగిరిధర చందన చర్చిత
సుందరవిగ్రహ శుభదచరిత
నందసునందన వందితసనకస
నందనబృంద గోవింద కృష్ణ

తే॥ యెంతొ వినుతింతు మదినుంతు సంతతంబు
మోదమొనరించి నీవు నన్నాదరింపు
నీరజాతాయత సునేత్ర నీలగాత్ర
విమల సంకాశ జగదీశ వేంకటేశ !! 2

సీ॥ అహితకౌరవరాజ, అగణితరవితేజ,
నతజనసురభూజ, సుతబిడౌజ,
కాంచననగధీర, కారుణ్యరసధార,
జలరాశిగంభీర, జయవిచార,
మాధవ,గోవింద, మధుసూదన, ముకుంద,
నందకధర, ముచుకుంద, వరద
కంబుజసన్నుత, కదనవిజృంభిత,
అమరారివధరత, అమితచరిత,

తే॥ అందముగ నీవు నా హృదయంబునందు
నిలిచి వేడుకలొసగవే నెమ్మితోడ
నీరజాతాయత సునేత్ర నీలగాత్ర
విమల సంకాశ జగదీశ వేంకటేశ ॥ 3

సీ॥ నెఱచందురునియందు నెరికందుచెన్నొందు
మోమునఁగస్తూరి మురువుతోడ
అరవిందమకరంద మిరవొందగా నందు
నెరతుమ్మెదల గేరు కురులతోడ
తగ సొంపు గనుపింపు వగనింపు గణుతింపు
నురువైన ముత్యాలసరులతోడ
రంగుగా మనసుబ్బి పొంగగా నా మ్రోల
నంగుగా నలుమేలుమంగతోడ

తే॥ నిలిచియున్నట్టి నిన్ను వర్ణింతు మదిని
శేషశైలాగ్ర సింహాన చిద్విలాస
నీరజాతాయత సునేత్ర నీలగాత్ర
విమల సంకాశ జగదీశ వేంకటేశ ॥ 4



సీ॥ ఏ మాట విన్నను నీ మాటగా నాదు
వీనుల కింపుగా విందునయ్య
ఏ మూర్తిగనుగొన్న నీ మూర్తిగా నాదు
కనులకు సొంపుగాఁగాంతునయ్య
నే నేది రుచిగొన్న నీ ప్రసాదపురుచి
పగిది నా జిహ్వకు పట్టునయ్య
ఏ కాంతి పరికింప నీ కాంతిగా నాదు
మదికి నానందంబు మనుపునయ్య

తే॥ ఇట్లు నీ దయచేత నే నేది వేడ
వేడ్క దళుకొత్తగా సంభవించెనయ్య
నీరజాతాయత సునేత్ర నీలగాత్ర
విమల సంకాశ జగదీశ వేంకటేశ ॥ 5

సీ॥ అతిభక్తితోడ నే నైదు సీసంబులు
చెప్పినాఁడను సుమ్మి చిత్తగించి
కొంచెపుఁబద్యంబులంచును మదిలోనఁ
గొంచక నీవు కైకొనుమి యిపుడు
అప్ప మా బంగారుకుప్ప మీ కరుణకు
నొప్పగాఁ గొంచెము గొప్ప కలదె
భక్తవత్సలుఁడన్న ప్రతిన నీదే యండ్రు
కృపనుంచి యేలుట కీర్తిసుమ్మి

తే॥ ముద్దుపట్టిగఁ జేపట్టి ముద మొసంగి
శుభములిమ్ముగ దయసేయు సుప్రసన్న
నీరజాతాయత సునేత్ర నీలగాత్ర
విమల సంకాశ జగదీశ వేంకటేశ ॥ 6

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## శ్రీవేంకటాచలేశ శతకము

సీ॥ శ్రీవధూ హృదయరాజీవ సప్తతురంగ
రంగద్వినీల నీరదదృగంగ
గంగానదీ స్వచ్ఛకలిత కీర్తితరంగ
రంగమందిరవిహార గుణసంగ
సంగతహితసాధ్వసధ్వంసిభీమాంగ
మాంగల్యగోపభామాభుజంగ
జంగమాచలశోభిసాదరకరణాంగ
యంగజార్తస్త్రీహృతాంతరంగ

తే॥ రంగ యుష్మత్ప్రసాదవిభ్రమమెసంగ
సంగతి నొనర్తు నీ స్తుతిశతక మంగ
మంగళారతి యొనరించి మమ్ముఁబ్రోవు
యఖిలలోకేశ శ్రీవేంకటాచలేశ ॥ 1

సీ॥ దోషసందోహబంధురతూలికా నికా
యహరణాభీల కాలానిలములు
దారిద్ర్యతతసముద్భటతమిస్రసహస్ర
ఖద్యోతసుద్యుతిగౌరవములు
చటులఘోరవ్యాధిపటలీకఠోర దు
ర్ధరదర్దురావలి ద్విరసనములు
దీనార్థివాంఛాప్రదానచింతామణి
కామధుగ్ధేనుదుగ్ధజలనిధులు

తే॥ నవ్యకైవల్యమార్గ సందర్శనములు
ఠీవి యుష్మత్పదాబ్జ సంసేవనములు
గణుతిసేయ నెవ్వరిచేతఁగాదు తండ్రి
యఖిలోకేశ శ్రీవేంకటాచలేశ॥ 2



సీ॥ రక్షింపవే భీకరగ్రాహనిహతుఁడౌ
కరివల్లభుని దయాగౌరవమున
పాలింపవే దిశాపతులెల్ల మేలు మే
లని మెచ్చ గతచేలు నక్కుచేలు
కరుణింపవే హేమకశిపునిఁ ద్రుంచి త
దాత్మజుఁబ్రహ్లాదుఁడనెడివాని
మన్నింపవే జగన్మాన్యు దుర్వాసుని
నదలించి హతరోషు నంబరీషు

తే॥ నన్ను మనువుము పూర్వజన్మకృతపాప
చయ సమార్జిత ఘోరదుష్కర దరిద్ర
చటులరోగాపమృత్యుదోషములు వాపి
యఖిలలోకేశ శ్రీవేంకటాచలేశ ॥ 3

సీ॥ తలక్రిందుగా వ్రేలి తపమాచరించినఁ
గలుగునే సిరి నోముఫలము దక్క
నవనిలోఁగల విద్దెలన్నియు నేర్చినఁ
గలుగునే సిరి నోముఫలము దక్క
దేవళ్ల నందఱ భావించి కొలిచినఁ
గలుగునే సిరి నోముఫలము దక్క
బహుమంత్రములు నేర్చి మహియెల్లఁ దిరిగిన
గలుగునే సిరి నోముఫలము దక్క

తే॥ నూర కేలబ్బు నెటువంటివారికైన
చాల యుష్మత్కటాక్ష వీక్షావిశేష
గౌరవస్ఫూర్తి గల్గినఁ గల్గుఁగాక
అఖిలలోకేశ శ్రీ వేంకటాచలేశ ॥ 4

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## శ్రీవేంకటాచలపతి శతకము

ఉ॥ శ్రీయలమేలుమంగ కుచసీమల నుంచిన కుంకుమాంకసు
శ్రీ యురమందు నేత్రములఁజెక్కుల విభ్రమముల్ ఘటింపఁగాఁ
బాయక శేషశైలమునఁబాల్పడ నిల్చిన తండ్రి కావవే
ధీయుత వేంకటాచలపతీ కలశాంబుధి కన్యకాపతీ ॥ 1

ఉ॥ కంటిని శంఖచక్రములు కంటిని మీ పులుకాపుతీర్థ ని
ష్కంటకవాసనారుచులు గంటిని మీ చరణాంబుజాతముల్
తొంటి నిరూఢపాపములఁదూలుచు మీ మధురప్రసాదముల్
తింటిని వేంకటాచలపతీ కలశాంబుధి కన్యకాపతీ ॥ 2

ఉ॥ నీవు త్రిలోకకర్తవని నే శిల నీటను వేసి తేల్తు స
త్పావని నీవె కాని మఱి దైవము లేదని మడ్డుదూతు స
ర్పావళిఁబట్టి యంఘ్రితలమంటుదుఁజూడుము బంటుశక్తులన్
దేవర వేంకటాచలపతీ కలశాంబుధి కన్యకాపతీ ॥ 3

ఉ॥ నీ పదభక్తి నా హృదయనిర్మలపీఠిక నిల్చె నా భవం
బేపు వహించె నా సుకృతమేర్పడె నేఁడు గదయ్య తండ్రి హృ
త్పాపసముద్ర ముద్దవిడి దాటుట మీ కరుణాకటాక్షపున్
దేపను వేంకటాచలపతీ కలశాంబుధి కన్యకాపతీ ॥ 4

చ॥ నిద్దపుటాస్యరంగమున నిల్పి ప్రబోధపుఁగాసె గట్టి యే
ప్రొద్దును వెంటఁదంబురను బూనిచి తాత్త్వికనాట్యశాస్త్రపున్
బుద్ధులు సెప్పి నా హృదయపుత్రిక మీకును మేలుపాడఁగా
దిద్దితి వేంకటాచలపతీ కలశాంబుధి కన్యకాపతీ ॥ 5



చ॥ గురుపదసాధనంబు లివిగో భవదంకములుండుఁజూడవో
సిరి దళుకొత్తుచున్న యవి శ్రీతులసీవనమాలికావళుల్
మురిపెపుశంఖచక్రములు ముద్రలు మీ తిరుచూర్ణరేఖలున్
దిరుమణి వేంకటాచలపతీ కలశాంబుధి కన్యకాపతీ ॥ 6

ఉ॥ అక్షముఁడైన నేరకెదురాడినదుర్జనుఁడైన తండ్రిసం
రక్షణ లేక బిడ్డఁడు సురక్షితుఁడై మనునే జగత్త్రయా
ధ్యక్షుఁడ వీవు దాసజనదక్షసురక్షణదక్షిణక్షమా
దీక్షిత వేంకటాచలపతీ కలశాంబుధి కన్యకాపతీ ॥ 7

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## మేల్నాటి వేంకటేశ శతకము

సీ॥ దైవంబు వెదకుచుఁ దత్తరింపఁగ నేల
వర్ణింప గురుఁడు దైవంబు గాఁడె
దైవంబు వెదకుచుఁ దత్తరింపఁగ నేల
వరుఁడెన్నఁ దనకు దైవంబు గాఁడె
దైవంబు వెదకుచుఁ దత్తరింపఁగ నేల
వలనొప్పఁ దండ్రి దైవంబు గాఁడె
దైవంబు వెదకుచుఁ దత్తరింపఁగ నేల
వరుస నేలికయె దైవంబు గాఁడె

గీ॥ శిష్యులకు స్త్రీలకును సుతసేవకులకు
తెలిసి చూచినఁ దత్వార్థదీపమిదియె
భక్తజనపారిజాతమై పరగువేల్ప
విజయలక్ష్మీశ మేల్నాటి వేంకటేశ॥ 1

సీ॥ పరమ ఋషిచ్ఛాయ మఱవకాత్మను జారుఁ
గాంక్షించు జారిణీకాంతరీతి
హావభావము విద్యలై దాఱు జోడించి
పూరించు నవ్వేషధారి రీతి
ఋరదలోపలఁబుట్టి పెరిగి యంటొందక
తిరిగెడి కుమ్మరపురుగురీతి
సకలౌషధీసారజాతంబు గూడియుఁ
బ్రత్యేకమగు పాదరసమురీతి

గీ॥ యోగపురుషుండు సంసారయోగివలెనె
చెలఁగి పాపము నేపట్లఁ జేరనీఁడు
భక్తజనపారిజాతమై పరగు వేల్ప
విజయలక్ష్మీశ మేల్నాటివేంకటేశ ॥ 2



సీ॥ కర్మపూరిత చిత్తకమలధారుణి దున్ని
షడ్వర్గపాషాణచయము లేరి
ఆచార్యబోధనంబను పాదు సవరించి
గురుకృప యనియెడు నెరువు నించి
మంత్రాంతరపుగుత్త మానిపి కవులిచ్చి
సుజ్ఞానవర్షంబు సొరిదిఁగురిసి
సాధనాంతరములు చాలించి పదనైన
డంబైన భక్తిబీజంబు విత్తి

గీ॥ భాగవతధర్మమను వెల్గు పాతి మోచి
ప్రబలమైనట్టి మోక్షంబు ఫలము గంటి
భక్తజనపారిజాతమై పరగువేల్ప
విజయలక్ష్మీశ మేల్నాటివేంకటేశ ॥ 3

సీ॥ ధర్మార్థకామముల్ దరినిఁ బెట్టినఁగాని
మునుపటిషడ్వర్గములు విడువవు
బాహ్యేంద్రియంబులఁబట్టి కట్టినఁగాని
సప్తవ్యసనములు లుప్తపడవు
సుఖదుఃఖములు రెంటిఁజూరఁబుచ్చినఁగాని
యష్టభోగంబుల యాశ విడదు
సత్సంగమాదులాసక్తిఁ బెంచినఁగాని
సకలకర్మంబులు సమసిపోవు

గీ॥ పోయినప్పుడె తన మది బోటి యగును
యింతసేయక వైరాగ్యమేల కలుగు
భక్తజనపారిజాతమై పరగువేల్ప
విజయలక్ష్మీశ మేల్నాటివేంకటేశ ॥ 4

సీ॥ మ్రొక్కినవేళను వెక్కిరించినవేళ
నొక్కటే మనసుగా నున్నవాఁడు
పూలఁజుట్టినవేళ రాల ముట్టినవేళ
నొక్కటే మనసుగా నున్నవాఁడు
కుడుపువెట్టినవేళఁగడుపు గొట్టినవేళ
నొక్కటే మనసుగా నున్నవాఁడు
తలనిడుకొనువేళఁ దన్నినవేళను
నొక్కటే మనసుగా నున్నవాఁడు

గీ॥ తరుణులను జూచి మ్రాకుల సరణులనుచు
యెఱిఁగి నడచినవాఁడెపో పరమయోగి
భక్తజనపారిజాతమై పరగు వేల్ప
విజయలక్ష్మీశ మేల్నాటివేంకటేశ ॥ 5

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## వేంకటనగాధ్యక్ష శతకము

శా॥ ఓహో పిల్చినఁబల్కవేమి దయలేదో కాక దిక్పాల సం
దోహస్తోత్రమహోర్భటిన్ వినగరాదో కాక ప్రాఁదప్పలం
దూహల్సేయుచు వడ్డికాసులకునై యూరూరవర్తించెదో
ఆహో మేలు మఱేమి వేంకటనగాధ్యక్షా! జగద్రక్షకా!! ॥ 1

మ॥ కుడిహస్తంబిటు చూపుచందమిది వైకుంఠంబనే యందమో
జడధివ్రాతపరీత భూభువన రక్షాదక్షిణంబైన నీ
యడుగుల్ చూడుమనేవొ కాక యొక యొయ్యారంబొ సందేహమై
యడిగే, నానతియిమ్ము వేంకటనగాధ్యక్షా! జగద్రక్షకా!! ॥ 2

మ॥ గతమే వింటిని నీ చరిత్రములు లెక్కంజాల మా యయ్య యా
శ్రితరక్షామణి నీవెకావె మఱి వేఱే లేదు నీ పాదమే
గతి లోకంబుల కాదివంద్యమసమగ్రవ్యగ్రమాయామయో
ద్ధతభూతాళికి రక్ష వేంకటనగాధ్యక్షా! జగద్రక్షకా!! ॥ 3

శా॥ ఆ నీ బంగరుపచ్చడంబువలెవా టా శంఖచక్రాదిసం
ధానానూనవిలాస మాఘనఘనోద్యత్సత్య మాలోకర
క్షానామం బణిమాదిభాసుర పదాబ్జద్వంద్వ మజ్జారె నే
త్రానందమ్ముగఁ గంటి వేంకటనగాధ్యక్షా! జగద్రక్షకా!! ॥ 4

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## వేంకటశైలనాయక శతకము

ఉ॥ కీరము బీరమెచ్చి చెలఁగెన్, బికమోపికతోడ నేచె, న
మ్మారుఁడు క్రూరుఁడయ్యె బవమానము మానముతోన సారె, వే
సారక దూరె, కన్గొనుచుఁజైత్రుఁడు మిత్రతతోడ వచ్చె, నే
తీరున నోర్తు నన్ను నెడతీయక వేంకటశైలనాయకా ॥ 1

చ॥ కలువలకోరికేరి యొడికమ్ముగఁగమ్మిక ముమ్మరమ్ముగా
వలపులవింటిదంట విరవాజిసరాజిని జిమ్మి నెమ్మికో
కిల బలముల్ గుముల్ గనఁగ కేకులు కూకలిడంగ డగ్గఱెన్
జెలువుఁడ నీవు నన్ను నెడసేయక వేంకటశైలనాయకా ॥ 2

చ॥ అరవిరికోల కేలఁగొని యంతట నింతట జేరి మీరి వే
గరగరి దుయ్య తియ్యవిలుగైకొని డీకొని యమ్మరుండు, రం
బరిమురి నేయ నాయమగునా, తగునా, తెగ వీడనాడ నీ
మెరమెరలేల యేలుకొనుమీ యిఁక వేంకటశైలనాయకా ॥ 3

ఉ॥ లేఁదలిరాకురేకు పెరలేక మెఱుంగు నబాసుబాకు మీ
ర్జాదొర నాదురమ్మున హురమ్మని రమ్మనిమించియించుకొఁ
గాదన కల్లగల్వగొరకన్ జురుకంటగఁ గంటఁగంటకం
బాదటనేసెఁ దాళగలనా, యిఁక వేంకటశైలనాయకా ॥ 4

ఉ॥ డాలుగ తేఁటిమూక జగడాలపయిన్ జగడాలు నించె, మీ
డా లెకిమీఁడురమ్మునగడాలమునన్నెగడాలముంచెఁ, బై
డాలవుచిల్కమోవి, పగడాలుగనిన్నగడాలునించె నే
డాలను నీకు నన్ను విడనాడక, వేంకటశైలనాయకా ॥ 5



ఉ॥ రాకల కించుకల్వవిరి రాకల కాననవింటివానిపై
రాకల కల్కబూనుకనెరాకనులందున దోఁచునట్టి నీ
రాకల కోర్వలే నబల రా కలకాలము నిట్లు నీకు మే
రా కలహింపవద్దు వినరా యిఁక వేంకటశైలనాయకా ॥ 6

ఉ॥ ధీరకుమార మారుఁడసతీయని తీయని తీయనించువిల్
చే రహిఁబూనిహెచ్చు మొనసెయ్యనుసెయ్యను శయ్యనొప్పు ప
ద్యారభటిన్ గణించి సొలపై యెద పయ్యెద పయ్యదంతయున్
దీరయియున్న నన్ను రతిదేల్చిక వేంకటశైలనాయకా ॥ 7

చ॥ వలపులఱేఁడు నేఁడిదెరువారపుతోరపు పచ్చపచ్చ రా
చిలుక జిరాగురానికసచేసి జరీన కరాసి దూసి కన్
గొలుకులఁగెంపుసొంపెసఁగ గొబ్బున నిబ్బర పుబ్బుగబ్బి గు
బ్బలనెల వంటఁగుమ్మె ననుఁబాయక వేంకటశైలనాయకా ॥ 8

ఉ॥ కమ్మని తమ్మిదోదుమిని గమ్మిక నమ్మకరాంకుఁడెమ్మె మై
నిమ్మెయి నిమ్మెయిన్ గదిమి యిమ్మెయిగుమ్మె నురమ్మురమ్మ వే
రమ్ము కరమ్ము నెమ్మది తిరమ్ముగ నమ్మిన నన్నునెంచి చి
త్తమ్మున నుంచి యేలు నిరతమ్మిఁక వేంకటశైలనాయకా ॥ 9

ఉ॥ నెమ్మికిఁ గీరశారికలనెమ్మికిఁ జిల్కపటానిజోదు దో
దుమ్మికి గండుతుమ్మెదల దొమ్మికి కమ్మిన కమ్మదాది నె
త్తమ్మికిఁదాళజాలను ముదమ్మిగురొత్తఁగ నేలి నీవు నన్
రమ్మని గారవించ సుకరమ్మిఁక వేంకటశైలనాయకా ॥ 10

ఉ॥ కాటుకకప్పుచాయల చొకాటముగన్ దొవచిక్కటారిచే
నాటమిటారి కెందలిరుటాకుకటారితుటారి ధాటిగా
వాటునువేటుపోటు సరివాటగు పాటిగ మాటిమీటె వె
న్నాటుగ నోర్వలే మనుపు నన్నిఁక వేంకటశైలనాయకా ॥ 11

ఉ॥ తుమ్ములదాయ కా యభిమతమ్ముల మారుఁడు చేరి నన్ లతాం
తమ్ములకోరిచే శుకశతమ్ములు నాతతచూతవాతపో
తమ్ములు గండుకోయిలరుతమ్ములు మంజుళచంచరీక గీ
తమ్ములు గ్రమ్మనేసె రతిదన్పిక వేంకటశైలనాయకా ॥ 12

ఉ॥ కామునిరాక రాకల చొకాటపు చందురురేక రేకయో
మామిడి మోకమోకల సుమమ్ముల తేనియవాకవాక ల
య్యామని డాకడాక పసురందపువార్వముకేక కేక నన్
బాములబెట్టఁ దాళగలనా యిఁక వేంకటశైలనాయకా ॥ 13

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## శ్రీవేంకటేశ్వర కళ్యాణము

1 జయజయ కరుణాపాంగా । జయ హరిచిత్తాసంగా
జయ వళివిజితతరంగా । జయ జయ యలమేల్మంగా

2. మంగళ మలమేల్మంగకు । మంగళ మంగజజననికి
మంగళమే శృంగారపు । బంగారపు తల్లికిని

3. జయజయ కోకిలవాణీ । జయ యలికులనిభవేణీ
జయ జయ యంబుజపాణీ । జయ వెంకటపతిరాణీ.

4. జయ జయ యలమేల్మంగా । జయ శ్రీవేంకటనాథా
జయజయ మీ కళ్యాణము । జయముగఁబాడెద నెపుడూ.

5. శ్రీకాంతామణి కౌఁగిట । శ్రీకాంతుం డుండగనూ
ఏకాంతమునకు దొరకొని । వాకొనియెను భృగువిట్లు.

6. ముప్పురు వేల్పులలోపల । నెవ్వఁడు ఘనుఁడని తపసి
నొవ్వఁగఁదన్నిన యప్పుడు । నొచ్చిరి మునులును ఘనులు

7. ఉల్లాసపు వేళెఱుఁగక । మెల్లన ముని యరిగినను
వెల్లివిరిసి సిరి సిగ్గున । కొల్లాపురముననుండె.

8. హరి యచ్చటి కేతెంచి । హరిణీలోచనఁగాంచి
సరసపుటాసలఁబిలువగ । హరితో సిరి యిట్లనెను.

9. అరుసముతో శ్రీ వేంకట । గిరిపై విహరింపుదమూ
సరగున నట పద్మసరో । వరమునఁ గూడుద మనిన

10. శ్రీవేంకటగిరి దగ్గఱ । సౌవర్ణముఖీనది దరి
పావనజలముల పద్మస । రోవరమునఁజేరిననూ.

11. మండిత విభవము తొండై । మండలమునఁజెలువొందు
కుండలిశయనేశునిఁ దన । నిండిన మదిఁదలపుచును

12. కమలాలయకును గనకపుఁ । గమలంబులు ప్రియమనుచు
కమలహితుఁడు లోపలి తన । కమలంబులఁ బూజించె.

13. మించిన కార్తికపుఁదొలి । పంచమి స్థిరవాసరమున
మంచి ముహూర్తంబున వి । శ్వాంచిత నక్షత్రమున

14. దినకరకోటి ప్రభలతో । కనకపు కమలము నడుమ
ఘనమగు పద్మసరోవర । మున నిందిర జనియించె.

15. అప్పుడు కావిరి విరిసె । ముప్పిరి పువ్వులు గురిసె
ఒప్పిదములు క్రిక్కిఱిసె । చొప్పున ధర్మము మెఱసె.

16. సురలును నసురులు ధరణీ । సురులు నరులు కిన్నరులు
ఉరగులు సిద్ధులు మొదలుగ । దొరలు నుతుల నిట్లనిరి.

17. యిందీవరనేత్రంబులు । నిందిందిరచికురములు
యిందుని సరియగు నెమ్మొగ । మిందిరకును గడు నమరె.

18. నాగమువలె నారును బు । న్నాగమువలె పొక్కిలియు
తీగెమెఱుపువలె దేహము । నాగరితకుఁగడు నమరె.

19. నాములు దవిలెడి నవ్వులు । కోమలమగు నిగ్గులును
సోముని కాముని యందము । తామరనఁగ నెమ్మొగము.

20. మెఱుఁగుల తిలకపు నుదురు । మెఱుఁగులతికలకునెదురు
అరనెల కించుక ముదురు । తెఱవ యొఱపు గల నుదురు.

21. కమ్మని తావుల కలువల । క్రొమ్మెఱుగుల తీగలను
తమ్ముల నమ్ముల మీలఁది । రమ్ముల కన్నులు గెలిచె.



22. వనజమ్ములకును ఘనమై । కొనఁగల కలువల మించి
మినమినమను పెనుమినుకుల । కునుఁగొనఁగనుఁగొనలమరె

23. కళుకులు శ్రీకారంబుల । కళుకులు గెలిచినయట్టి
బెళుకుల వజ్రపుఁగమ్మల । తళుకుల కర్ణములమరె.

24. పాటల తిలచంపకముల । గోటున గెలిచినయట్టి
నీటగు ముక్కర పిఱుఁదను । తేటగు నాసికమమరె.

25. అగడుగఁబగడపు సొగసులఁ । దెగడుచు నిగనిగమనుచుఁ
దొగరుల పొగరులఁజిగురుల । నొగరులనగు నగుమోవి.

26. అలరతిరాయని శంఖము । నలరఁగ గెలిచినయట్టి
కలకంఠములకు నెక్కువ । గలకంఠము కడుఁజెలఁగె.

27. శ్రీ గల నునుపులు మెఱుగులు । సోగల బిసముల మించి
సోగుల బాగుల తీగెల । లాగుల కరములు నమరె.

28. ఒండొంటికి మొనచూపుచు । నిండిన జిగిబిగితోడ
కొండల చెండుల కనకపుఁ । గుండలనగు చనుదోయి.

29. గడగడ వణఁకుచు సింగము । నడుము గడవబెడ గమరె
తొడగని తొడవగు నొడలికి । తొడవగ సతి నెన్నడుము.

30. కరికరముల ననఁటులనూ । కరభంబులఁ గడు మించె
సిరిగల యొఱపుల మెఱుపుల । గరగరికల నునుఁదొడలు.

31. నునుపుల ననుపుల మనసిజు । ననువుదొనల పెనుమొనల
మినుకుల కనకపు కాసెల । నునుపు గెలుచు చిఱుఁదొడలూ.

32. ఉదుటుల నదుటుల ముదమున । మదమున బొరలెడి కరులా
పదముల పదిలపుఁ గదలిక । సదమదమను తన నడలా.

33. చిలుకో కపురపుఁబలుకో । యలమించులలో బెళుకో
తలమను వజ్రపుఁదళుకో । వలరాయని పూచిలుకో.

34. రంగో యమృతపుఁబొంగో । ముగింట వెన్నెల చుంగో
సింగారముల యరంగో । రింగుల యలమేల్మంగో.

35. అని యందఱు బహువిధముల । వినుతుల గీర్తింపుచును
కనుచూపుల మిన్నెల్లా । మినమినమని మెఱవగనూ.

36. నెత్తమ్ములు చెంగలువలు । కొత్త మధూకంబులును
గుత్తముగాఁ బెనచిన యొక । మొత్తంబగు పూదండ.

37. కరమున ధరియించిన యా । పరముని వరియించుటకూ
వరుఁడెవ్వఁడొ యని తలపుచు । వరుసలఁగనుగొనె నపుడూ.

38. వాసవుఁడనలుఁడు శమనుఁడు । ఆ సుర వరుణానిలునును
భాసురధనపతి శంకరు । లాసరి నుండగఁజూచి.

39. ఒక్కని నొల్లక చక్కని । చిక్కని రెక్కల రథమూ
యెక్కిన యక్కమలాక్షుఁడు । దిక్కని మదిలోఁదలఁచె.

40. రాతిని నాతిని జేసెను । చేతోజాతుని గనెను
ఆతఁడె పెండ్లికొమారుఁడు । తాతగు ధాతకు తాతా.

41. అని తన మనమున చనవులు । నునుసిగ్గులు పెనఁగొనగా
కనకపు పువ్వులసరమా । వనజోదరు మెడవేసె.

42. ఎదమీదను గప్పిన । పయ్యెదలోపలి చనుదోయి
పొదలఁబొదల పెనుజక్కవ । కొదమలగతిఁబులకించె.

43. అమరులు కొమరులు ప్రమదము । లమరగ తమతమలోనూ
గమకపు తమకము నిండిరి । కమలయుఁ గమలాక్షుఁడునూ.



44. కలువల వైచిన కడు ర । వ్వలయవ్వని నవ్వులను
జలజలమన హరిపై సిరి । పొలుపగు చూపులఁగప్పె.

45. వెలుపలి లోపలి వలపులు । మొలకలు మొలచినరీతి
గిలిగింతల యా సొలపుల । పులకలు మేనుల నిండె.

46. కరఁగిన తలఁపుల నంతర । మరసిన నవుఁబువ్వులను
తొరిగెడు చెమటల మేనులు । హరికిని సిరికిని నమరె.

47. హరికిని గుడికన్నదరె । సిరికి నెడమకన్నదరె
దరిదాఁకిన ప్రేమ మ్మి । ద్దరికిని కడు దయివాఱె.

48. విందుగఁగడు వేడుక గో । విందుని కా యిందిరకు
సందిటిదండల మెఱుఁగులు । సాహోనినదం బిడెను.

49. దిక్కుల చొక్కపు వాసన । మిక్కుటమై యుండఁగనూ
రెక్కల చుక్కల టెక్కుల । పెక్కులు పువ్వులు గురిసె.

50. నిండు కనకముల రథమూ । పెండి లరంగై యున్నా
అండనె యమరఁగ పెండిలి । దండి యొనర్పఁగఁబూనె.

51. నిపుణతఁ గనకపుఁబుటికెల । కపురపు బియ్యము నించి
యపుడిద్దఱపై నిద్దఱు । నపురూపంబుగ నునిచిరి.

52. ఆ హరుఁడును కమలజుఁడూ । మోహనముగ తెర దెచ్చి
ఆ హరికిని సిరి నడుమను । పోహణ గల మణుపూన.

53. పాయక గురుఁడును గరుడుఁడు । నాయకమగు లగ్నమునా
ఆయత్తంబనియును స । ర్వాయత్తంబని యనిరి.

54. అంతట వేదము గురుఁడు న । నంతుడు దగఁ జదువగనూ
సంతోషమున ముహూర్తము । చింతింపుచు నుండగఁనూ.

55. విభవముతోడుత వేంకట । విభుకల్యాణంబునకూ
గుభులు గుభుల్లన సురదుం । దుభులప్పుడు మొరయంగా.

56. తెరగ్రక్కునఁ దొలగించి । యిరువుర యొఱపులు మెఱయా
పరువపు వయసున నునుసి । గ్గరియాడఁగఁ జెలువమునా.

57. పల్లవకరమునఁ బట్టిన । బెల్లంబును జిలకరయు
చల్లనితలి మును ముట్టిన । వల్లభు శిరసునఁబెట్టె.

58. ఇందిరయును వేంకటవిభు । డందపు మోములు చూడా
చందురుఁడద్దముగూడిన । చందంబున గడుఁజెలఁగె.

59. ఆ పరమాత్ముఁడు ముందర । చూపుల చవులను మించిన
తీపుల మధుపర్కము తరి । తీపులుగా గావించె.

60. సంగతినేఁగి సముద్రుఁడు । గంగానది జలములతో
శృంగారికి వేంకటపతి । కింగొనివచ్చెను పాద్యము.

61. సకలాభరణోజ్జ్వలయగు । సుకుమారిని సహిరణ్యో
దకధారల హరికొసగెను । అకలంకుండా రాజు.

62. హరియును బద్మావతియును । ధరనెల్లను రక్షించుచు
తిరుపతి నా పద్మసరో । వరమున నెలకొనియుందురు.

63. హరి యురముననే లక్ష్మియు । సరసనె పద్మావతియును
పరమానందముతో భవ । శరనిధి నోలాడుదురు.

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## అలమేలుమంగా స్తవము

సిరి నెఱి నీలపురంగుబెడంగుల । చిన్నరిపొన్నరి పెన్నెఱితురుమును
మురువగు పాపటచుక్క నుచుక్కను । మొత్తపుముత్తెపు సరిసింధురమును
నుదయారుణకరబింబప్రతిబిం । బోద్యద్ధగధగితశిరోమణియును
ముదురరచందురు నుదురుచలములన్।మొలచెనొ యనఁజను
ముఖతిరుమణియును

పచ్చలరచ్చలబొగడలమొగడర । పజ్జలసజ్జరవజ్రపుమురువును
విచ్చలవిడివిడికెంపులమంపుల । విరివినెరవుకొనుబవిరెలహరువును
మగరాకమ్మల కళ్కులతళ్కుల । మలచిన చక్కని చెక్కుల పెక్కును
పగడపు జగడపు మోవి సుపాణియు । పసిమి మిసిమి గల ముక్కరనిక్కును
చంపకసుమపరిహాసిక నాసిక । చక్కందనముల నింపగు సొంపును
యొరపుగఁబరుపుగదయకుదయంబై । యొలపుసొలపుదగుచూపులకోపులు
మురిపెపు ముచ్చట ముసిముసినగవుల। మొలచిన చిలుకలకలుకుల ప్రోపులు
కులుకు కలికివాలుందెలిగన్నుల । కొమరులమరు తామరనగుమోమును
అల చిందము చందము గలగళమున । నమరిన మంగళసూత్రపు గోమును
తుదలమొదల సిరిమేలగు జతనల । దొల్కుకళ్కు కుతికంటు త్తండలు
ఉదిరిపసిఁడి మొగ్గలనిగ్గుల జ । గ్గొందగఁ బొందగు సందిటిదండలు
వలయపుసొలపుల ఝణఝణరవముల ।వలనవలనమగు శ్రీహస్తమ్మును
జక్కవనడకల చన్నుంగవపై । సొరై తీరై తగు హారమ్ములు
చిక్కఁగజక్కఁగ మేనంబూనిన । సిస్తగు కస్తురి గంబూరంబును
నవనిధులును గల శ్రీవర్ణనక । ర్ణముల నెదుర్కొను మణిభుజకీర్తులు
సవరణజల్‌తార్ రైకనలుపు పై । చాందిన చక్కని పతిమల మూర్తులు
చివ్వన నాభిబిలమ్మున వెడలిన। చీమలచాలనఁదగు నూఁగారును
చివ్వకు నాకొ నీకొ నని బలు । సింగముఁజెనకెడు కౌనుందీరును

మెచ్చుల కుచ్చుల నెరిపై నొరపై ।మెలఁగిచెలఁగు మణికాంచీదామము
గ్రుచ్చుకొనఁగ మానికమున్‌జెక్కిన । కొలుకుల యొడ్యాణపుబలుసీమము
కిసమసనిసుమున్ దీవులఠీవులఁ । గేరు తీరుపిరుదరుదు నొయారము
మినుకుమినుకుమని కదలిన మెరసెదు । మెఱుఁగుటొయారపుటూరుల బీరము
నందంబు హళాహాళికాహాళి యఱ । పఱఁదఱమిన జిగిబిగి చిఱుఁదొడలును
కెందామరలన్ గని తామరలన్ । గెలిచిన మృదుపదముల నిలుకడలును
చిటిపొటివ్రేళ్లన్ జిటుకుపొటుకుమనఁ । జిటికెడు మట్టపుమట్టెల భంగులు
పెటుకున జిలిబిలి గలిబిలిగల బొ । బ్బిలికాయల నిబ్బరపు టెలుంగులు
బడిబడి గలుగలు గల్లన మొరసెడి । బంగరుటందియకవసింగారము
నడుగులపైఁబడు బడుగుల గాచుట । కయిపెట్టిన గండరపెండారము
శతకోటిరతి ప్రతిభాభాసుర । సౌందర్యపుఁ దిరుమేని విలాసము
సతతానత సంరక్షణదీక్షా । సంరంభసమగ్రసముల్లాసము
కలిగిచెలఁగు శ్రీవేంకటనిలయుని । ఘనవక్షస్థ్సల సింహాసనమున
నెలకొని యలమేల్మంగాదివ్య వి । నిర్మలనామమునందగు ప్రియమున
సకలజగమ్ముల బొజ్జను నిడికొని । సాకిన తల్లిని నినుఁగొనియాడెద
ముకుళితకరకమలుఁడనై నీకున్ । మ్రొక్కెద నిఁక నా లేములు వీడెద
మాం దీనమనాథం పాహి రమే । మకుటాలంకృతకల్పకకుసుమే
మాం దేవి కృతార్థం కురు పరమే । మంజులచంద్రస్ఫురదురుసుషమే
తుభ్యం మంగళమధిగతపుణ్యే । తుభ్యం మంగళమతిలావణ్యే
తుభ్యం మంగళమార్తశరణ్యే । తుభ్యం మంగళమభిజనగణ్యే
శ్రీవరలక్ష్మీజనని నమస్తే । క్షీరాంబుధిసజ్జనని నమస్తే
భావభవాబ్జజజనని నమస్తే ! పాహి మాం జగజ్జనని నమస్తే.!!

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## ప్రసన్న వేంకటేశ్వరమంజరి

శ్రీరమణీమణి చిత్తప్రియకర । వారిజలోచన వారణభయహర
శంకరసన్నుత సకలామరహిత । పంకజభవపిత భవ్యగుణోన్నత
లోకరక్షణా లోకవిచక్షణ । పాకారిస్తుత భవ్యసులక్షణ
కంబుసుదర్శన ఖడ్గగదాధర । శంబరహరగురుశార్‌ఙ్గలసత్కర
కనకమయాంబరకౌస్తుభభాసుర । వనజోదర దోర్వహితమహీధర
ఘననీరదసంకాశ సమాశ్రిత । మునిజనపోషిత ముచికుందస్తుత
దేవదేవజగదీశ్వర చిన్మయ । శ్రీవేంకటశిఖరిస్థిత జయజయ
సేవకుఁడగు నేఁజేయు విన్నపము । నీవే కైకొని కావవె కరుణను
మీ చరితంబులు మిగుల నుతింప న । గోచరములు గద కువలయవల్లభ
ఐనను మీ చరణాంబుజముల మది । నూని రచించెద నొప్పగు మంజరి
అవధరింపు సర్వాత్మప్రసన్నుఁడ । నవవేంకటనగనాథువిభవములు
వివిధలీలలును వెలసిన మహిమలు । వివరించెద నా విజ్ఞతకొలఁదిని
వర్ణగణంబులు వరుసలు తప్పిన । నిర్ణయపదములు నేర్పులకెడసిన
తప్పుదారులవి తఱచైయుండిన । నొప్ప ననుగ్రహమొనరింపుము దయ
ధరణిమధ్యమున ధగధగితవసు । స్ఫురదురుమణిగణభూరితటంబుల
సురగరుడోరగ నరఖేచరికి । న్నరచారణులకు నిరవై వెలుఁగుచు
సంపన్నగమనఁజెలఁగెడు మేరువు । వంపగు దక్షిణవార్ధిమధ్యమున
పొగడొందెను జంబూద్వీపంబన । నగణితమహిమలనభిరామంబై
అందలి బహునారాయణ పూజా । మందిరములలో మహివిలసితమై
నూటయెనిమిదగు మేటిస్థళమ్ముల । పాటింతురు తిరుపతి నతిశయముగ
శేషాచలమునఁజెలువు దలిర్చుచు । భాషాపతికిని ఫణిపతికైనను
వర్ణనసేయఁగ వశమే రత్న । స్వర్ణమయంబులు సానువు లమితము

కోనల వాఁగులు గుహలు వనంబులు । నానానోకహసూనవికాసము
లమరద్రుమములు విమలోదకములు । కమలాకరములు గణనాతీతము
లలరుల తేనెల నలరెడు తావులఁ । దులకించెడు పూఁదోటలు బహుళము
శశికాంతమ్ముల మిసిమి దనర్చెడు। విశదసౌధముల వీధుల సొబగులు
పచ్చల తోరణపంక్తులకడపల । మెచ్చగు ముత్యపుమెఱుఁగు ముగ్గులును
బంగరురంగు దొరంగెడి గృహముల । శృంగారమ్ములు చెప్ప నశక్యము
చాతుర్వర్ణ్యాశ్రమములు తప్పక । నీతి వహించిన నిఖిలప్రజలును
నవరత్నంబులు నవధాన్యంబులు । నవయౌవనవతులవు సుందరులును
గురుసంపద్భాసురమగు నాపుర। వరమున మణిగోపురమంటప తో
రణకేతు తటిద్ధ్వాగావరణము । లెప్పుడు నభయములేర్పడనిచ్చుచు
కప్పంబులు బహుకానుకలును ప్రజ । లొప్పింపగ సముదోన్నతిఁజేకొని
అప్పనిప్రియభక్తౌఘంబులకును । తప్పక వరముల దయసేయుచును
పొల్పగు నప్పురిఁబొల్చుజనంబుల । తల్పంబున పద్మాలయతో నా
కల్ప విభూషణకాంతిఁజెలంగఁగ । కల్పాంతరములు గరిమ వహించియు
ఓలిఁగలియుగమునొంది గణనగను ।శాలివాహనుని శకవర్షంబులు
ఆరయ వెయ్యిన్నయిదు శతమ్ములు ।మీఱిన తొంభైయాఱటులనుజన
చందంబగు రాక్షసవర్షము రా। నందు మార్గశిరమను మాసము దాఁ
గందళితోత్సవకరమై నడచుచు । నుండఁగ నొకనాఁడొగిఁబశ్చిమ భూ
మండలమునఁగల మనుజులకెల్లను । జ్ఞానోదయములు దానగుణమ్ములు
భూనుతకీర్తులు పుణ్యవ్రతములు । సత్యాచారము నిత్యోదయమును
అత్యధికశ్రేయమ్ములు హితదాం ।పత్యము పుత్రులు బంధుజనంబులు
గలిగి సుఖోన్నతి చెలఁగగ వరముల । నిచ్చుటకొఱకై హెచ్చిన ప్రేమను
లచ్చియు పెనఁగొన వచ్చి జగమ్ముల । కచ్చెరువగు చెల్వతిశయమందిన
పచ్చపయిరులను బంటలజంటలఁ । గేదారమ్ముల స్వాదూదకముల



శాలిమంజరుల చెఱకుతోటలను । నేలాతాంబూలీ వల్లికలను
చూతచంపకస్తుత పున్నాగ । వ్రాతగోస్తనీ వకుళద్రుమముల
వారికెడంబుల నవకదళికలను । పూగద్రుమములఁబొల్పగుపనసల
జంబీరమ్ముల జంబూతరువుల । నింబ తింత్రిణీ నీపాశ్వత్థ క
దంబాగరు చందన సాలములను । మహి మఱిగల భూరుహగహనంబుల
బహుళంబులునై పరగెడు వనముల । మల్లెలమొల్లల మరువంబుల పె
ల్లల్లిన జాజుల సల్లలితములగు । కరవీరంబుల విరవాజుల బలు
గురిగింజల పెనుగుంపుల సొంపుల । పూఁదేనెల నింపొదవెడు తావుల
మలసెడు దక్షిణమరుదంకురముల । విలసిల్లెడు బహువిహగంబుల నళి
పుంజంబులచే రంజిల్లెడు ఘన । కుంజంబుల నతికోమలవనముల
కొదమచిల్కలను గుదిగొను కోకిల । కదుపుల రొదలను గడునొప్పారుచు
నీలోత్పలముల నెగడెడు చెఱువుల। కాలువలను పెక్కగు బల్మడుఁగుల
పద్మాకరములఁబద్మాలయకును । సద్మములై తగు పద్మచయమ్ముల
చక్రవాకబక జలకుక్కుటము ల । తి క్రీడల వర్ధిలు రాయంచల
పొలముల మేయుచువలుఁదపొదుగులును ।గులుకుచుఁగుఱ్ఱులఁదలఁచిచేఁపి
పాల్గురియుచుఁదిరిగెడి గోసందోహము ।మురియుపొల్పులను జరిగెడు
వృషభము
లంకెలు దప్పిన నతిజవములచే ।జింకలగతి బలుఱంకెలు వేయుచు
జంకెనచూపుల జను వత్సంబులు । గలిగిన మందలఁగడుశోభితమై
వెలసెడు గోపకబృందంబులచే । నంబరచుంబితమగు కోటలఁగడు
డంబైన యగడ్తలఁగొత్తళముల । మేడలవాడల మెఱుఁగుటరంగుల
నీడల జాడల నింపగు తావుల । సున్నపుమిద్దెల చూపట్టుచుఁగడు
నెన్నికకెక్కు ననేకపురంబుల । జనపదముల వాసములై యుండెడు
మనుజుల యోషిజ్జన నికరంబుల ।రంజిల్లుచు మను రాజ్యంబునకును

పంజరమై జనపాలనసేయుచు । శ్రీరంగేశ స్థిర పట్టణమున
నారూఢిగఁ బట్టాభిషిక్తుఁడయి । నీతిధర్మముల నెలవులు దప్పక
చేతోమోదము సేయుచు సజ్జన । జాతంబుల పూజనములుసేయుచు
అరిభూవర మకుటాంచిత మణిగణ । కిరణస్ఫురితాంఘ్రి యుగోజ్జ్వలుఁడై
సకలైశ్వర్య సుసంపన్నుండగు । చికదేవనృపాలక శేఖరునకు
స్థిరమైనిబిడ శ్రీధాన్యమ్ముల । వర ధనసంపత్కరమై వెలయుచు
కావేరీప్రాక్కకుబంతరమున । ద్రావిడదేశాద్యమ్మై పరగెడు
వామలూరికిని వరలెడు నుత్తర । భూమి నపరిమిత భూజంబులచే
పటుశైలంబుల కటకపు శృంగో । త్కట సానుప్రస్తరులఁబరపై
తులసీవనములఁదుహినాంశు శిలా । ఫలకోజ్జ్వలమణి పంక్తుల దంబై
వనలక్ష్మికి నిరవై చెలువొందెడు । వనము కనుంగొని వదలని ప్రియమున
అచ్చట నెలకొని యఖిల ధన్యులకు ।ముచ్చట లొసఁగఁగ ముదమగ్గలమగు
నంతటఁదత్ప్రాంతమ్మున హోలిక । సంతతులను గడు సంతసమందుచు
తృణకాష్ఠంబులు దెచ్చుటకొఱకై ।గుణములగైకొని గుంపులు గూడుక
చని వనసీమల సంచరించుచోఁ। గనత్కనరుచి ఘనమై నెగడఁగ
వలగొను మెఱుపై ధళధళ వెలుఁగగ। మలసిన జ్యోతిర్మయమై యుండగ
కనుఁగొని జనులాకంపము నొందుచు । తనువులు మరచిరి తత్పరవశమున
నంతట దెలిసియు నాశ్చర్యంబున । నెంతయు భ్రమితస్వాంతంబుల నా
చెంతల నుండక చేరిపల్లియల ।వింతసుద్ది యిది వినుఁడని జనులకు
నెఱిఁగించిన సర్వేశ్వరుఁడగునా । తిరుపతి వాసుఁడు తిరువేంకటపతి
వచ్చి యిప్పు డీవనమున నెలకొనె । నచ్చెరువని జనులందఱు పొగడుచు
నచ్చటికిచటి ప్రజావళితోఁదగ । మరలివచ్చి యా మప్పిదమగుచో
నప్పరమాత్మున కా వాహనమని । పూజలొనర్చిరి పొంగెడు వేడుక
రాజిల్లెడు సుమరాజంబులచే । నా వార్తలు జగమంతయు నెగడఁగ



భావంబుల జనపంక్తులకెల్లను । అత్యాశ్చర్యకరంబై చన నో
నిత్యాత్మా! యని నేర్పునఁ బొగడిరి । ఆ వేళకుఁదగినట్టి మందిరము
గావించిరి యొడికంబుగ జనములు । తదనంతరమున దనుజాంతక మీ
పదపద్మంబుల భక్తిఁగనుంగొన । వెదకుచు శేషుఁడు విహగాధిపుఁడును
సదమలగుణుఁడంజన కొమరుండును । సనకసనందన మునిసంఘంబులు
నినతేజులు పన్నిద్దఱు సూరులు । మానుగ విష్వక్సేనుఁడు మొదలగు
నానాపరిజను లా నారదుఁడును । దేవగణంబులు దిక్పాలకు లా
వనమున కధికజవాతిశయమ్మునఁ । జనుదెంచి మహాసంతోషమ్మున
మ్రొక్కిన వారల ముదమునఁగనుఁగొని । యిక్కడ నిల్చితి నిది నూతనమగు
తిరుపతియగు నిట వరవైభవములు ।చిరతరమగునని చెప్పినపిమ్మట
మఱి గరిమమ్ములు నెఱపెడు కొఱకై । వరచిహ్నమ్ముల తెఱఁగెఱిఁగింపుచు
పేరుకల్గి కోనేరన జగముల । నారూఢిగఁదీర్థంబువు పొడమిన
పొడగని యందఱు భువినద్భుతమని । యుడుగక సన్నుతులొనరింపుచు నిం
పడరగ స్నానములందఱు సేయుచు। బడలికలెల్లను బాసిరి జనములు
ఆ విభవంబుల నన్నియుఁగన్గొని । శ్రీవైష్ణవులర్చించిరి భక్తిని
ఇట్టి మహత్త్వములెక్కడ నెఱయగఁ । బుట్టిన నల్దెస భూరిజనౌఘము
కాసులు రూకలు కనకటంకములు । భాసుర దివ్యాంబర మణులొప్పఁగ
కానుకలవి వెగ్గలముగఁదెచ్చిరి । ఆణిముత్యముల హారంబులతో
నీ రీతిని శనివారములందును । మీఱిన పరుషలు మెండేతేరగ
వచ్చిన జనులకు వరములొసంగుచు । అచ్చుగ మైజాడ్యమ్ములఁబాపుచు
భూతశంకలును భీతిరుజాళులు । చేతుల ముణుగులు జిహ్వాదోషము
పాతవేఁకులును బటు కుష్ఠ కఫ । వ్యాధిబాధలును హరియింపుచుఁ జి
ద్బోధన చేయుచుఁ బురుషోత్తముఁడై । చిక్కదేవరాజేంద్రుని కలలో
అక్కజముగఁబ్రత్యక్షంబైనను । మ్రొక్కి లేచి కరములు ముకుళింపుచు

నిక్కము వేంకటనిలయుండనుచును। అక్కఱతో ధనమర్పణ లొసఁగుచు
మక్కువ గిరిపై మంటప వితతులు । నిక్కగు గోపుర నిచయంబులు పెం
పెక్కిన శిఖరము లేర్పడు తోరణ । కంభములు ఘనాగార వ్రాతము
లంభఃపూరితమైన కొళంబులు । వివిధ చిత్రముల వెలసిన తేరులు
ధవళచ్ఛత్ర పతాకములమరఁగ । శ్రీకరమై తగు ప్రాకారంబు ల
నేకంబులు నిర్మింపఁగవలె నని । నియమించిన గతినే తిరుపతుల, ను
భయములుసేయగ భక్తులు పూనిరి । తమవుభయములుగ ధనములనిచ్చుచు
అమితములగు పనులందరు సేసిరి । వాహనములు చెలువంబుగఁజేసుక
శ్రీహరికని మఱి తెచ్చిరి దాసులు। అంతట పట్టణమమిత సుప్రజా
సంతతిచేఁగడు సంతసమయ్యెను । అంగడివీధుల నమితవస్తువులు
శృంగారములై చెందెను సిరులను । ధరణీసురమందిరములు తఱచై
తిరువీథులు సుస్థిరముగ నొప్పెను । ఆటపాటలను నచ్చరసతులకు
మీటనఁజాలెడు మెఱుగుంబోణుల । నాగవాసమతి నాగరికంబై
రాగంబున గృహరాజులొనర్చిరి ।ఈ విధమునఁబురి యెసఁగఁగ గిరిపైఁ
గావించిన శృంగారగృహంబుల । శుభదివసంబున విభవోన్నతుఁడై
రభసమ్మున తూర్యములు చెలంగగ। అలమేల్మంగానలినదళాక్షియు
వలగొను పరిజనవర్గమ్ములతో। పరమానందంబలరగ నిల్చిన
సరసిజాక్ష మీ చరణాబ్జములకు । ఘనతర సాష్టాంగ నమస్కారము
నురుభక్తిని నే నొనరించెదనో । జగతీశ్వర మీ దగు తిరుణాళులు
అగణితములు నా కలవియె పొగడను । వివరించెద నే విన్న కన్నయది
అవధారు సమస్తామరవందిత । ఆఱుఋతువులకు నభివందితమగు
చారువసంతము జగమునఁబొలిచెను । వెడవెడ విసరెడు సుడిమారుతముల
తడయక తరువుల తరచగు పత్రము । లన్నియు రాలఁగ నట తోడ్తోడుత
మిన్ను నలుగడల మెఱుపుల మెఱసెను । నిగనిగమని బలు నిగ్గులు దేరఁగ



నగమప్రతతుల చిగురిగురించెను । విరహిమృగంబుల వేఁటాడుటకై
మరుఁడొరఁబెరికిన సురియల తెఱఁగునఁ। జూతకిసలయ స్తోమము మెరసెను
ఆ తీరున సొంపగు పాదపముల। పల్లవులకు మది పల్లటమందఁగ
పల్లవ కోరక పంక్తులు తనరెను। ప్రసవగుచ్ఛములు బటువుశలాటువు
లెసగు ఫలంబులు రసికులకయ్యెను । పికముల మనములు వికసనమందెను
శుకనికరమ్ములు సొంపు దనర్చెను । మధువులు కుత్తుకబంటిగ్రోలుచును
మధుకరములు ఝుమ్మని విహరించెను ।మఱిగల పక్షులు మహనీయములై
మెరసెడు ఫలముల మెక్కఁదొణంగెను ।చందన మారుతచయములు పరిమళ
మందుచు వనముల నల్లన మెలఁగెను । చెఱకువింటిదొర పురిగొని బలములఁ
బరపుచు పాంథులపై దండెత్తెను । ఈ విలసనముల నిట్లొప్పెడిచో
నా వైశాఖంబను నెల పొడమిన । ప్రతిశనివారము నతులోత్సవములు
వితత స్యందనగతి దివసంబుల। నీడుజోడు లే దెందును జగముల
చూడవేడుకలు శోభనకరములు । అని దిశలం బ్రఖ్యాతంబైనను
మనుజవ్రాతము మసలకవచ్చెను । భూమీవరులుప్పొంగెడి వేడుక
సామజహయరథ చతురంగబల । స్తోమంబులతో సొలయక వచ్చిరి
ఆంధ్రదేశ కర్ణాటప్రజ నీ । రంధ్రమ్ముగ నతిరయమున వచ్చెను
ద్రావిడ ఘూర్జర ధరణీపతులును । నీ వసుధను మఱియెన్ని దేశములు
గలిగిన వన్నిటఁగల ప్రజలెల్లను । విలసిల్లెడు కడు వేడుక వచ్చిరి
బ్రాహ్మణజనములు ప్రబలుక్షత్రియులు । గహ్వరగుణములు కలుగు వైశ్యులును
నాలుగుజాతుల నానానరులును । చాలుగట్టి యనిశమ్మరుదెంచిరి
తమ్మటంబులును ధవళశంఖములు । కొమ్ములు పిల్లంగోవులు మొరయగ
చిటితాళంబుల నటునిటు తట్టుచు । పటుగతి నాడెడు బహుదాసరులును
వచ్చినిండి యా వరపట్టణమున । నిచ్చకువచ్చిన యిరవులు గైకొని
ధిమిధిమియని మందిరముల వీథుల । కొమరగు వనములు కొలనుల కెలనులు

నెక్కడఁజూచిన యెడమింతయు లే। కక్కజముగ ప్రజయంతయు నిండెను
జాతరదినములఁ జక్కనివీథుల। నూతన తోరణజాతములొప్పెను
కురుఁజు మేరువులు తెరచప్పరములు। అరపటిగలు పురి నగణితమయ్యెను
పట్టాంబరములు పటుకేతనములు। పట్టణమునఁగన్పట్టెను మెఱయుచు
అగరు ధూప సాౖమాణిగుగ్గిలపు। పొగలెందును ఘుమ్మన వాసించెను
చందనోదకము చల్లిరి వీథుల। పొందుగ ముత్యపుౖముగ్గులు వెట్టిరి
ఫలకదళికలును బహుౖక్రముకమ్ములు। సులలితముగ చెఱకులు నెళనీళులు
ద్వారదేశములఁదఱచుగఁ గట్టిరి। భూరిసంపదల పుట్టిల్లనగను
ఈ గతి విభవంబెసగఁగఁ బశ్చిమ। సాగరమున రవి చయ్యనఁగ్రుంగెను
నలువయాజ్ఞఁ గాల్నిలువక తిరుగఁగ। వలసిన చనుమని యల రవివీడ్కొని
చెలువగు ఖగపతిసేవ కనుంగొన। నిలిచె నరుణుఁడన నెగడెను గెంపులు
నీడంబుల ఖగనివహము చేరెను। ఆడెడు భృంగము లరవిందమ్ముల
యుదరంబుల నెమ్మది నిౖద్రింపుచుఁ। బదిలంబై యొప్పారుచు నుండెను
అంబర మను చప్పరమున దేవక। దంబము పువ్వులదండలు కట్టియు
పరిమళధూపము పరపిన తెఱఁగున।గురుతారకములు నిరులును నిండెను
అదన నమరులకు నమృతంబొసఁగిన। సదమలపుణ్యం బొదవెనొకో యన
విశద చంౖద్రికల శశి యుదయించెను। దిశలెల్లను గడు తేజంబంటెను
అప్పుడు పరిచరు లతిసంౖభ్రమమున। నొప్పుగ ఖగవిభు నొగిఁగైసేయుచు
తారహారములు తగుపదకంబులు। చారుముత్యములు చౌకట్లు రుచి
స్ఫారంబగుకోటీరాంగదములు। గండపెండెములు కడునొప్పగు పూ
దండలు ఘనపీతాంబరచయములు। మెచ్చగు కస్తురి పచ్చకప్పూరం
బచ్చెరువగు జవ్వాది కదంబము। తెచ్చిన మనమున హెచ్చినవేడుక
అచ్చుగఁదద్భూషాలంకృతుఁడై। కనకాంబర మొడికంబుగఁగట్టియు
ఘనశంఖ సుదర్శనములు పట్టియు।వరకౌస్తుభమణి యురమున వెలుఁగఁగ



మఱి తులసివిరుల్ సరములు మెరయఁగ। శతకోట్యర్యమసంకాశమ్మున
పతగాధీశ్వరుపై మోదముతో। అధిరూఢుండై యలమేల్మంగా
మధురవాణి యురమందు వెలుంగఁగ। తిర్వీధికి వేంచేసెడుచో ఘన
తూర్యంబుల సందోహము ౖమోయఁగ। పగలువత్తులును పంజులు దీవ
ట్లగణితములునై యటు ముందరఁజన। గొడుగులు పడగలు కుంచెలు మెండై
యెడ యింతయు లే కిరుగడఁబట్టఁగ। చేతాళంబులు చెంగులు మురళీ
శ్వేతశంఖములు చెల్వుకాహళలు। తప్పటలు మర్దళములు వడివడి
రొప్పు వీరణము లొప్పగు ఢక్కలు। నాద్యంబై యెన్నఁగఁదగు పంచక
వాద్యంబుల రావములు చెలంగఁగ। వీణెతంబురలు వెడవెడ మీటుచు
గానమ్ములు భాగవతులొనర్పఁగ। భువినుతమ్మగు ౖద్రావిడవేదము
శ్రీవైష్ణవులు వచింపుచు నడవఁగ। మేళముగట్టుచు మెలఁతలు తత్తహ
తాళంబు గతి తప్పక నాడఁగ। ముందర జనవరముఖ్యులు తఱచై
సందడింప హయసామజములపై। నెక్కి వేడుకల నే తేరఁగ జను
లక్కజముగ నిండారుగ నడవఁగ। బిరుసుబాణములు బిసబిసరవముల
దురుసై నభమునఁదొట్టుచు మొరయఁగ। అటుముందట చతురంగబలంబులు
పటుగతి నడవగ బహుళోత్కటమై।యీ గతివీథుల నేతెంచెడుచో
ఆ గరుడోత్సవమపుడీక్షింపఁగ। ౖక్రందుగ సురమునిగణములతో సం
ౖక్రందనుఁడును దిక్పాలకముఖ్యుల। వనితలతో ప్రసవమ్ములు గురియుచు
చనుదెంచిరి పుష్కరమార్గంబున। తుంబురునారదు లంబరపథమున
తంబుర వీణాధరులయి పాడిరి। వీడనివేడుక వేలుపుకన్యలు
ఆడుచుపాడుచు నలరుచునుండిరి। పౌరజనమ్ములు బహువిధఫలముల
నారికెడంబుల నైవేద్యములుగ। నర్పించుచుఁౖబమదాతిశయమ్ముల
నేర్పడఁజూచుచు నింపున నలరిరి। యిట్టి సంౖభ్రమంబెసగఁగఁ గశ్యపు
పట్టినెక్కి యప్పట్టణవీథులఁ।జుట్టివచ్చి గిరిసోపానమ్ముల

నెట్టన నెక్కియు నిజభవనస్థలి । గరుడుని దిగి మణిగణ రోచులచే
నొరపై తనరెడు నరమంటపమున । నధివసించి శ్రమ మల్లనఁదీర్చుచు
మధురఫలమ్ములు మఱి నానావిధ । చిత్రాన్నమ్ములు చిరువాలును మే
లతిరసములు దధ్యన్నమ్ములతో । నారగించి భక్తానీకములకు
కోరినవరములు కూరిమి నొసగుచు । నవరత్నోజ్జ్వల భవనాంతరముల
నవ కుసుమంబుల నవకమ్మైతగు । మంచమ్మున సమ్మతి నిందిరతో
మించినవేడుక మెలఁగుచునుండెడు । శ్రీవేంకటగిరిదేవ నమస్తే!
భూవినుత మహాపురుష నమస్తే! । మీన శరీరము పూని సోమకుని
చానడంచియును జదువులు ధాతకు ।దయచేసిన మాధవుఁడ నమస్తే!
శరనిధి మంధరగిరి మునిఁగినచో । గురు కమఠాకృతిఁ గుధరంబెత్తియు
సురలకు నమృతము సూరగనిచ్చిన । పరమాత్మ దయాపరుఁడ నమస్తే!
ధరచుట్టుకొనుచు దానవుఁబొలిగొని । కిరిరూపంబున మెరసి లోకముల
నలరించిన దైత్యారి నమస్తే! । హరిఁ జూపర వోరని బాలునిపై
చురచురజూచెడు సురవైరిని నర । హరివై కంభమునందు జనించియుఁ
బరిమార్చిన ఘనబలుఁడ నమస్తే! । బలి నణఁగించెడు తలపున వటువై
యిల మూఁడడుగుల నిమ్మని వేడియు । పుడమి యుదివి రెండడుగులఁ
కడుశూర త్రివిక్రముఁడ నమస్తే! । ధరణీవరులతి దర్పంబున మై(గొలిచిన
మరచిన వారల మర్దించుటకై । జమదగ్నిమునీశ్వరు రాముఁడవగు
నమిత మహాసత్త్వాఢ్య నమస్తే !। రవికులమున దశరథరాముఁడవై
దివిజవైరిఁబంక్తిముఖునిఁగూల్చిన ।మునిజనావనామోద నమస్తే!
ధరణీభారము పరిహరించుటకు । అరయఁగ వసుదేవాత్మజుండవై
కంసాది మహాగర్వాంధుల వడి । హింసించిన లోకేశ నమస్తే!
త్రిపురరాక్షసస్త్రీల మానములు । నిపుణతఁ జెఱపగ నీవు బుద్ధవై
హరుచాపమ్మున శరమై నిల్చిన । సురలోకస్తుత సుగుణ నమస్తే!



తురగారోహణ మొనరం జేయుచు । మెరయుకల్కివయి తిరిగి జగమ్ముల
నిరవుకొల్పు దేవేశ నమస్తే! । పరగ ననంతాంతర రూపమ్ములు
ధరియించి విరాట్పురుషుఁడు నీవై ।పరమానందం బలరఁగ సుస్థిర
పరుఁడగు శ్రీగోపాల నమస్తే! । అపరాధ సహస్రానీకమ్ముల
నపరబుద్ధియుతుఁడై నేఁజేసినఁ । గృపతోడుత రక్షింపఁగవలయును
విపులబుద్ధియును విమలజ్ఞానము । భవదంఘ్రిద్వయ భక్తియు నొసఁగుచు
భువన పావనాంబుజ భవవందిత । మఱి మీ గుణగరిమంబుల నొప్పెడి
వరమంజరి యెవ్వరు పఠియించిన । వ్రాసిన విన్నను వరసౌఖ్యమ్ములు
దాసీ సుత మిత్రామోదమ్ములు । ధనకనక సమస్తైశ్వర్యమ్ములు
ఆయుష్యములు చిరారోగ్యమ్ములు । చారురూపములు సకల విద్యలను
ఘనసద్గుణముల పెనుపొందుదురిల । నీ కృతి వసుమతి నినచంద్రాదులు
భూమీధరములు పొలుపగు తారలు । నెన్నివత్సరము లిరవై యుండెడు
నన్నిహాయనము లతి విలసితమై । యుండఁగ రక్షణ మొనరంజేయుము
పాండవపాలన పరమదయానిధి । తవ దాసోఽహం తవ దాసోఽహమ్
నవశేషాచలనాథ నమస్తే.

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## శ్రీ వేంకటేశ్వర పంచచామరములు

శ్రీరమాధిపా కృపాధురీణ సుప్రవీణ సం
సారదూర వాసరేంద్ర చంద్రకోటి భాసురా!
నీరజాసనాదివంద్య నిర్గుణస్వరూప ఓం
కార నిర్వికార చిత్ప్రకాశ వేంకటేశ్వరా!! ॥ 1

శ్రీమహేశవందితా విరించిపూజితా సుగో
త్రామరాత్మజామృతప్రదా సదామరస్తుతా!
సామవేదగానలోల సాధురక్షకా భవ
న్నామయోగి హృన్నివాసనాథ వేంకటేశ్వరా!! ॥ 2

పామరుండనై మదించి బ్రహ్మఘాతకుండనై
కాముకుండ నైతి నిన్నుఁగాన నైతి నయ్యయో!
తామసంబు మాన్పి నన్ను ధన్యుఁజేయు మీ భువిన్
నామయోగి హృన్నివాసనాథ వేంకటేశ్వరా !!॥ 3

బైలనుండి బైలు గల్గె బైలగాలి గల్గె బల్
గాలినుండి యింగలంబు గల్గె నింగలంబునన్
నీలువుట్టె నీలనుండి  నేలవుట్టె నిట్టి భూ
తాలనుండి మేను వుట్టెఁదండ్రి వేంకటేశ్వరా!! ॥ 4

యీ సువర్ణరత్నరాసులిండ్లు తల్లిదండ్రులున్
ఈ సహోదరుల్ కుమారు లిమ్మనోహరాంగనల్
యీ సగోత్రబాంధవాప్తు లీ గజాశ్వముల్ భటుల్
ఈ సమస్త మింద్రజాల మీశ వేంకటేశ్వరా!! ॥ 5



ఆశఁ గన్న దల్లిదండ్రు లాండ్రుబిడ్డ లన్యులున్
నాశమౌ టెఱింగి తాము నాశ మౌటెఱింగియున్
దోసిమాయ మోసపుచ్చుత్రోవ మూఢు లయ్యయో
లేశమంత మున్నెఱుంగలేరు వేంకటేశ్వరా !! ॥ 6

హిరణ్యమందు భూషణాదులెల్లఁ గల్గురీతి సా
గరంబునందులం బహూర్మికల్ జనించు కైవడిన్
పరాపరస్వరూపమైన బ్రహ్మమందు నిమ్మహా
చరాచరంబు లుద్భవిల్లె స్వామి వేంకటేశ్వరా !! ॥ 7

ఆకసంబునందు గాలి యాకులందు నిందునై
జోక నూవులందు నూనె సూర్యనందుఁగాంతియున్
మాకులందు నిప్పులున్నమాడ్కి నీ సమస్తమం
దేకమై వెలుంగు నాత్మఁడీశ వేంకటేశ్వరా!! ॥ 8

అనంతమందు సంభవించునట్టి భూతరాసులున్
అనంతము న్నఖండరూపమై వసించు కైవడిన్
తనంత యీ సమస్త కల్పితంబులందు నాత్మయున్
దనంతనే వెలుంగుచుండు ధన్య వేంకటేశ్వరా!! ॥ 9

ఆకసంబు నీలవర్ణ మట్లయుండు కైవడిన్
కాకిచిప్ప వెండియట్ల కానవచ్చు కైవడిన్
ఏకమై వెలుంగునాత్మయెల్ల మూఢకోటికిన్
జోక వేఱతోచుచుండు సుమ్ము వేంకటేశ్వరా!! ॥ 10

కులాచలంబులన్ని యట్టె క్రుంగినన్ సముద్రముల్
కలంగినన్ ధరాతలంబు కంప మొందుచుండినన్
మెఱుంగువహ్ని చల్లనైన మిన్ను వచ్చి వ్రాలినన్
చలింపఁడాత్మయోగి సుప్రసన్న వేంకటేశ్వరా!! ॥ 11

వెండికొండ యెత్తినట్టి వీరదానవేంద్రుఁడున్
గండుమీఱి వానిఁదోఁకఁ గట్టినట్టి వాలియున్
చండబాణమేసి వారిఁ జంపినట్టి రాముఁడున్
ఉండిరే ధరాతలంబు నొంద వేంకటేశ్వరా!! ॥ 12

కనంబడే ప్రపంచమెల్లఁగన్గొనేటి  యాత్మగా
మనంబునందు నిశ్చయించి మౌనియై చరింపుచున్
వినిర్మలాభ్రముల్ వలెన్ భువిన్ జరించునట్టి స
జ్జనుండు రాజయోగి సామి వేంకటేశ్వరా!! ॥ 13

కన్నకన్నచోట్ల కీడ్చి కాకుసేయుడెందమున్
వన్నెవాసి యిచ్చుగురువు వాక్యమెన్ని నిల్పుచున్
తన్నెఱింగి నిన్నెఱింగి తన్నునిన్నుగా నెఱిం
గున్నవాఁడె సుమ్ము రాజయోగి! వేంకటేశ్వరా!! ॥ 14

ముక్తికాంత యన్నపేరి మోహనాంగి యుండగా
యుక్తి నా వధూటిఁగూడి యుండలేక యజ్ఞుఁడై
భక్తి లేని మాయ యనెడి పాపజాతి యంగనా
సక్తుఁడై నరుండు చెడును స్వామి వేంకటేశ్వరా!! ॥ 15

తన మనస్సె యెంచి చూడ తన్నుఁజంపు శత్రువున్
దన మనస్సె యెంచిచూడఁ దన్నుఁబ్రోచుమిత్రమున్
తన మనస్సు కోడెనేని తనకు శత్రువే సరీ
తన మనస్సు గెల్చెనేని తనకుబంధువే హరీ!! ॥ 16

అక్క రాకువేసి పుల్లనంబలింత పోసినన్
చక్కెరాను పాలుగూడు చాలఁబెట్టి మ్రొక్కినన్
ధిక్కరించి వచ్చిపెట్టి ధిక్కరించి కొట్టినన్
ఒక్కబుద్ధి నున్నవాఁడె యోగి వేంకటేశ్వరా!! ॥ 17



శుభస్వరూపరత్నముల్ విశుద్ధహేమ తారముల్
ప్రభంజనుండు భూమి సర్వభక్షకుండు గంగయున్
విభావసుండు చంద్రుఁడున్ బవిత్రులైన పోలికన్
అభేదజీవుఁడున్ బవిత్రుఁడయ్యె వేంకటేశ్వరా!! ॥ 18

అల్లపంక మందుఁ జూడ నబ్జమున్నకైవడిన్
చల్లనబ్జపత్రమందు జలములున్న వైఖరిన్
తెల్లనద్దమందు నీడ తేలుచున్న పోలికన్
ఉల్లమందు జీవుఁడుండు టొప్పు వేంకటేశ్వరా!! ॥ 19

లోకమందు గబ్బిలంబులున్ శుకంబులున్ను భ
ల్లూకముల్ మహోరగంబులున్ను గార్దభంబులున్
మేకలు న్బకంబులు న్నెమిళ్లు ముక్తిఁబొందినన్
పోకుమానవుండు ముక్తిఁ బొందు వేంకటేశ్వరా!! ॥ 20

శుక్తి నడ్డగించు వెండి శుక్తిగన్న పిమ్మటన్
శుక్తియందె లీనమయ్యె సూటి నంబుజోదరా
ముక్తి నడ్డగించుమాయ ముక్తుఁడైన పిమ్మటన్
ముక్తియందె లీనమయ్యె ముద్దు వేంకటేశ్వరా!! ॥ 21

స్నానముల్ వ్రతంబు లాఱు శాస్త్రముల్ పురాణముల్
దానముల్ శివార్చనల్ కథల్ వ్రతోపవాసముల్
మౌనముత్సవంబు లాగమాదులన్ని కర్మకే
కాని బ్రహ్మజ్ఞాని కింపు గావు వేంకటేశ్వరా!! ॥ 22

కష్టజీవనంబు నెంచి కాంక్ష నింతకాల మీ
సృష్టిలోన దుఃఖపడుచుఁ జిక్కినాఁడ నో హరీ
భ్రష్టుఁడైతి నజ్ఞుఁడన్ గృపాకటాక్ష ముంచి నా
కిష్టమైన మోక్షపదములిమ్ము వేంకటేశ్వరా!! ॥ 23

అమేఘమైన నెండమావులం చెఱుంగకే జల
భ్రమన్ జనేటి లేటిఁబోలె ప్రజ్ఞలేకయజ్ఞుఁడై
సమస్తమాత్మగా నెఱుంగఁజాల కూరకే జగ
ద్భ్రమన్ జెడున్ నరుండు సుప్రభావ వేంకటేశ్వరా!! ॥ 24

దారినేఁగు వేళ నొక్క త్రాడు గన్నచో భ్రమన్
బారి సర్పభీతి నొందు పందరీతి మాయచే
కోరి తానె జీవుఁడంచుఁ గోఁచవారి నీచ సం
సారభీతి నొందు నాత్మ సామి వేంకటేశ్వరా!! ॥ 25

నా మనంబునందు నీవు నన్నుఁ బాయకుండగా
నీ మహత్వ మే నెఱుంగనేర కజ్ఞుఁడై భ్రమన్
భూమిలోనఁ బుట్టిపుట్టి పోయి పోయి చూచితిన్
స్వామి నిన్నుఁ జూపవే ప్రసన్న వేంకటేశ్వరా!! ॥ 26

ఉర్వీమీఁద వెఱ్ఱిగాము వోలె సంచరించినన్
పర్వతంబుమీఁదఁ బెద్దపాముురీతి నుండినన్
గర్వి నీ నిజంబుగన్న గాని ముక్తిఁ బొందునా
సర్వలోకనాయకా ప్రసన్న వేంకటేశ్వరా!! ॥ 27

అసత్యమైన దేహమందు నాసపుట్టె వెఱ్ఱినై
వసుంధరం జనించి దుఃఖవార్ధిలో మునింగితిన్
ప్రసన్నరూప సద్వివేక భక్తిముక్తి సౌఖ్యముల్
ఒసంగఁగా భవత్కటాక్ష మోపు వేంకటేశ్వరా!! ॥ 28

తనందెయున్న దిజ్జగంబు తన్వినా జగంబు లే
దనెంచి నిత్యమున్ సమస్త మంతరంగదృష్టిచే
ఘనంబు దోప నొక్కరూపుగానె చూచునట్టి స
జ్జనుండె రాజయోగి సామి వేంకటేశ్వరా!! ॥ 29



మృత్తికందుఁబుట్టినట్టి మెండుకుండలన్నియున్
మృత్తిక న్వినాను నుర్వి మీఁదలేని పోలికన్
సత్తునుండి తోఁచునట్టి సర్వనామరూపముల్
సత్తుకున్ వినాగ లేవు సామి వేంకటేశ్వరా!! ॥ 30

పొల్లులేని ధాన్యరాశి పొట్టువీడ రోఁకటన్
ఎల్లవారు దంచి బియ్యమెత్తుకొన్న లాగునన్
కల్ల మాయ దోఁప నిర్వికారమైన బ్రహ్మమున్
ఉల్లమందుఁగన్నవాఁడె యోగి వేంకటేశ్వరా!! ॥ 31

ఈ ధనంజయోపమాను లీ వృథాభిమానులున్
ఈ ఘనాతపస్వరూపు లీ రవిప్రతాపులున్
ఈ ధనాభిలాషులున్ మఱీ ప్రచండభాషులున్
ఈ ధనంబు లీ ఘనంబు లింద్రజాలమే హరీ!! 32

ఈ మహాప్రజల్పముల్ మఱీ ప్రసూనతల్పముల్
ఈ మఖాదికర్మముల్ మఱీ సమస్తధర్మముల్
ఈ మహామహత్త్వముల్ మఱీ పురందరత్వమున్
ఈ తపంబు లీ వ్రతంబు లింద్రజాలమో హరీ!! ॥ 33

ఎంగిలంగనాధరంబు లెంగి లావుపాలు నిం
కెంగిలన్ని వస్తువుల్ మహీతలాదిభూతముల్
ఎంగి లీ సమస్తమున్ను యెంగిలం చెఱింగియున్
యెంగి లెంగి రందు రేభ్యులీశ వేంకటేశ్వరా !! ॥ 34

కూటిమీఁది యాస తొల్తఁ,గూడు కల్గు పిమ్మటన్
హాటకంబు మీఁదియాస, హాటకంబుగల్గినన్
బోటిమీఁదియాస దీని బూడిదైన బుద్ధికి
ట్లేఁటి యాసపెట్టితో,రమేశ వేంకటేశ్వరా!! ॥ 35

బట్టబయలె యాత్మ గాలె ప్రాణవాయు వగ్నియే
వెట్ట శీతమయ్యె నీరు విస్తరింపఁ గేశవా!
వట్టి మన్నె దేహమెన్న వ్యర్థమైనదే సుమీ
యిట్టివే దశేంద్రియంబు లీశ వేంకటేశ్వరా!! ॥ 36

బొజ్జకైన పాటులన్ని బొమ్మలాటలే సుమీ
లజ్జలేని కాపురంబులన్ని స్వప్నముల్ సుమీ
సజ్జనాప్తబంధుకోటి సంతకూటమే సుమీ
యిజ్జగంబు వేంకటేశ యింద్రజాలమే సుమీ!! ॥ 37

కన్నకన్ననీళ్లలోనఁగాయ మేను ముంచుటల్
యెన్నియెన్ని గట్లచెట్ల కేను చుట్టివచ్చుటల్
వన్నెవన్నెకాళ్ల కేను వంగివంగి మ్రొక్కుటల్
నన్ను నేను గన్న వెనుక నవ్వులాయె నో హరీ!! ॥ 38

మోహనాంగి నంచు వచ్చి మ్రోల నిల్వ మాయయున్
ద్రోహి యంచుఁగానలేక దొడ్డసౌఖ్య మంచునో
ఊహ నేఁదలంచి నమ్మి యుర్విఁ బడ్డ దుఃఖముల్
హా!హరీ యదేమి చెప్పుదయ్య వేంకటేశ్వరా!! ॥ 39

పదరి చెదరి చంచలించు ప్రాణవాయువుల్ సదా
కదల మెదలనీక పట్టికట్టి నేర్పుగల్గినన్
ముదిమి గదిమి వృద్ధుఁడున్న ముద్దుబాలుఁడై కడున్
పొదలు వదలునెదలు దివ్యభోగి వేంకటేశ్వరా!! ॥ 40

విప్పుగొప్ప కన్నులున్ వివేకసౌకుమార్యముల్
మెప్పునొల్పు నాటపాటమెల్పు ప్రేమకార్యముల్
ఒప్పు మోహనాంగి చెల్మి నొద్దనుండి వేఁడినన్
ఒప్పకున్న వాఁడె రాజయోగి వేంకటేశ్వరా!! ॥ 41

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## శ్రీవేంకటేశ్వర దండకము

శ్రీమద్రమాకాంత కాంతోరురత్నప్రభాభాను సాహస్రదీవ్యత్కిరీటా జగత్ప్రాణిచింతా ఘనధ్వాంతవిధ్వంస సంపూర్ణచంద్రార్కబింబద్యుతి స్నిగ్ధబద్ధోజ్వలత్కుండలా పుండరీకోద్భవాఖండలేశాన ముఖ్యామరానంద సందోహసంధానకృద్భుంఫుమధ్వాన రాకేందుశోభాభిరమ్యాబ్జహస్తా సురద్విట్ఛిరశ్ఛేదనోదార ధారాపరిస్ఫూర్తి నక్రాంగవిచ్ఛేద చక్రాయుధా దానవవ్రాత నిర్ధాననోద్యద్గదాదండ ఖడ్గోజ్వలత్కాండకాండాసనా యిందిరావాస వక్షో వినిక్షేపితాదర్శవత్కామనీయోజ్వల త్కౌస్తుభాలంకృతా భక్తసస్యావళీ భాగ్యవర్షోదితాసక్త నీలాభ్రసంభా సమానాంగ సంఛన్న విద్యుత్కనత్కాంచనోదార దివ్యాంబరా నారదారాధితా నీరజాతేక్షణాసార వేదాంతవిస్తార సౌధస్థితాదేవదేవామహాదేవ వంద్యాజగత్పావనాలోక సంభావనాగణ్య! పుణ్యోదయా! ఓ దయావేశ! శ్రీశేషశైలేశ! శ్రీవేంకటేశా! భవద్దాసదాసానుదాసుండ నో దేవ నీ వే గతింబ్రోచెదో యెట్లు రక్షించెదో నీదు చిత్తంబు నా భాగ్యమీ వే దయాదృష్టిరావే కృపం గావవే భక్తచింతామణీ! మీ యనంతావరంబులన్ మీ చరిత్రంబులన్ విన్నవింపగ నే నేర్తునే పన్నగాధీశతల్పా భవద్భవ్య మాహాత్మ్యముల్ దివ్యమౌనుల్ సురాధీశ నాగేశ వాగీశులెన్న న్వితర్కింప లేరైన మీ దివ్యనామంబు లెవ్వేళలన్ వర్ణనల్ సేయు భూదేవముఖ్య ప్రసాదంబునన్ మీ కటాక్షంబునన్ నేర్చినట్లేఁ బ్రశంసింతు నాకుం బ్రసన్నుండవై నన్ను మన్నింపవే కన్నతండ్రీ సుపర్వాద్రిలీలన్ విడంబించు శ్రీవేంకటాగంబునందుండి నిత్యోత్సవశ్రీలఁజెన్నొంది మైసూరి శ్రీచిక్కదేవక్షమాపాలుపాలన్ బ్రసన్నుండవై కామితార్థంబులన్ బ్రేమతో నిత్తునం చా మహారాజురాజ్యంబునన్ మేటియౌ కోటయై యొప్పులం దెప్పరంబైన యప్పామలూరీపుర ప్రాంతసీమా మహోదారమందార బృందంబులున్ జందనాశ్వత్థామా కందసాలంబులున్ గేతకీ చంపకవ్రాత

భల్లాతకీ చూతపోతంబులున్ దాలతక్కోల హింతాలజాలంబులున్ బూగ పున్నాగ జంబూపలాశంబులున్ నింబ రంభాకపిత్థంబులున్ ద్రాక్షరుద్రాక్ష ఖర్జూర తాంబూల వల్లీ లవంగంబులున్ నాళికేరాది నానావనీజాత సంతానముల్ కంతుసేనాపరిశ్రాంతి వారింపుచున్ వింతపుష్పంబు లావిర్భవంబంది శ్రీకాంతకున్ స్వాంతహారంబులై సంతతంబున్ దగం గాచి నిండారఁగాఁ బండి వెండైన లేదోఁవులున్ జక్రవాకీ బకస్వచ్ఛహంసావళీ కుక్కుటానేక కోయిష్టికీరంబులున్ గేకి పైకాది నానావిహంగంబులున్ సింహ, శార్దూల,దంష్ట్రీభ,భల్లూక ,గోకర్ణ, శాఖా,మృగేంద్రాది నానామృగానీకముల్ జోకలై యుండు పెన్గోనలన్ గానలన్ హీరగోమేధికస్ఫార వైడూర్య మాణిక్య చంద్రోపలేంద్రా శ్మసాంద్రోరు ముక్తాలసద్విద్రుమానీక సత్పుష్పరాగంబులన్ హెచ్చులౌ పచ్చలన్ మెచ్చులై యెచ్చటన్ జూచినన్ ముచ్చటల్ నించు శైలోచ్చయ స్థానముల్ జాతి సేవంతి వాసంతికా మల్లికా వల్లికల్ పెల్లుగా నల్లి యుల్లంబులన్ జల్లసేయం గళాసిల్లి భాసిల్లు కుంజంబులన్, దుమ్మెదల్ గ్రమ్మఱం గమ్మగాఁ ద్రిమ్మఱన్ ఘమ్మనం బూచి బల్మిమ్మరంబైన పూరెమ్మలన్ జిమ్ము చొక్కమ్ములౌ కమ్మఁదేనెల్ ప్రసాదమ్ములై యిమ్ములన్ నిండి పెల్లేఱులై పాఱ నేపారు పూఁదోఁటలన్ నీటుగా నొప్పు నచ్చోటికిన్ మీరు వేంచేయుటంజేసి భవ్యప్రభన్ నవ్యశేషాచలంబంచు నెంచంగ విఖ్యాతమౌ పట్టణంబయ్యె నందందమౌ నిందుకాంతాశ్మరశ్మిన్ బ్రకాశమ్ములౌ మంటపవ్రాతముల్ మింటితో రాయుచున్ జంటలౌ గొప్ప రాచప్పరాల్ చారుసౌధంబులున్ శ్రీకాకరంబైన ప్రాకారమధ్యంబునన్ హేమధామంబునన్ నిల్చి భక్తాళికిన్ గామనీయ ప్రదుండై మఱిన్ జోళ నేపాళ బంగాళ కర్ణాట కాంధ్రాది ఛప్పన్న దేశప్రజల్ అప్పనిన్ గొల్వఁగాఁ దెప్పలౌ కానుకల్ గొప్ప ముత్యంబులున్ మాడలున్ రూకలున్ మంచివస్త్రంబులున్ వడ్డికాసుల్ వరాల్దొడ్డుగాఁ గొంచు నల్దిక్కులం



బిక్కటిల్లంగ సాంద్రంబులౌ సింధురేంద్రంబులన్ స్యందనాందోళికా సైంధవాశ్వంబులన్ బొందుగా నెక్కి సామోదులై వచ్చు భూపాలకుల్ భూసురక్షత్రవిట్పాదజ వ్రాతముల్ గీరు గంధమ్ములన్ జారు చేలంబులన్ గోర మీసంబులన్ జిట్టి తాళంబులన్ బట్టె నామంబులన్ మీసరంబైన వేసంబులన్ వేసటల్ మాని గోవింద గోవింద గోవింద యన్ దాసరుల్ తమ్మటౌఘధ్వనుల్ ధిమ్ముధిమ్మంచు మ్రోయన్ వెసన్ బెక్కులౌ మ్రొక్కుబళ్లన్ ముదంబెక్కు పెన్మక్కువన్ వచ్చు నల్జాతి నానా నరశ్రేణిచే జాతరై యొప్పుచో సారమైనట్టి కోనేరన్ గీర్తివిస్తారమై యొప్పు కాసార రాజంబునన్ నవ్యకల్లోల ఫేనంబులన్ నర్తనంబొప్పు నావర్తముల్ గల్గి బల్బుగ్గలన్ వెగ్గలంబైన యుర్విన్ జనుల్ చూడఁగా దివ్యగంగానదీ తీర్థముప్పొంగుచో సేవ్యమౌ నిష్ట సంసిద్ధిదంబంచు సంప్రీతచేతస్కులై వేద వేదాంగ సంవేదులౌ విప్రులున్ విష్ణుతత్వజ్ఞులౌ వైష్ణవోత్తంసులున్ దీర్థరాజంబునన్ బ్రార్థనల్ సేయుచున్ గీర్తనల్ పాడుచున్ స్నానసంధ్యాద్యనుష్ఠానకృత్యంబులం దీర్చి శ్రీవాసుదేవార్చనల్ సేయ శాల్యన్న సూపాజ్యభక్ష్యాది భోజ్యంబులన్ వారలన్ దృప్తులంజేసి రంతన్ దివానాథజాతాఖ్య నొప్పారు నవ్వానరోత్తంస సాయాంతవేళన్ గరుత్మంతవాహోత్సవంబంతఁ జెల్వొంది శృంగారమై హారి కేయూర హారాది భూషావళుల్ దాల్చి పేరాణిముత్యంబు చౌకట్లు కర్ణంబులంబెట్టి రంగుల్ దొరంగించు బంగారుచేలంబు చుంగారుగాఁగట్టి చొక్కమ్ములౌ కమ్మతావుల్ గుభాళించు పూదండ లొక్కుమ్మడిన్ గంఠపీఠం బునన్ వైచి మేలైనకస్తూరి ఫాలమ్మునందిద్ది రత్న ప్రభా భాసురంబైన కోటీరరాజంబు శీర్షంబునన్ మించుహర్షంబుతో నుంచి శ్రీవక్షుఁడై శంఖచక్రంబులం బట్టి పక్షీంద్రుపై నెక్కి యక్షీణరోచుల్ దిశాంతంబులం బర్వఁదిర్వీధికిన్ సొంపు దీపింప వేంచేయు వేళన్ నభస్సౌధపాళీ సుపర్వాంగనాళుల్ ముదంబంది మందారసూనంబు లందంద వర్షింపగాఁ

గోట్లసంఖ్యైన దివ్వట్లు నిశ్రేణికాదీపికల్ గంధకజ్యోతు లిర్వంకలన్ జీకటిన్ నూకి మధ్యాహ్న భావంబుదీపింప జేయంగ భేరీమృదంగాద్యుదారధ్వనుల్ మ్రోయ భమ్మంచు శంఖమ్ము లొప్పైమ్మె నినాదింప హెగ్గాళియల్ బెగ్గిలం బల్కఁ దీర్ఘైన కర్ణాటవీరుల్ తుటారింప తోరమ్ములౌ కొమ్ములీ రిమ్ములన్ మ్రోయ ధింధింధిమిధ్వానమై తమ్మటమ్ముల్ పురోగమ్ములై యొమ్మఁ బెన్నాద మొప్పార తప్పెట్లు చే చిట్టితాళంబులం బట్టి కోణంగి దాసర్లు రాణింపగా నాడఁజెంతన్ లసన్నాట్యశాలాంగనల్ తాళగానాదులన్ గేళికల్సూప శ్రీవైష్ణవుల్ చెంగటన్ ద్రావిడామ్నాయముల్ తేవ వాచింప దండెల్ మఱిన్ గంచు తాళంబులం బట్టి సూళాది నామావళుల్ హేళమై నాడుచున్ వీడు జోడొప్పఁగాఁ బాడు వైతాళికుల్ గల్గి శ్రీవేంకటేశా సురేంద్రస్తుతా హే పరా కంచు నంచంచలన్ గంచుకుల్ పల్క నాయాసముల్ మాని తాడించు నప్పంచవాద్యధ్వనుల్ దిక్కటాహంబులం దొక్కటన్నిండి ఘోషింప భూమండలేశుల్ వెసన్గండుమెండైన శుండాల తండంబులన్దేజుతో నోజలౌ తేజులన్ రాజసంబొప్పగా నెక్కి యగ్ర ప్రదేశంబునన్ గుంపులై సొంపు మీఱంగ నేతేర బల్చాలుగాఁ బట్టు సెల్లాల వట్టంబులున్ గుందనచ్ఛత్ర సందోహముల్ చామర వ్రాతముల్ నిండి దండ న్విరాజింప సాంబ్రాణికాధూపసంఘంబు వాసింప కర్ణాటక ద్రావిడాంధ్ర ప్రజాకీర్ణవర్ణార్ణవోదీర్ణఘూర్ణస్వనంబుల్ ప్రపూర్ణంబులై యెల్లెడం బెల్లుగా నిండి రంజిల్ల నిట్లొప్పు నప్పట్టణశ్రేణులందెల్ల వేంచేసి దేవాలయద్వారదేశంబునన్ నిల్చి నాగారివాహంబు వేగంబునన్ డిగ్గి బంగారుమున్మంటపంబందు వేడ్కల్ తరంగింప నాసీనులై షడ్రసాన్నంబులున్ బంచకజ్జాయముల్ పక్వమైనట్టి నానాఫలంబుల్ నివేదింప నామోదముం జెంది కర్పూరవీడెంబులర్పింపఁగా నంది యార్త ప్రజాపాలనంబొప్పఁ గావించి సంతుష్టచిత్తంబునన్ రత్నసౌధంబునన్ నూత్నజాతి



ప్రసూనోజ్జ్వలంబైన పర్యంకవర్యంబునం దిందిరం గూడి క్రీడా వినోదంబులన్ వేడుకల్ గాంచు శ్రీవేంకటేశా భవద్భక్తుండం గాన నా విన్నవింపంగ నైనట్టి యీ దండకంబందు న్యూనాతిరిక్తాప శబ్దక్రియా హీనముల్ గల్గినన్ దోషముల్ మాన్చి మాపాలి వేల్పైన శ్రీరామ చంద్రుండవై నీవె కైకొమ్ము మీకున్ సమర్పింప నే నెవ్వఁడన్ సర్వలోకాత్మకా సర్వభూతాత్మకా సర్వగా శర్వరీనాథ కంజాప్తనేత్రా భవ న్నవ్యచారిత్రముల్ గల్గి చెల్వొందు నీ దండకం బెవ్వరే విన్న వర్ణించినన్ వ్రాసినన్ సంత తాయుష్యముల్ చాలసౌభాగ్యముల్ పుత్రలాభంబులున్ మిత్రసందోహముల్ రాజపూజ్యంబు లారోగ్యముల్ నిత్యమాంగల్యముల్ నిత్యసంతోషముల్గల్గి యుండం గటాక్షించితౌ నన్ను రక్షించితౌ పన్నగారిధ్వజా యిందు తారార్కపర్యంత మీ దండకం బందమై భూతలంబందుఁ జెన్నొంది యుండంగఁ బాలింపుమీ యిందిరానాయకా మందరోద్ధారకా భక్తమందార తుభ్యం నమస్తే నమస్తే నమస్తే ॥

# శ్రీవేంకటేశ్వర లఘుకృతులు

## శ్రీవేంకటేశ్వర దండకము

శ్రీమద్రమానాథ సేవా సమాయాత దేవాసుర వ్రాతమాణిక్యమౌళి చ్ఛటా కాంతిజాల స్ఫుటీభూత నైజాంఘ్రి కంజాతయుగ్మంబు మన్మానసాంభోజ కింజల్క పీఠస్థలిన్ నిల్పి యుష్మత్ కృపాలబ్ధమాధ్వీక మాధుర్య వాక్చాతురిన్ జాల వర్ణించెదన్ నీవు వారాశిమధ్యంబునందుండి దిఙ్మండల వ్యాప్త చండప్రభా భాసమానుండవై యున్న దైత్యారి నీ నాభికంజాతుఁడైనట్టి యా ధాత కౌతూహలం బంద డెందంబులో నెంచ మత్స్యాకృతిన్ మించి యబ్ధింబ్రవేశించి యా వీర దైత్యోగ్రవంశాంబుధిన్ సోమునిన్ సోమునిన్ ద్రుంచి మోదంబునన్ నాల్గువేదంబులన్ దెచ్చి వాగ్భర్తకున్ గర్తవైయుండి రక్షింపవే, పిమ్మటన్ మేటితామేటి వేసంబునన్ మందరాధారమౌ తోరమౌ భారమున్ దాల్చి మేల్ సూకరాకారమున్ బూని నక్రాదులన్ జాల ఘోరంబునున్ భీకరంబైన వారాశిలోఁజొచ్చి దుర్వార గర్వోద్ధతుండౌ హిరణ్యాక్షు మర్దించి విశ్వంభరాభారమున్ గోర ముంగోఱ వేదాల్చి చంచద్గతిన్ మిక్కుటంబైన మేలుక్కు కంబంబునన్ దిక్కులన్ బెక్కు కాంతుల్ నితాంతంబుగన్ నిండ నుద్దండతన్ నారసింహాకృతిన్ బొందుగాఁ జెంది పంచాననం బుగ్రవేగంబుతో ధీరతన్ కుంభికుంభస్థలిన్ జించి చెండాడు చందంబునన్ మత్తదైత్యేంద్రుకుక్షిన్ విదారించి ప్రహ్లాదు నాహ్లాదమున్ జేయవే, వామనుండై బలిన్ గిట్టి పాదంబునన్ మెట్టి దట్టించి పాతాళమున్ జేర్చవే, జామదగ్న్యుండవై రాజలోకంబు ముయ్యేడు మాఱుల్ కుఠారాగ్రధారాహతిన్ దున్మి తూఁటాడవే కోటికందర్ప లావణ్యధి క్కార కృద్దివ్య తేజోవిరాజుండవై, భానువంశాగ్రగణ్యుండవై రామచంద్రుండవై దేవసంఘంబులన్ గావ నా రావణున్ లోకవిద్రావణున్ దండిమత్తేభ మంభోజముల్ ద్రుంచుభంగిన్ దురంబందు శేవిన్ విభాళింపఁగా నేసి యుద్గాఢమౌ మస్తకంబుల్ తెగన్ దున్మి లోకైక విఖ్యాత సీతాముఖోద్భూత సీతా సమేతుండవై, వేడ్క సాకేతపట్టంబునున్ జేరి పట్టాభిషిక్తుండవై మీఱి



లోకంబులన్ గావవే, దేవకీగర్భ సంభూతుఁడై చెన్నకల్యాణ కృష్ణాభిధానంబునన్ రుక్మిణీ సత్యభామాది గోపాంగనా చిత్తకంజాత మిత్రుండవై యుండవే, స్నిగ్ధబౌద్ధస్వరూపంబునన్ యాగభాగంబులన్ నీవు వాదార్చి కల్క్యావతారంబునన్ పారసీకాది దౌర్జన్యసంఘంబులన్ ద్రుంచి సద్భక్తసంతానసంతానభూజోపమానుండవై యొప్పి శ్రీ శేషశైలాగ్ర వాసుండవై యొక్కనాఁడుల్లమందుల్లసిల్లంగ దేవాంగనానీత గాంగేయ కుంభాంతరన్యస్త దివ్యాంబుపూరంబునన్ రంగుగా మంగళస్నాన మున్‌జేసి శృంగారమై తళ్కుబంగారు చేలంపుఁజుంగుల్ చెలంగన్ నిజాంగంబునన్ హౌసు గావించి నిర్యత్న నిర్యత్ ప్రభాజాల సద్రత్నకోటీరమున్ నీటుగాఁ దాల్చి బాలేందు సంకాశఫాలస్థలీన్యస్త కస్తూరినామంబుచే శిస్తు మీఱంగఁజెల్వొంది శ్రీకారవర్ణోపమానంబులై యున్న కర్ణంబులన్ స్వర్ణసత్కుండలోద్భూత కాంతిచ్ఛటల్ గండపాలిన్ బ్రసారింపగా భాసురోదారతారాభహీరాది సన్మౌక్తికోదారహారమ్ము లా కంధరంబంది సొంపొందఁ గీలించి నిర్వక్రతన్ దైత్యచక్రంబులన్ విక్రమాటోపతన్ వ్రక్కలించేటి చక్రంబు దుర్వృత్తమత్తారి దైన్యాతి దైన్యస్థితిం గూర్ప నున్నట్టి వెన్నుండవై నిన్ను చెన్నొందగాఁజూచు చింతామణీభామ నేమే విలోకాక్షి సేబాసు నీ సద్గుణవ్రాతమెన్నంగ ముమ్మాటి కే చోటులన్ దీటు రానేరదే యంచు తాఁగట్టిగా కౌగిటంజేర్చి మోవాని పల్ కెంపులన్ బారవశ్యంబు నొందించి చౌసీతిబంధంబులన్ జాల రంజిల్లగాఁజేసి సంతోష సౌఖ్యాబ్ధిలోఁ దేలుచున్ లేచి చింతామణీభామతోఁ గూడ సానందతన్ అండజాధీశుపై నెక్కి ముఖ్యాశ్రితానేక సద్భక్తసందోహముల్ గొల్వ రంజిల్లగా వచ్చి పంద్రాన్వయాంభోధి సంభూత కల్పద్రుమాకల్పు హేమాద్రిరంగేంద్రు సన్మందిరావాసివై చాలఁబోషింపుచున్నుండి కల్యాణ కృష్ణ స్వరూపంబు నన్ బొల్చు శ్రీ వేంకటేశా! రమేశా! కృపాదృష్టితోఁజూచి రక్షింపవే మమ్ము నీ దండకంబుర్వి నా చంద్రతారార్కమై యుండు శ్రీశా నమస్తే నమస్తే నమః.

# శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

## శ్రీరమాపరిణయము

శ్రీవేంకటేశ్వరుఁజిత్తమందుంచి
భావించి తరిగొండపతిని బూజించి
శ్రీభారతిని హయగ్రీవునిఁ దలఁచి
ప్రాభవంబున గురుఁబ్రస్తుతిచేసి
కరమర్థితో రమాకల్యాణసరణి
తెరగొప్ప రచియింతు ద్విపదకావ్యముగ
ఘనమైన తత్కథాక్రమమెట్టిదనిన
వినరయ్య కవులార! విద్వాంసులార!!

### నారాయణుని దేవతలు ప్రార్థించుట

నారాయణుఁడు జగన్నాథుఁ డచ్యుతుఁడు
క్షీరవారిధియందు శేషతల్పమున
యోగ నిద్రారతి నురుతరానంద
సాగరమగ్నుఁడై శయనించి యుండ
అపుడచ్చటికి శంభుఁ డజుఁడు దేవతలు
తపసులు వచ్చి మోదంబు దీపింప
ముకుళితహస్తులై ముందఱ నిలిచి
యకలంకభక్తి నిట్లనిరి వారెల్ల
దేవ దేవ సమస్త దేవతారాధ్య
నీవింక నీ యోగనిద్ర మేల్కొనవె
పరమాత్మ మమ్మెల్లఁ బాలించుకొఱకు
నిరుపమంబగు యోగనిద్ర మేల్కొనవె
యనుచుఁబ్రార్థింపఁగా నాదివిష్ణుండు
కనువిచ్చి యందఱఁగలయ వీక్షించి



మందస్మితాస్యుఁడై మహితాత్ములార!
యెందుకు వచ్చితి రిచ్చోటి కనిన
పరమాత్మ! మీ దివ్యపాదపద్మములు
సురుచిర భక్తితోఁ జూడ వచ్చితిమి
మమ్ము మన్నించి మా మనవి పాలించి
సమ్మతంబుగ విను సత్యసంకల్ప!
నిరత మిట్టే యోగనిద్ర నుండినను
శరణాగతుల నేలు సరణి యెట్లగును
సర్వజ్ఞుఁడవు సర్వశక్తియుక్తుఁడవు
నిర్వాణమయుఁడవు నిర్వికారుఁడవు
కావున నీ పాదకమలద్వయంబు
భావించి నిన్నాత్మపతిగాఁ దలంచి
సహజమౌ నీ శుద్ధసాత్విక కళయె
మహనీయతపము సమ్మతముగాఁజేసి
పనిఁబూని జలరాశిపట్టియై పుట్టి
యొనర నిన్నే కోరుచున్న దిచ్చోట
నీ వా మృగాక్షి పాణిగ్రహణంబుఁ
గావింపవే నిత్యకళ్యాణ యనిన
నవ్వుచు తరిగొండనరహరి వేడ్క
నివ్వటిల్లఁగ వారినిం జూచి పలికె:

### నారాయణుని యనుగ్రహోక్తి

గరళకంధర పద్మగర్భాదులెల్ల
సరవిని వినుఁడొక్క సరణిఁ జెప్పెదను
భూలోకమున శేషభూధరమందు
నే లీల దీపింప నిలిచి యచ్చోట

వేంకటేశ్వరుఁడన విఖ్యాతిఁ బొంది
పొంకంబుగా నుందు భూపాలుకరణి
మచ్చిక నలమేలుమంగాభిధాన
మిచ్చి సంప్రీతి నా యిందిరాసతిని
నే శీఘ్రముగను పాణిగ్రహణంబుఁ
జేసెదనని పల్కిఁ చిఱునవ్వు నవ్వి
గుఱుతుగా వారి వీడ్కొని ముదంబెసగ
పరమాత్ముఁ డందుండి పెనమై వచ్చి

## శ్రీహరి వేంకటాద్రికి విచ్చేయుట

శ్రీ వరాహస్వామి చేకొనియున్న
శ్రీవేంకటాద్రిపైఁ జేరి వేడుకను
అప్పుడు శ్రీవరాహస్వామి నడిగి
తప్ప కా క్షేత్రంబు తా నాక్రమించి
నలువొప్పఁ దరిగొండ నరసింహుఁడనఁగ
విలసిల్లుచుండె శ్రీవేంకటేశ్వరుండు.

## శ్రీహరి, బ్రహ్మాదులను క్షీరాబ్ధికడకుఁ గన్యనడుగఁబంపుట

అంత నచ్చటికి బ్రహ్మాదులు వచ్చి
సంతోషచిత్తులై చక్రి నీక్షించి
వేదాంతసూక్తుల వినుతింప నగుచు
నాదినారాయణుండట వారి కనియె
నో పంకజాసన ! యో ఫాలనయన !
యో పాకశాసన! యో మౌనులార!
చెలఁగుచు మీరు వచ్చిన చందమెల్లఁ
దెలిసెను మీరింకఁ దీవ్రంబుగాను



క్షీరవారిధిఁజేరి శ్రీరమాసతిని
నే రీతినైన నా కిమ్మని యడిగి
నిరుపమలగ్నంబు నిర్ణయించుకొని
సరగున రమ్మన్న సంతసంబంది
హరియాజ్ఞ వడసి వారరుగుచుండగను
పాలగరుడి దీర్చి పచ్చని ప్రాని
పైలీలతో వెంటపట్టఁగాఁ జూపె
అదిమొదల్ శకునంబు లతిదివ్యములుగ
మది కిష్టముగనయ్యె మార్గంబునందు
అందుకు సంతోష మధికంబుఁ గాగ
నంద రాక్షీరాబ్ధి కరిగిన లేచి
వారికి నెదురుగా వచ్చి సాగరుఁడు
కూరిమి మీఱఁ దోడ్కొనివచ్చి నగుచు
మురియుచు మణిపీఠములమీఁద నుంచి
యిరవొందఁ బూజించి యిట్లని పలికె.

## సముద్రుని సంప్రశ్నము

వరుసఁగా బరమపావనులార! నన్ను
కరుణించి వచ్చినకార్య మే మనిన
విని వారలంద రావిమలమానసుని
గనుఁగొని పల్కిరుత్కంఠ నిట్లనుచు.

## బ్రహ్మాదులు కన్యనడుగుట

వనరాశి యొక శుభవార్త చెప్పెదము
వినవయ్య నీ వది విశదంబుగాను
రహిమీఱ నాదినారాయణుం డిపుడు

మహియందు నత్యంతమహిమ దీపింప
అరుదైన వేంకటేశాభిధానమున
నెరసి శేషాద్రిపై నిలిచి యున్నాఁడు
అతనికి నీ పుత్రియగు రమాసతిని
హితమొప్ప నడుగ మే మిటకు వచ్చితిమి
అనిన ధన్యుఁడనైతినని సాగరుండు
మనమున నుప్పొంగి మధుసూదనునకు
నిచ్చెద మత్కన్య నిపుడన్న వారు
మచ్చిక నతని సన్మానంబుఁజేసి
లలితమైన వివాహలగ్న మేర్పఱిచి
జలరాశి యొసఁగిన సకల వస్తువులు
చెలువొందఁ గైకొని శేషాద్రిఁజేరి
జలజాక్షునకు మ్రొక్కి సరవి నిట్లనిరి

## బ్రహ్మాదులు స్వామికి వివాహనిశ్చయ మెఱిఁగించుట

స్వామి సాగరుఁడు శ్రీసతిని మీ కొసగఁ
గామించుచున్నాఁడు ఘనభక్తి మీఱ
నటుగాన మిమ్ము నెయ్యంబుతో నిపుడె
తటుకునఁబెండ్లికిఁ దర్లి రమ్మనియె
అన విని తరిగొండహరి నవ్వి వారిఁ
గనుఁగొని పల్కె నుత్కంఠ దీపింప

## పెండ్లిపయనము

పనిఁబూని శంకరబ్రహ్మాదులార!
పెనుపొందఁగాను నా పెండ్లికి మీరు
పరఁగ మీ మీ కుటుంబంబులతోడ



సరగున రమ్మన్నఁజని వారలపుడు
తమ తమ సతులతో తమ కుమారులతో
తమ తమ పరివారతతులతో మగిడి
వచ్చినవారితో వరలగ్నమందు
హెచ్చుగా విహగేంద్రునెక్కి యచ్యుతుఁడు
సరవి ననంతవిష్వక్సేనముఖ్య
పరివారవితతి సద్భక్తితోఁ గొలువ
ముదమొప్ప విఖనసముఖ్యసంయములు
విదితంబుగాఁ బరివేష్టించి పొగడ
హరవిరించి సురేశ్వరాదులు చెలఁగి
విరవిగాఁ బద్మాక్షువెనువెంటఁ జనఁగ
వరుసగా ఘనశుభవాద్యముల్ మొరయ
తఱచైన మంగళద్రవ్యాళితోడఁ
జని చని యా క్షీరజలరాశి చెంత
ఘనముగా నిలిచె నా క్రమము సాగరుఁడు

## వరపూజ

విని తన పరివార వితతులతోడఁ
దనరార శోభనద్రవ్యముల్ గొనుచు
దొరకొని మంగళతూర్యముల్ మ్రోయ
నరుదుగా దారపుత్రాదులతోడ
నలువొప్ప తరిగొండనరసింహుఁడైన
సలలిత వేంకటాచలనివాసునకు
హెచ్చిన భక్తితో నెదురుగా వచ్చి
నచ్చుఁగా దగు పూజలచటఁ గావించి
అందుండి బ్రహ్మరుద్రాదులతోడ

పొందుగా హరి నాత్మపురమున కపుడు
తొడుకొనిపోయి బంధుజనంబుతోడ
విడుదులలో నుంచి వేడ్కతో నంత
సహజలీలలఁ బరిచారకుల్ చెలఁగి
రహిమీఱఁ బచ్చతోరణములతోడ
మురువొప్ప ముత్యాల ముగ్గులతోడ
తరుచైన వింత చిత్తరువులతోడ
క్రమముగా నగరు శృంగారంబు చేసి
విమలమౌ కల్యాణవేదిక నిండ
తలకొని మంగళద్రవ్యంబు లుంచి
పెలుచ బంగరుపెండ్లిపీఁటలువెట్టి
కరమొప్ప ముత్యాలగద్దెలందుంచి
పరువడి రత్నకంబళములఁ బఱచి
హరిరాక గోరఁగా నప్పుడందుండి
వరరత్నభూషణావళు లంబరములు
ధరియించి తోడ ముత్తయిదువల్ రాగ
గురుతుగా ముత్యాలగొడుగుల నడుమ
ఘనతరంబుగ గంగ గౌతమి యమున
అనుపమ తుంగభద్రాదు లైనట్టి
వననిధిభార్యలు వరవైభవముల
ననురాగమున శోభనాక్షతల్ గొనుచు
సలలిత వాద్యఘోషంబులతోడ
వెలయగా హరియున్న విడిదికి వచ్చి
కమనీయభక్తి నా కమలలోచనుని
సముచితక్రమములఁ జాలఁ బూజించి
రహిమీఱఁ గుసుమహారము కంఠమందు



విహితంబు గావించి వేడ్క రెట్టింప
తక్కినవారిని తగఁ బూజ చేసి
మక్కువ దీపింప మఱి యిట్టులనిరి.

### పేరంటము పిలుపు

రయమున మా మందిరమున కో గిరిజ!
ప్రియమొప్ప రావమ్మ పేరంటమునకు
రామాలలామ భారతి నీవు వేగ
ప్రేమతో రావమ్మ పేరంటమునకు
మునివధూమణులార!ముచ్చటమీర
పెనుపొంద రారమ్మ పేరంటమునకు
సిరి నొప్పచుండు శచీదేవి నీవు
పెరిమితో రావమ్మ పేరంటమునకు
తెఱఁగొప్పఁదక్కిన దిక్పాలతతుల
మురిసి పేరంట మిమ్ముల మీరు రారె
గరుడగంధర్వాది కామినీమణులు
మెరసి పేరంటంబు మీ రెల్ల రారె
అని వారు పేరంట మందఱిన్ బిలువ

### పెండ్లియేర్పాట్లు

నొనర సాగరసోము లుచితక్రమముల
అచ్చట బ్రహ్మరుద్రాదులతోడ
మచ్చికతో నాత్మమందిరంబునకు
గొనికొని హరిని దోడ్కొని వచ్చి యచట
మునుల సమ్మతమున ముదము దీపింప
భయభక్తు లెసఁగ నా పంకజోదరుని
ప్రియము మీఱ వివాహపీఠమందుంచి

వలనొప్ప తక్కినవారి నందరిని
నలు వొప్ప విహితాసనంబులం దుంచి
విలసితమూర్తులై వెలయు విశ్వేశ
జలజాసనాదులు సభికులు గాఁగ
పరగ శ్రీ పార్వతీభారతీప్రముఖ
తరుణులు పెండ్లిముత్తైదువల్ గాగ
వరుసగా నందు వివాహకృత్యములు
పొరి పొరి నా కశ్యపుఁడు నెరవేర్ప
మంగళస్నానాది మహితకృత్యములు
సాంగంబుగాఁ జేసి నకలోత్సకములు
నలువొప్పగాను పుణ్యాహవాచనము
విలసితస్నాతక వేదవ్రతములు
చేసి కాశీయాత్ర శ్రీహరి చనగ
వాసిగాఁ దోయధి వచ్చి, ప్రార్థించి
కపటనాటక నీవు కాశికేఁగెదవె
యిపుడు నా సుతను నీ కిచ్చెద ననుచు
మగుడి తోడ్కొనిపోయి మందిరమందు
జగదీశ్వరుని నిల్పె సంప్రీతి నపుడు

## స్వామి కళ్యాణము

అనుపమంబైన కన్యావరణంబు
మునివరుల్ జరుపఁగా మురిసి సాగరుడు
పనిఁబూని భక్తితోఁ బంకజాక్షనకు
మనము రంజిల్లగా మధుపర్కమిచ్చి
నవ్యభూషణములు నవ్యవస్త్రములు
దివ్యగంధంబులు దివ్యమాల్యములు
కమలాక్షునకు రమాకన్యకామణికి



ప్రమదంబుతో సమర్పణ మొప్పఁ జేసి
ఘనముగా నా రమాకన్య నా హరికి
తన వధూయుక్తుఁడై దానంబు చేసె
కరమొప్ప నా రమాకన్యకామణిని
కరుణించి హరికరగ్రహణంబుచేసె
నిరుపమంబగు దరనిభ కంఠమందు
సురుచిర మంగళసూత్రంబుఁగట్టె
సరసత మీఱ శ్రీసతి శిరంబందు
తఱచైనవేడ్కతోఁ దలఁబ్రాలువోసె
జలజాక్షుశిరముపై జలరాశికన్య
పొలుపొందఁ దలఁబ్రాలు పోసె నీ రీతి
అక్షతారోపణమ్మైన పిమ్మటను
లక్షణవతియైన లక్ష్మితోఁ గూడ
సలలిత వేంకటాచలవాసుఁ డనఁగ
నలువొప్ప తరిగొండ నారసింహుండు
అలరుచు లాజహోమాదికృత్యములు
వలనొప్ప వేర్వేర వరుసగా నడిపె
నురుతరంబుగ నాలుగోనాఁటి రాత్రి
వరుసగా నిజబంధువర్గంబుతోడ
పొలుపొందఁ దరిగొండపురధాముఁ డనఁగ
విలసిల్లుచున్న శ్రీవేంకటేశ్వరుఁడు
అలమేలుమంగతో ననురాగ మెసఁగ
సలలితమాణిక్య సదనమధ్యమున

## బువ్వముబంతి

పేరైన బంగారుపీఁటలమీఁద
కోరి బువ్వముబంతిఁగూర్చెండె నపుడు

గణుతింప నా గంగ గౌతమి యమున
మణికర్ణికయును నర్మద తుంగభద్ర
మొదలైన జలరాశి ముఖ్యకామినులు
సదమలచిత్తలై సంతోషమెసఁగ
ఘలుఘల్లు మని కాళ్లగజ్జె లందియలు
వలనొప్ప మ్రోయఁగా వచ్చి వేడుకను
పరఁగ నచ్చటఁ బైఁడి పళ్లెరాలుంచి
గరిమతోఁ బాత్రాభిఘారంబుఁ జేసి
బహువిధభక్ష్యముల్ పక్వశాకములు
విహితదివ్యాన్నముల్ వింతపచ్చళ్లు
తఱచైన ఘృతము దుగ్ధములు తేనియలు
పెరు గూరుఁగాయలు ప్రియముగాఁదెచ్చి
వరుసగా వడ్డించి వాసించుజలము
కరమొప్ప సౌవర్ణ కలశాళి నిండ
నించి యందుంచి రా నీరజోదరుని
గాంచి నవ్వుచు నీలకంఠుఁ డిట్లనియె.
జలజాక్ష! నీవు మా జలరాశియింటి
కలుములచెలి నిట్లుగైకొన్నకతన
నసమాన సౌఖ్యంబులబ్బె నీ కిచట
పొసఁగ నాకలి దీర భుజియింపవోయి
మీనరూపము దాల్చి మెండుగా జలము
పానంబు జేసినప్పటివలెఁ గాదు
ఈ నిర్మలాన్నంబు నిచ్చట నీవు
పూని యాకలి దీఱ భుజియింపవోయి
పరగఁ దాఁబేలివై స్వల్పజంతువుల
నరుదుగా భక్షించినటువలెఁ గాదు



అలర నీ కుడుములు నతిరసంబులును
పొలుపొందఁ దృప్తిగా భుజియింపవోయి
దొరకొని పందివై తుంగగడ్డలను
గరగర న్నమలిన కైవడి గాదు
కరజికాయలు వడల్ గారె లిడ్డెనలు
పొరిపొరి రుచులుగా భుజియింపవోయి
పూని నృసింహరూపున దైత్యురక్త
పానంబుఁ జేసినప్పటిరీతి గాదు
తెలివితో నిప్పుడు తేనెపానకము
నలువొప్ప నీవు పానముసేయవోయి
సలలితంబుగ బ్రహ్మచారి వ్రతముల
నలసి యీ వఱకు గృహస్థుఁడైనావు
విమలాత్మ! నియమముల్ విడిచి యీ వేళ
భ్రమదీర నన్నియు భక్షింపవోయి
లలిని బ్రహ్మఋషిత్వ రాజఋషిత్వ
ములఁ గాయపండ్లు నిమ్ముగ మెక్కి దాన
తనియక వెన్నముద్దలు మ్రుచ్చిలించి
తిని దిగంబరుఁడవై తిరిగిననాఁటి
బడలిక దీఱ నీ పరమాన్న మెల్ల
తొడరి నీ వాచేరతోఁ ద్రావవోయి
కలికితనమున నాఁకలి దీరఁబోదు
కులుకుతో నిపుడు సంకోచింపవలదు
భువి నెన్నఁదగు భక్ష్యభోజ్యాదులైన
వివిధపదార్థముల్ వింతగా నిపుడు
ముజ్జగంబుల కాదిమూల మైనట్టి
బొజ్జ నిండఁగ నీవు భుజియింపవోయి

అన విని తరిగొండ హరి నవ్వి శివునిఁ
గని యిట్టులనియె బల్ గారడంబునను
పన్నగాభరణ! యీ పగిది నా తప్పు
లెన్నెద వెపుడు నిన్నెఱుఁగనే నేను
చక్కని పునుక కంచంబు చేపట్టి
యెక్కడెక్కడ బిచ్చమెత్తినఁ గాని
ఆఁకలి దీరక యలనాఁడు విషము
గైకొని మెక్కిన కైవడి గాదు
ఇప్పు డీ దివ్యాన్న మిష్టంబుగాను
మెప్పుగా భుజియింపు మేము సూడఁగను
మును నీవు ఘనభూతముల సంహరించి
దనరార మెక్కి యంతట నైనఁగాని
పరితృప్తిఁ జెందక పావనుండైన
చిరుతొండభక్తుని శిశువుమాంసంబు
భక్షించినటుగాదు బహురుచుల్ గాను
భక్షించు మిప్పు డీ భక్ష్యంబులన్ని
అనలునిఁగంటిలో నణఁచి యున్నావు
గనుక నీ కాఁకలి ఘనముగా నుండు
కావున నిచ్చోట గల పదార్థములు
నీవె బోసేయుము నేఁడు సిగ్గేల
యెల్లవా రెఱుఁగ నీ వీడిగదాని
కల్లుకుండను ప్రుచ్చుగతి డాఁగినావు
గాన మాలిన్యంబు గల దది పాయుఁ
బూని మా యెంగి లిప్పుడు నీవు గుడువు
అని భుక్తశేషాన్న మతఁడారగించు
కనకపాత్రంబులోఁగ్రక్కున వైచె



శంకరుఁడది చూచి సంతసంబంది
పంకజోదరునితోఁబలికె నిట్లనుచు
తోయజనయన! క్షుత్తుకుఁ దాళలేక
బోయదా నెంగిలి బోసేసినావు
కావున దోషంబు గల దది పాయు
నీవు నా యెంగిలి నేఁ డారగించు
అని హరి పళ్లెరమందు శంకరుఁడు
తన భుక్తశేషంబు తప్పక వేసె
అది సూచి శ్రీవిష్ణుఁ డానంద మొంది
మదనారి నీక్షించి మగుడి యిట్లనియె.
పరమేశ! నీ శీలభావంబు పూర్వ
మరుదుగా బోయకన్నప్పకే తెలుసు
నిపుడు నేఁ జెప్పిన నిందున్నవారు
నిపుణత దీపింప నిన్ను నవ్వెదరు
తనరార నా సహోదరిని బార్వతిని
గనుఁగొని కాతు నీ గౌరవంబిచట
అని పల్క విని శివుఁడంబుజోదరుని
గనుఁగొని పల్కె నుత్కంఠ నిట్లనుచు
జలజాక్ష ! వినుము నీ చపలత్వసరణి
గనుఁగొన గోపసుందరులకే తెలుసు
నే నిందుఁ జెప్పిన నిన్ను నవ్వెదరు
గాన చెప్పను రమాకన్యను జూచి
కాచెద నేఁడు నీ గౌరవంబనుచు
సూచింప హరి హరుఁజూచి యిట్లనియె
నిటలాక్ష! వినుము నీ నిశ్చలత్వంబు
దిటమైన మోహినీదేవికే తెలుసు

చలపాది నీ కామ సంకల్పసరణి
లలిమీఱ బ్రహ్మాదులకు నెల్లఁదెలుసుఁ
జెలగి యిందామాట చెప్పిన నీకు
తలవంపులని నేఁడు తాళియున్నాఁడ
అని యిట్లు హరిహరులన్యోన్యముగను
మొనసి భాషింపుచు మురియు నత్తరిని
అల హరి భుక్తశేషాన్న భక్షములు
చెలువొప్పఁ గైకొని శీతాద్రి తనుజ
వరుస నచ్చటి పంక్తివారికందరికి
పరమోత్సవంబునఁ బంచి వడ్డించి
సిరి కిట్టులనియె నో చిగురాకుఁబోఁడి!
శిర మరవాంచి బోసేయకున్నావు
చక్కెరపొంగలి సకలభక్ష్యములు
మెక్క సంకోచ మేమిటికి నీ విపుడు
కులుకుముద్దుల పెండ్లికూతుర వీవె
పొలుపొంద నివియెల్ల భుజియింపవలయు
అని నవ్వుచుండగా నది చూచి యమున
పనిఁబూని హిమశైలబాల కిట్లనియె.
నే మమ్మ పార్వతి! యీ పసిబిడ్డ
నీ మాటలన్న నిన్నెవరు మెచ్చెదరు
పిన్నది నీవు చెప్పినపదార్థములు
పన్నుగా నొకటైన భక్షింపలేదు
మునుకొని బ్రహ్మాండముల నీనినావు
కనుక నీ కడు పతిఘనముగానుండు
అటుగాన భక్ష్యభోజ్యాదు లెన్నైన
పటుతీవ్రముగ నీవు భక్షింపఁగలవు



కొంకక నీ విందుఁగోరినవెల్ల
నింక వడ్డించెద మిపుడారగించు
అనినఁ బార్వతి నవ్వి యమున నీక్షించి
యెనలేని ముదముతో నిట్లని పలికె
నో యత్తగారు! మీ కొనరఁ గూఁతురని
పాయక మద్దత్తు పట్టఁగాఁజేసి
బాలిక చిట్లాని పాలచట్లాని
పాలు ద్రాగ దటంచుఁ బలికితి రిపుడు
బాలికయైన యీ పరమపూరుషుని
తాలిమితోఁగూర్చి తపమెట్లు చేసె
పరగ మా యన్నయౌ బ్రహ్మాండమయుని
గుఱుతుగా వలపించుకొన నెట్లు నేర్చె
విశదంబుగాను భావింప మీ తనయ
పసిబిడ్డ యెట్లగు బహుసూత్రధారి
అది యెట్లనంటె మహాసాత్వికులకె
పొదుపైన గర్వంబు పుట్టింప నేర్చు
కపటంబుతో కాలగతుల భావించి
యెపుడు పేదలనైన హెచ్చింపనేర్చు
మునుకొని హెచ్చించి మోసంబు చేసి
ధనమదాంధులనైనఁ దగ్గింపనేర్చు
నీ పెండ్లికూఁతురే యెల్లజాతులను
చాపల్యమున మించి చరియింపుచుండు
కావునఁ బసిబిడ్డ గాదు మీ మాట
లీ వేళఁ గాదననేల నా కడుపు
గొప్ప యంటిరి నేను కోరిన వెల్ల
నిప్పుడు వడ్డింప కేల దాచెదరు

అన విని తుంగభద్రాదులు నగుచు
ఘనపదార్థములన్ని గ్రక్కునఁ దెచ్చి
రాసులు వోసి పార్వతిని వీక్షించి
బోసేయుమన శైలపుత్రి యిట్లనియె.
నొనర వడ్డించితిరో యత్తగారు
పనిఁబూని యాఁకలి పాయునే దీన
డీకొని మీరు వడ్డించిన వెల్ల
ప్రాకటంబుగ నొక్కపంటికి రావు
పొలుపొంద ననుఁ దృప్తిఁ బొందింత మనుచు
పలికితి రదియు దబ్బఱలాయెఁ గాని
చెలువొప్ప మా యన్న శేషాద్రిమీఁద
పులియోగిరము మంచిపొంగళ్లు ఘృతము
పొసఁగ దధ్యోదనంబు బకాళభాతు
నసమానరుచి మనోహరములిడ్డెనలు
అతిరసంబులు దోసె లప్పముల్ వడలు
ప్రతిలేని శర్కర పరమాన్నములను
మెచ్చి తా  భుజియించు మీ యట్టివారు
వచ్చిన నన్నమవారిగా నొసఁగు
అటువంటిఘనుఁడు మీ యల్లురికంబు
నెటువలె సైరించు నిదియేల చాలు
పెనుపొంద మీరింత పేదవారైతె
ఘన మేమి మీ రమాకన్య నెత్తుకొని
వెంకటాద్రికి వచ్చి వెలయు మా యన్న
కంకితముగ వివాహముఁజేసి యచటఁ
గల పదార్థములు మీ కడుపుల నిండ
చెలువంబు నిండ బోసేసి రారాదె



ఉప్పు కప్పలు చేఁప లుండు మీ యింట
తప్పఁగ ఘనపదార్థంబు లెక్కడివి
అప్పుడు డంబార్థమై మమ్ము నిటకు
రప్పించి కడుపులు రట్టు చేసితిరి
పొలుపొంద మీ భక్ష్యభోజ్యాదు లిపుడు
లలిమీఁద మాకుఁజాలవు నిక్కముగను
పూని మమ్మును దృప్తి పొందింపలేక
దీనత్వమున నోడితిరి మీరలనిన
విని నీలకంఠుండు వికవిక నవ్వి
తన సతి నీక్షించి తగ నిట్టులనియె.
పార్వతి! మీ యన్న బ్రహ్మాండకుక్షి
సర్వభక్షకుఁ డిది సత్యంబు గనుక
కడుపు నిండదు వంటకం బెంతయైన
కడఁకతో జలధికిఁ గల పదార్థములు
ఉప్పుతో సంతతం బూరుచున్నట్టి
కప్పలు చేఁపలు గలవంటి వపుడు
కావున వారికి గల పదార్థములె
యీ వేళ వడ్డింతు రెన్నైన నవియు
మెండుగా మీ యన్న మెక్కిన కడుపు
నిండుఁ దక్కినవెల్ల నీవారగించు
చెలియ మీ యన్నకు శేషాద్రిమీఁద
కలిగియున్నవి వడ్డికాసులు కనుక
పేరైన చేరుడుబియ్య మన్నంబు
సార మింపుగలేని చప్పి డన్నంబు
కాటువోయిన పంటిగంజిసాదంబు
మేటిగా బోసేసి మెరయుచునుండు

అటువంటివారి కీ యలఘుదివ్యాన్న
మెటువలె సైరించు నిదియేల చాలు
నిప్పుడు మీ యన్న కిది చాలదంటె
తెప్పింతు నా మంచి తిరుపణాచాఱు
అని కేరడముఁ జేసినటువంటి విభుని
గనుఁగొని హిమశైలకన్య యిట్లనియె.
స్వామి! మా జలజాక్షుసంపద దెలసి
యీ మాడ్కి మీరంటె యేమి చెప్పుదును
మా యన్న తిరుపణామధు సంతతంబు
పాయక భుజియించు భక్త్యాళితోడ
తెరగొప్ప నటుగాన తిరుపణాచాఱు
హరికి సయింప వయ్యావి యెందుఁగాని
తెప్పింపుఁ డటువంటి తిరుపణాచాఱు
మెప్పుగాఁగ్రోలును మీ చెల్లె లనిన
నగి యిట్లు పలికె నా నాగకంకణుఁడు
నగజ! మా లక్ష్మి నిట్లనినందు కిపుడు
సుదతి! మీ యన్న చూచుచు నుండఁగానె
యదె చూడు నీ చెంప లదర వేసెదను
సరవి నా చెల్లెలి సత్కటాక్షమున
నరులలో మీ యన్న నడిమికి వచ్చె
అదిగాక గుణహీనుఁడైనట్టి వాఁడు
కుదురుగా నేటికి గుణవంతుఁడయ్యె
చెలఁగి మా చెల్లెలిఁ జేపట్టెఁ గనుక
వెలయు మీ యన్నకు విరి వింత గలిగె
అంతకు ముందు ముచ్చె డాఁగియుండ
నింతగా మీ యన్న యెవరికిఁ దెలుసు



అన విని తరిగొండహరి మహేశ్వరునిఁ
గనుఁగొని పల్కె నుత్కంఠ దీపింప
నందివాహన! నీవు నా సహోదరిని
మందుఁడవై యిన్ని మాట లాడితివి
మున్ను నా చెల్లెలిమ్ముగ నిన్నుఁగలసి
మన్నించి నీ కింత మహిమ గల్పించె
అప్రమాణుఁడవు నీవై యుండఁగాను
సప్రమాణునిఁజేసి జగతిలో నిలిపె
అరయ ననాకారివై యున్న నీకు
మరి సుందరాకారమహిమ గావించె
వెలయు మా చెల్లెలి వీక్షింపకున్నఁ
దెలియదే నీ పరదేశిత్వ సరణి
అనఘ! నీ చెల్లెలే యధికురాలనుచుఁ
దనర నా చెల్లెలిఁ దక్కువ యనుచు
పలికితి వపుడెంతొ ప్రౌఢుఁడవుగను
నెలవొప్ప వినుమైతె నీ చెల్లెరీతి
యొనర నుండినచోట నుండక తిరిగి
జనులను వంచించు చపలాత్ముౘరాలు
కావు మా శైలకన్యకసాటి
యే విధంబునఁగల్గ దీ మాట లేల
అప్పుడు నీవు నెయ్యంబుతో మాకు
దెప్పింతు నంటివి తిరుపణాచాఱు
తప్పక మాకిట తనివి దీరఁగను
తెప్పించు మది యెంత తెప్పించఁగలవొ
నా కడు పందునైనను నిండకున్న
నీకుఁ జంద్రునికళ నిపుడు దాగింతు

చల్లనితిరుపణాచాఙు ద్రావుటనె
తొల్లిటినుండి చందురునకు నీకు
తెల్లగా నుండెడి దేహంబు గలిగె
కల్ల గా దీ మాట కన్య మీ సొమ్ము
ఇంక మాట్లాడకు మింతియే చాలు
శంకర బోసేయు సంతసంబునను
అని పకపక నవ్వె నప్పు డా హరిని
గనుఁగొని పలికె సాగరుఁడు నవ్వుచును
జలజాక్ష! నీవును శర్వాణివిభుఁడు
బలవంతు లానందభరితు లన్నిటను
ఒక్క రొక్కరికన్న నుత్తమోత్తములు
తక్కక మీకు భేదము లేదు గనుక
మొనసి నవ్వులకు బల్ ముచ్చట మీఙ
ననుకొంటి రీ మాట లానందముగను
జలజాక్ష! మితిలేని జలజభాండములు
పొలుపొంద నెపుడు నీ బొజ్జలో నుండు
కావున నీకు నాఁకలి దీరఁదృప్తి
గావింప మేమెంత గలవార మరయ
మాకుఁగల్గినయంతమాత్ర మీ వేళ
చేకొని నీవు భుజింపవే యనిన
జలజాసనాదు లా జలరాశి మాట
కలరుచు మేలు మేలని మెచ్చిరపుడు
హరిహరుల్ ముదమంది రందరితోడ
పొరిపొరిఁ దృప్తిగా భుజియించి లేచి
పరిశుద్ధముగఁ గర ప్రక్షాళనములు
వెరవొప్ప నయ్యె నా వేళనందరికి



విలసితలీలల విడెము లిప్పించి
తలకొని యిష్టకథావినోదముల
సలలిత వేంకటాచలవాసుఁడనఁగ
నలువొప్పఁ దరిగొండ నారసింహుండు
అమిత సంతోషమగ్నాత్ముఁడై చెలఁగి
కొమరొప్పఁగా నందుఁ గొలువు గూర్చుండె
శ్రీ వేంకటేశుఁ డాశ్రితజనావనుఁడు
పావనాచారుఁడు బ్రహ్మాండమయుఁడు
పన్నగశయనుండు భవవిదూరుండు
నన్నేలు తరిగొండ నారసింహుండు
అంత నచ్చటనుండి హాటక కలశ
మెంతయుఁ బ్రీతితో నెలమి నెత్తుకొని
వేఱొక్కవిడిదికి వేడ్కతో నరిగె
నా రీతి దెలిసి గంగాదు లైనట్టి
సాగరాంగన లెల్ల సకలోత్సవముల
వేగ శ్రీలక్ష్మిని వెంటఁబిల్చుకొని
వింతగా హరియున్న విడిదికిఁ బోయి
సంతోషమున రమాసతిచేత నపుడు
విహితంబుగా నాదివిష్ణుదేవునకు
రహిని సర్వోపచారములు చేయించి
పిలువు నీ పతి నని ప్రేరేపఁదాను
కిలికించి తాపాంగకించిదానమిత
యగుచు నాయకుని మోమల్లనఁజూచి
వగ గుల్కఁబిలిచె నవ్వనిత యిట్లనుచు
జలజాతనయన! నా స్వామి యిచ్చటికి
యలసి వచ్చిన దేమి యాన తీవోయి !

నిపుణత్వ మెఱుఁగక నే నిందుఁ జేయు
నపచారములకు నీ వలిగి వచ్చితివొ
వెలయ మజ్జనకు నివ్వేసాలచేత
నళికింపఁ దలఁచి నేఁడలిగి వచ్చితివొ
నెట్టన మా తల్లి నీకు వడ్డించి
నట్టి యన్నము చాల కలిగి వచ్చితివొ
ప్రాకటంబుగ సర్వభక్ష్యాళి మెక్కి
యాఁకలి దీర కిట్లలిగి వచ్చితివొ
పన్నుగాఁ జెల్లెలౌ పార్వతి కచట
నన్నంబు సాల కిట్లలిగి వచ్చితివొ
తిరుపణాచార్యైనఁ దెప్పింతు ననిన
హరుని వాక్యముల కిట్లలిగి వచ్చితివొ
పేదవారింటిలోఁబెండ్లి యాడితిని
యాదాయ మే మని యలిగి వచ్చితివొ
అనఘ! పెండ్లికిఁదీసి నప్పెట్లు దీర్తు
నని విచారమున నిట్లలిగి వచ్చితివొ
సారిదిగా వడ్డికాసులు గూడఁబెట్టి
పరగ వరాల నేర్పఱుప వచ్చితివొ
చాల నీ కుపదలు సమకూర్పఁగలము
లే లక్ష్య మేమింక లేచి రావోయి
బుస్సుబుస్సున నల్కఁబూని వచ్చితివి
లెస్సాయె నిఁకఁజాలు లేచి రావోయి
బాలుని రీతి నిబ్భంగి నల్గుదురె
లీలావినోదుఁడై లేచి రావోయి
యెలమి మాలోఁదప్పు లెన్ని గల్గినను
తొఁలగి రాఁదగునె ముద్దుల స్వామి యిపుడు



అపరాధములు గాచు నటువంటి నీకు
కపట మేమిటికిఁజక్కని ముద్దుసామి
తటుకున వెన్నముద్దలు ముచ్చిలించి
నటువలెఁగలశ మిందవలీలగాను
చెలఁగుచు నేఁడు ముచ్చిలి తెచ్చినావు
వలనొప్ప శివుఁడు నవ్వఁడె ముద్దుసామి
మొనసి నీ కంచంబు ముచ్చిలించుటకు
పనిఁబూని బలు నగుబాట్లయ్యె ననుచు
సిగ్గుతో పార్వతి శివుఁజూచి వెఱచి
తగ్గుచున్నది సహోదరి దిక్కు చూడ
శివుఁడు చంద్రుఁడు నీవు చేసినపనికి
యవిరళంబుగఁ జాల హాస్యంబు సేయ
తలచుచున్నా రింక దయజేసి లేచి
నెలవొప్ప రావోయి నీకు మ్రొక్కెదను
మహనీయ! శేషహోమముఁ జేయవలయు
విహితంబుగా లేచి వేగ రావోయి
యెదురు సూచెదరు బ్రహ్మేంద్రాదు లచట
సదమలచరిత నా స్వామి రావోయి
నలువొప్ప నెట్లైన నన్ను మన్నించి
సలలితహృదయ! నా స్వామి రావోయి
అని యిట్లు ప్రార్థించునటువంటి సతిని
గని హరి దరహాసకలితాస్యుఁ డగుచు
యిందిర కరపద్మ మింపొందఁ బట్టి
యందుండి కదలి మహావైభవమున
వచ్చి తత్పూర్వవివాహపీఠమున
హెచ్చుగాఁ గూర్చుండి యిందిరతోడ

మహనీయ శేషహోమముఁజేసి యపుడు
సహజంబులై చెల్లు సకలకృత్యములు
వరుసగా నెరవేర్చి వరలగ్నమందు
హరి తోయధిని జూచి యమర నిట్లనియె
మామ సోముఁడు మీరు మా యత్తగారు
శ్రీమహాలక్ష్మిని జెలఁగి తోడ్కొనుచు
అజ రుద్ర నిర్జరేంద్రాదులతోడ
భుజగశైలమున కిప్పుడు వచ్చి యచట
గల విశేషములు మీ కన్నులఁ జూచి
యలర మీ సుతను మమ్మాశీర్వదించి
మగుడ వత్తురు రండి మా వెంట ననఁగ
యగజాధిపతి ముఖ్యులంద ఱా రీతిఁ
బ్రియముతో రండని పిలువఁగా జలధి
భయభక్తు లెసగఁ దప్పక సమ్మతించి
వివిధభూషణములు వివిధాంబరములు
వివిధంబులగు వస్తువితతులు దెచ్చి
హరికి రమాకన్య కపుడు నొప్పించి
మఱి మఱి సంతోషమగ్నుఁడై చెలఁగి
హరి పద్మభవ నిర్జరాదుల వారి
వరవధూమణులను వరుసఁ బూజించి
బహురత్న భూషణాంబరము లర్పించి
సహజంబుగాను శ్రీసతికి వేడుకను
పరగ ముత్యపుటొడిఁబ్రాలు గట్టించి
మురిపంబు మీఱ నా ముద్దుపట్టికిని
అరణంబుగాను దివ్యాశ్వబృందముల
కరి రథావళులను గల పదార్థముల



దాసదాసీజన తతులతో నిచ్చి
వాసుదేవునివెంట వచ్చె నత్తఱిని
అలరార బ్రహ్మరుద్రాదులందుండి
నలువొప్ప నిజవాహనము లెక్కి రపుడు
సంతోషచిత్తుఁడై జలజలోచనుఁడు
వింతగా నందఱ వేడ్కఁదోడ్కొనచు
అతివతో గరుడవాహనముపై నెక్కి
హితబంధుజన పురోహితులు సేవింప
తొలఁగక మంగళతూర్యముల్ మొరయఁ
జెలువంబు రెట్టింప శేషాద్రిఁ జేరి
సులలిత మైనట్టి శుభలగ్నమందు
వెలయఁగా నగరు ప్రవేశించి యచట
పోఁడిమితో నంతఁ బురహరాదులకు
వేడుక దీపింప విందు చేయించి
పరగ శ్రీ పార్వతీపరమేశ్వరాది
వర దంపతుల కెల్ల వరుసగా నపుడు
తనరారఁ జందనతాంబూలములను
కనకాంబరములను గరుణ నిప్పించి
హరి వీడుకొల్ప బ్రహ్మాదు లందుండి
మురియుచు నిజపురంబులఁజేరి రంత
జలరాశి పైనమై జలజాక్ష! మాకు
సెలవిమ్ము కలుములచెలితోడ ననిన
నో మామ! మీ కన్య నొక క్షణంబైన
నీ మీఁద విడిచి నే నిందుండలేను
అటుగాన సిరిని నే నంపఁగాఁజాల
నెటులైన నోర్చి నీ విఁకఁబోయిరమ్ము

అని హరి పల్కఁ జింతాక్రాంతుఁ డగుచు
వనధి యిట్లనియెను వనజాక్షుఁ జూచి
శ్రీపన్నగాద్రీశ! చిదచిద్ద్వయేశ!
పాపాహివిహగేంద్ర! పటుకృపాసాంద్ర!!
సర్వేశ్వరుఁడ వీవు సర్వాత్మ వీవు
సర్వసాక్షివి నీవు సద్బ్రహ్మ వీవు
కావున నీ వెఱుంగనినీతి గలదె
భావింప శ్రీసతి ప్రౌఢ గా దిపుడు
యీ పసిబిడ్డ నిందిరవుగా నుంచి
యీ పట్లఁ బోను కాళ్లెట్లాడు మాకు
నిపుడె మమ్మెడఁబాసి యీ చిన్నిబాల
నిపుణత్వమున నిందు నిలువ నెట్లోపు
మా యింట నాటలే మరగిన యబల
మీ యింటఁ బనులలో మెలఁగ నెట్లోపు
పొసగ బ్రహ్మాండరూపుని నొప్ప మిమ్ము
విసువక సేవించువిధము లే మెఱుఁగు
చాలఁ దల్లులచెంతఁ జనవుగా నుండు
నీ లేమ భయభక్తులెఱుఁగునే యిపుడు
కావున దయచేసి కమల! నీమాటు
మా వెంట నంపవే మహితాత్మ!యనిన
వనజోదరుఁడు నవ్వి వకుళమాలికను
కనుసన్న సేసి సాగరుదిక్కుఁ జూపె
వకుళమాలిక హరివాంఛితం బెఱిఁగి
యకలంకముగఁ బల్కె నబ్ధి నీక్షించి
జలధి! నీ బహుజన్మసంస్కారమహిమ
వలన నియ్యాదిదేవత కూఁతురయ్యె



వేదాంతవేద్యుఁడై విశ్వాత్ముఁడైన
ఆదిమహావిష్ణు వల్లుఁడై వెలసె
కావున నీ భాగ్యగౌరవ మహిమ
భావించఁదరమె యా బ్రహ్మకునైన
నెమ్మది నటుగాన నీవు నీ సుతను
సమ్మతి నుంచు మీ స్వామి చెంగటను
అలర మీ కన్న నే నధికంబుగాను
కలుములచెలి నిందు గారవించెదను
హరికటాక్షము గల్గినపుడు మీ సుతకు
గురుసౌఖ్యములకుఁ దక్కువ లేదు గనుక
సంతోషమున రమాసతిని మా స్వామి
చెంతనే నిల్పుఁడీ చింత యేమిటికి
అనఘ! యీ స్వామి చిత్తానుగుణ్యమున
మనకు వర్తించుట మర్యాద యనిన
సాగరుఁ డా మాట సమ్మతించుకొని
వేగ భార్యలకు నవ్విధము బోధించి
అమ్మ! రమ్మని సిరి నంకపీఠమున
నెమ్మదితో నుంచి నెమ్మోము నిమిరి
ఓ యమ్మ! యిచట నిన్నుంచి పొమ్మనుచు
మా యల్లుఁడైన యీ మధుసూదనుండు
పలుకుచున్నాఁడు నీ పతియాజ్ఞలోనె
నిలువు నీవిచ్చటనే సమ్మతమున
కలకంఠి! నీ పతి కనుసన్న లోనె
మెలఁగుచు మాకు నెమ్మిని గీర్తి దెమ్ము
వనజాక్షి! యిచ్చటి వకుళమాలికను
మనము రంజిల్లఁగా మన్నింపుచుండ

పతి సేవ్యుఁడెపుడు కోపము చేసినపుడు
హితవులు సెప్పి నవ్వేలమిఁ దోఁపించు
పన్నుగా వచ్చిన భక్తకోటులకు
నన్నపానము లిచ్చి యపుడాదరించు
అలరి మున్నటిరీతి నాట్లాడవలదు
పొలుపొందఁబెత్తనంబు వహించియుండు
పరగ నింతైన లోభగుణంబు లేక
వరము లందరికి నవారిగా నిమ్ము
వెలయ నీ పతి యొకవేళ నవ్వులకుఁ
జెలఁగి తగ్గించి హెచ్చించినఁగాని
కలగ కత్తఱిని తగ్గక హెచ్చకపుడు
పొలుపుగా నొక విధంబున సేవసేయు
మకుటిలానందాత్ముఁడై నందువలన
నొకవేళ సంతోష ముప్పొంగఁగాను
నీ పతి పరభామినీసక్తుఁడైనఁ
గోపంబులేక మక్కువను మన్నించు
మొనర నహంకార మొకవేళనైన
జనియింప నీకు నీ స్వాంతంబునందు
పరగఁ గాంతలకెల్లఁ బతిభక్తిదక్క
నిరతంబు మఱి యొక్కనియమంబు గలదె
వరపతివ్రతయైన వనితకు జగము
కరతలామలకంబుగాఁ గానవచ్చు
కావునఁబతిభక్తి ఘనముగా నాత్మ
భావించి నీవు నీ పతిఁగొల్చియుండు
యీ పరమాత్మున కిల్లాలవైన
నీ పుణ్యమహిమ వర్ణింప నా వశమె



తల్లి! నే నినుఁగాంచి ధన్యుండనైతి
చల్లఁగా వర్ధిల్లు సర్వకాలంబు
పొలుపొంద మే మింకఁ బోయి వచ్చెదము
నిలువు నీ పతిచెంత నీవు వేడుకను
అని బుజ్జగించి నెయ్యంబు రెట్టింప
తన వధూమణుల నందరఁ జేరఁ బిలచి
వారిచే శ్రీరమావనిత కావేళ
కూరిమి బహు రత్నకోటు లిప్పించి
మురువొప్పఁగౌస్తుభముఖ్యసన్మణులు
హరికి సమర్పించి యతిభక్తిఁ బెంచి
చెలువొప్పఁజక్రికి సిరి నొప్పగించి
బలుజాలి మాలితోఁ బలికె నిట్లనుచు
శ్రీ శేషగిరివాస! చిరదరహాస!
వాసిగా నా మీద వాత్సల్య ముంచి
పసిబిడ్డయైన నా పట్టిని నీవు
కుశలంబుగా నేలుకొనుచు సత్కృపను
తప్పొప్పులను దిద్ది దయను మన్నించి
యుప్పతింపక ప్రోచు టుచిత మీ సతిని
నీలనిభాకార! నీళ్లలో ముంచు
పాలలో ముంచు నీ భార మీ మీఁద
అని యొప్పఁజెప్పఁ జింతాక్రాంతుఁడైన
వనధి కిట్లని పల్కె వాసుదేవుండు
ఓ మామ! మీ పట్టి నుచితంబుగాను
ప్రేమతో మీరు చెప్పిన చందముననె
పరిపాలనముఁజేతు ప్రఖ్యాతిమీఱ
నురమునందిడుకొని యుందు సంతతము

స్వాంతంబులో నీవు సంతసంబందు
చింతింప వలదని చెప్పి శ్రీసతిని
మన్నించి కౌస్తుభమణితోడ నపుడు
పన్నుగా వక్షంబుపైన నుంచుకొనె
అంత సాగరునకు నతని భార్యలకు
సంతోష మెసఁగ నా జలజాంబకుండు
బహుదివ్యభూషణాంబరము లిప్పించి
విహిత సత్కరుణతో వీడ్కొల్పె వారు
నిజనివాసముఁ జేరి నిరతంబు హరిని
భజియింపుచుండి రా పద్మాక్షుఁడిచట
నెలవుగా నానందనిలయంబునందు
వలనొప్పఁగా శ్రీనివాసాఖ్య నమరి
అరుదుగా బ్రహ్మోత్సవాదుల మఱియు
నిరుపమానములైన నిత్యోత్సవముల
పరముఁడు సంతోషభరితుఁడై చాలఁ
బరుస నాకర్షించి బహుభాగ్యములను
వరుసగాఁ గైకొని వారికి వివిధ
వరము లిచ్చుచు మహావాత్సల్యమునను
నా పాలి తరిగొండ నరసింహుఁడగుచు
శ్రీపన్నగాద్రిపై స్థిరముగా వెలసె
నా పెన్నిధానమై నైజమోక్షంబు
చూపుచు ననుఁ దన సొమ్ముచేసికొని
కుదురుగా నన్నేలు గురుఁడు తా నగుచు
ముదమొప్పఁ దత్త్వార్థములను దెల్పుచును
అలుమేలుమంగతో నానందముగను
సులలితలీలల సుఖియింపుచుండె



అని యిట్లు శేషాచలాధీశుఁడైన
కనకాంబరునిపేరఁ గమలేశుపేర
వలనొప్పఁగా నందవరకులోద్భవుఁడు
చెలువొంద నమలవాసిష్ఠగోత్రుండు
వసుధలో కాసాలవంశవర్ధనుడు
రసికుఁడౌ కృష్ణార్యరమణి మంగాంబ
సుత వెంగమాంబ భాసురభక్తితోడ
ప్రతిలేని శ్రీరమాపరిణయం బనెడి
వరకృతి ద్విపదకావ్యముగా రచించి
నరులెన్నఁ దరిగొండ నరసింహుఁడైన
సదమలవేంకటాచలపతి దివ్య
పదయుగళికి సమర్పణము గావించె
కోరి సుబ్రహ్మణ్యగురు కటాక్షమున
సారమై యీ కృతి సార్వకాలంబు
భూచక్రమున మహాపుణ్యులు చదువ
నా చంద్రతారార్కమై యుండుఁగాత!

******

## శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠం ద్వారా ప్రచురింపబడిన గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | తెలుగుమెఱుగులు | 2008 |
| 2. | కావ్యమంజరి | 2008 |
| 3. | అన్నమాచార్యచరిత్రపీఠిక | 2008 |
| 4. | సింహావలోకనము | 2009 |
| 5. | పూలవిందు | 2010 |
| 6. | ప్రజ్ఞాప్రభాకరము–గురుపూజ | 2011 |
| 7. | వేటూరిప్రభాకరశాస్త్రి వాఙ్మయసూచిక | 2012 |
| 8. | కేయూరబాహుచరిత్ర | 2012 |
| 9. | శ్రీ వేంకటేశ్వర స్తుతిరత్నమాల | 2013 |
| 10. | వేటూరివారి పీఠికలు మొదటిభాగం | 2013 |
| 11. | వేటూరివారి పీఠికలు రెండవభాగం | 2013 |
| 12. | చాటుపద్యమణిమంజరి 1వ భాగము. | 2013 |
| 13. | చాటుపద్యమణిమంజరి 2వ భాగము. | 2013 |
| 14. | సుభద్రా కళ్యాణము | 2013 |
| 15. | సుగ్రీవ విజయము. | 2013 |
| 16. | బసవపురాణము (బసవోదాహరణమును అనుబంధంగా) | 2013 |